# రమణ భాషణములు ఐదవ సంపుటం

## భాషణములు 401

ఆంధ్రుడు, శ్రీ కృష్ణమూర్తి ప్రశ్నించాడు -- "తపస్సు నిల్పాలి? మనస్సు జపించే దానిపై ఉంటుంది. చేసే వేళ దృష్టిని ఎక్కడ

మహర్షి: తపస్సు దేనికి?

భక్తుడు: ఆత్మసిద్ధికి,

మ: అలాగే, తపస్సు చేసేవాని సామర్థ్యాన్ని బట్టి ఉంటుంది. చింతనకొక

రూపుకావాలి. కాని అంతమాత్రం చాలదు. ఎవ్వడూ ఒకరూపం వైపే నిరంతరంగా చూస్తూ ఉండగలడా? విగ్రహ స్థానంలో జపాన్ని నిలపడం అందువల్లనే. కంటి దృష్టితోపాటు, మనస్సును రూపంమీద నిలుపుతుంది జపం. ఈ యత్నాలవల్ల చిత్తైకాగ్రత కలుగుతుంది; అది గమ్యానికి చేరుస్తుంది. సాధకుడు తానేమీ కావలెననుకుంటాడో, అదే అవుతాడు. కొందరు రూపం యొక్క నామ మాత్రంతో తృప్తిచెందుతారు. ప్రతి రూపానికి ఒక పేరు కావాలి. ఆ నామం దైవం యొక్క గుణవిశేషాన్ని తెలుపుతుంది. అవిరళ జపం ఇతరాలోచన లన్నిటినీ తొలగించి మనస్సును నిశ్చలం చేస్తుంది. అదే తపస్సు. ఏకాగ్రతే మనం కోరే తపస్సు అసలు ఎందుకు తపస్సు అని తెలిసికోడానికి, తపస్సు అంటే ఏమిటి అని ప్రశ్న వచ్చింది. ఉద్దేశ్యాన్ని బట్టి తపస్సు యొక్క రూపం ఉంటుందని జవాబు.

భ: శరీరంతో చేసే నియమాలూ వ్రతాలూ - అవిగూడ తపస్సు కాదా?

మ: ఒక విధంగా కావచ్చు. అట్టివి వైరాగ్యంవల్ల గూడ ఉండవచ్చు.

భ: చేతిని పైకి ఎత్తి ఉంచి జీవితం అంతా ఉన్నతనిని నేను చూసాను.

మ: అది వైరాగ్యం.

భ: ఆశయసిద్ధికి శరీర శోషణం ఎందుకు చెయ్యాలి?

మ: నీ దృష్టిలో అది శరీర శోషణం, లేదా వానికి అది వ్రతం లేదా మొక్కు వేరే వానికి అది ఒక విజయం, ఆనందం.

ధ్యానం అంతరంగంగానూ, బహిరంగంగానూ రెండూగాను ఉండవచ్చు. బహిర్ధ్యానం కన్న జపము మేలు. అది నీ స్వభావమే అయ్యేంతవరకు ధ్యానాన్ని సాగించాలి. అది యత్నంతో మొదలై, చాలా కాలం చేయగా అది తనంతతానే సాగుతుంది. అది స్వభావమే అయితే దాన్ని ఆత్మసిద్ధి అంటారు.

ఇతర పనులు చేస్తూ గూడ జపం సాగిస్తూనే ఉండవచ్చు. ఉన్నది ఏకైక సత్యమే. అది రూపం, జపం, మంత్రం, విచారం ఎలాంటి ప్రయత్నమైనా కావచ్చు. అవన్నీ ఆఖరుకు ఆ ఏకైక సత్యంగా సిద్ధించేవే. భక్తి, జప విచారములు అనాత్మను ఆవలకు నెట్టే ఉపాయాలు. ఈ మిథ్య ఇప్పుడు ఒక పిచ్చి (obsession). సత్యం మన స్వరూపం. ఆలోచనలనూ, లోకవ్యవహారాలనూ అంటే మిథ్యను, మొండిగా తప్పుగా పట్టి ప్రేలాడుతున్నాము. ఇవి మానితే సత్యం తెలుస్తుంది. మన యత్నాలన్నీ ఆ మిధ్యను తొలగద్రోయడానికే. దానికి సత్యాన్ని ఆలోచించడం మొక్కటే ఉపాయం. అది మన సహజస్వభావమే అయినా, అది మనం ఆలోచించవలసిందిగా అగుపిస్తుంది. కాని మనం చేస్తున్న పని నిజంగా మన -

స్వరూపాన్ని వెలువరచడంలో గల ఆటంకాలను తీసివేయడమే. ధ్యానం లేక విచారం, కేవలము ప్రత్యావృత్తి -- ఉన్నచోటికే అంటే సహజ స్వభావ స్థితికే తిరిగి రావటం.

భ: మన ప్రయత్నాలు నిస్సంశయంగా ఫలిస్తాయా?

మ: ఆత్మస్థితి మన సహజ స్వభావము. మరల పొందవలసిన క్రొత్తదేమీ కాదు. క్రొత్తది నిత్యం కాలేదు. కాబట్టి ఆత్మ లభించునా లభింపదా అన్న సందేహం కలిగే పనిలేదు.

## భాషణములు 402

హృదయమూ మెదడు గూర్చి భాషిస్తూ శ్రీభగవాన్ ప్రాతఃకాలపు ఘటన నొకటి స్మరించారు.

కావ్యకంఠ గణపతిముని మెదడే అత్యంత ప్రధాన స్థానమని వాదించారు. కాదు, హృదయమంతకన్నా ముఖ్యమన్నారు భగవాన్. చాలమంది ఈ సంవాదాన్ని జాగ్రత్తగా వింటున్నారు. కొన్నాళ్ళ తర్వాత శ్రీ భగవాను ఒక ఉత్తరం వచ్చింది. ఎస్.ఎస్. అరుణాచలం అనే కుర్రవాడు ఈ సంవాదం పై ఇంగ్లీషులో వ్రాసిన పద్యమందున్నది. అప్పటికతడు మెట్రిక్యులేషన్గూడ పూర్తిచేయలేదు.

ఆ పద్యంలో కవితా ప్రతిభ అద్భుతంగా ఉంది. హృదయం శ్రీ భగవాన్, మెదడు శ్రీ కావ్యకంఠులు, అక్కడ ఉన్న మిగిలిన అందరూ శరీరం. అలాగే భగవాన్ సూర్యుడు, కావ్యకంఠులు చంద్రుడు. అక్కడ ఉన్నవారు భూమి, సూర్యకాంతి చంద్రునిలో ప్రతిఫలిస్తుంది. భూమి ప్రకాశితమైనది. అలాగే హృదయమిచ్చిన ఎరుకలో మెదడు వర్తిల్లుతుంది. తనువు రక్షిత మౌతుంది. (ఈబోధ రమణగీతలో కూడ ఉంది). హృదయ మత్యంత ప్రధానమైన కేంద్రం. అందుండి ప్రాణశక్తి, ప్రకాశములు మెదడుకు ప్రసరించి దానిని కార్యకరణ సమర్ధము చేస్తాయి. అత్యంత సూక్ష్మ రూపములతో హృదయంలో అంతరితములై యున్న వాసనలు మెదడును చేరుకుంటాయి. మెదడు వానిని సినీ దృశ్యంలోవలె అత్యంత విస్తృతరూపాలుగా పెద్దవి చేసి, ప్రతిబింబించి ప్రసరింపచేస్తుంది. ప్రపంచం సిని దృశ్యంకంటే భిన్నంగాని, అధికంగాని, కాదనడం అందువల్లనే.

దానికి కొంత కలుపుతూ శ్రీభగవాన్ ఇట్లన్నారు - వాసనలు హృదయంలో కాకుండా, మెదడులోనే అయితే, తల తెగవేస్తే, అవి నాశనం అయిపోవాలి. అట్లయితే పునర్జన్మలే ఉండవు. కాని అట్లుకాదే, ఆత్మ వానిని తనకత్యంత సన్నిహితంగా పదిలపరుస్తుందనటం స్పష్టమే; ఆ దాచటం తనలోనే - హృదయంలోనే. లోభి తన నిధులను తనచేయి దాటనీక తనలోనే దాచుకొనే రీతిగా. కాబట్టి వాసన లుండేచోటు ఆత్మయే, హృదయమే, మెదడు కాదు. (మెదడు కేవలం వాసనల నాటక రంగం, హృదయం వాని నేపథ్యము)

## భాషణములు 403

మాడరన్ సైకలాజికల్ రివ్యూలో ఒక వ్యాసం - దానిలోని విచికిత్స

1. హృదయకేంద్రం ఎచ్చటనో నిర్ధారించటం ఏ పరికరాలతోనైన సాధ్యమా?

2. ఆధ్యాత్మిక సాధనలో పరిణతులైన వారి అనుభవాలను యంత్రలేఖన చేయటానికి తగిన, సుముఖులైన తత్త్వ సాధకులు దొరకుతారా?

ఎవరికి తోచింది వారు మాట్లాడుతున్నారు. శ్రీభగవాన్ అన్నారు "ఆత్మసాక్షాత్కారము" (సెల్ఫ్ రియలైజేషన్) గ్రంథంలో, నేను నిశ్చేతుణ్ణయినానని, మృత్యులక్షణాలు నన్ను పైకొన్నవని వ్రాశారు. అంతసేపూ నేను తెలివితోనే ఉన్నాను. నా

భౌతిక హృదయ స్పందనం ఆగటం, అదే వేళ హృత్ కేంద్రం అబాధితంగా చురుకుగా వర్తిల్లుతుండటం, అన్నీ నే నెరిగే ఉన్నాను. ఆ స్థితిలో సుమారు పదిహేను నిమిషాలుండి యుంటాను (తాబేటి బండ వద్ద జరిగిన అనుభవము)

అప్పుడు శ్రీయుతులు విశ్వనాథయ్యర్, నారాయణరెడ్డి, మరికొందరూ తమ చేతునలు భగవాన్ వక్షం పైనుంచి, వారి హృదయ కేంద్రం కుడివైపున్నే ఉన్నదన్నారట. వారికా భాగ్యం లభించింది నిజమేనా? అని మేమడిగితే, శ్రీభగవాన్ అవునన్నారు. (వాళ్ళు కూడా అదే విషయాన్ని నిర్ధారించేరు)

హృతాస్థాన నిర్ణయానికి హస్తస్పర్శ చాలితే, సూక్ష్మములైన యంత్ర పరికరాలకది అసాధ్యం కాజాలదన్నా రింకొకరు.

భ: హృదయం కుడివైపని ఒకరు, ఎడమవైపున అని ఇంకొకరు, మధ్యలోనే అని మరొకరూ అంటూంటే ఈ భేదాభిప్రాయాలవల్ల మేము హృదయం పైన్నే ధ్యానం నిలుపడం, ఎలా?

మ: నీవున్నావు, నిజమేగదా? ధ్యానం చేసేది నీవు, నిన్ను గూర్చినీలో. నీవెక్కడుంటే అక్కడే ధ్యానమూ జరగాలి. అది నీకు వెలిగా నుండలేదు. కాబట్టి నీ ధ్యానకేంద్రమయిన హృదయం, నీవే.

అట్లైకూడా, శారీరకంగా దానికొక స్థానం నిర్దేశించారు. నీవున్నావని నీకు తెలుసు. ఆ ఉన్నది దేహంలో, దాని బయట కాదు, దేహమంతటిలోనూ గాదు. దేహమంతటా నీవు వ్యాపించి వున్నా నీ ఆలోచనలు లేచోటినుండి వస్తున్నవో, ఏ చోట అణగిపోతున్నవో అట్టి కేంద్రం ఒకటి సంగీకరించాలి. కాళ్ళూ చేతులూ ఖండిస్తే నీ ఇంద్రియశక్తి కొంత తగ్గుతుందే గాని, నీవా దేహంలో లేకపోవు. కాబట్టి ఏదో కేంద్రం ఒక దాన్ని ఒప్పుకోవాలి. దాన్ని హృదయమన్నారు. హృదయం శరీర మధ్య భాగంలో ఉన్నది మాత్రమే కాదు. అదే ఆత్మ. ఆత్మకు మారుపేరు హృదయం.

హృదయాన్ని ఏదో స్థూల వస్తువుగా, దైహికంగా ఎన్నితేనే, నీకు సంశయాలు కలుగుతాయి. హృదయం 101 నాడులకు కూటస్థానమని శాస్త్రాలు అంటాయి. యోగవాసిష్ఠంలో, కుండలినిలో 101 నాడులున్నవని చూడాల అంటుంది. అంటే కుండలిని హృదయం ఒకటే అని అర్థం.

హృదయం ఊహకాదు, ధ్యాన విషయం కాదు. అది ధ్యానపీఠం. ఆత్మ ఒంటిగా ఉండేది. దేహాన్ని ప్రపంచాన్ని నీవు హృదయంలో చూస్తావు. దానికి వేరుగా ఏమీ లేదు. కాబట్టి సర్వప్రస్థానాలకూ కూడలి అదే, హృదయమే.

## భాషణములు 404

భక్తుడు: నిష్ఠ అంటే ఏమిటి? భ్రూమధ్యంలో దృష్టిని నిలిపేదెట్లు?

మహర్షి: అన్నిటినీ ఎట్లు చూస్తున్నావు? ఇవన్నీ కనబడటం ఏదో కాంతి సాయంతోనే. ఆ కాంతి నెట్లు చూడడమన్నది నీ ప్రశ్నకర్థం.

భ: భ్రూమధ్యం ప్రాముఖ్యమేమి?

మ: దాని అర్థం "నీ కళ్ళతో చూడవద్దు" అని చెప్పేటట్లు ఉంది.

భ: శ్వాసను నియమించి ఏం ప్రయోజనం?

మ: మనస్సును నియమించడానికి మాత్రమే.

కొన్ని నిమిషాల పిదప భగవానన్నారు - మనస్సు విషయంగా, వెలుగుగా కూడా వర్తిస్తుంది. దానినుండి విషయాలను వేరుచేస్తే, అది కేవలం వెలుగుగానే మిగులుతుంది.

భ: అట్టి వెలుగొక టున్నదని మనకు తెలియవలెను కదా?

మ: చూపుగాని, గుర్తింపుగాని, అట్టి వెలుగులేక అసాధ్యం, నిద్రలో, దేన్నిగాని ఎట్లు తెలుసుకుంటున్నావు? వెలుగున్నది గనుక జాగ్రదావస్థల్లో మనకన్నీ తెలుస్తున్నవి. దృష్టికి వెలుగు ముఖ్యావశ్యకము. అనుదిన జీవితంలో ఇది స్పష్టమే. వెలుగులలో సూర్యకాంతి ప్రప్రధానము. అందువల్లనే కోటి సూర్యప్రభను స్తుతించారు.

భ: కంటి రెప్పలను వ్రేళ్ళతో అదిమితే ఒక వెలుగు కనిపిస్తుంది.

మరొకరు: అటువంటి ప్రకాశాన్ని చూచి ప్రయోజనమేమి?

మహర్షి: గమ్యాన్ని మరవకుండటానికి, ఈ సాధన, దృష్టి ఇతర కార్యక్రమాలు లేదా గమ్యాల వైపు మరలకుండా ఉండడానికి ఉపయోగపడుతుంది.

విషయాన్ని చూడటం, వెలుగును గుర్తించడం ఇవి ఆ పనిని చేయుకర్తయొకడుంటేనే సాధ్యం. విషయాలు కనబడినా కనబడకున్నా కర్తకే లోటు లేదు. కాంతిని, లేక ద్రష్టను, కాక చైతన్యాన్ని చూడగల్గితే ఆపైన చూడ విషయముండదు. స్వచ్ఛమైన కాంతి, లేక శుద్ధచైతన్యం మాత్రమే మిగుల్తుంది.

భ: మరి శ్వాసనిరోధ మెందుకు?

మ: ప్రాణనిరోధము, లేదా ప్రాణాయామములు మనస్సును చెదరనీయక నిలువడానికి మాత్రమే.

భ: మనోనిగ్రహానికి మాత్రమేనా?

మ: వెలుగు చూచిన మాత్రమే చాలదు. మనస్సు నొకే ఆలోచనలకు కట్టిపెట్టడం కూడా అవసరమే. ఉదా - ఏనుగుతొండము మరియు గొలుసూ.

భ: చింతామణిని సాధించడానికెంత కాలం పడుతుంది?

మ: యోగవాసిష్ఠంలో చింతామణిని ప్రస్తావించారు. ఆత్మకు చింతామణి ప్రతీక. ఆ కథ ఇట్లు --

చింతామణికై ఒకడు తపస్సు చేశాడు. ఎటనుండో తెలియదుగాని, వాని చేతిలో ఒక మణి తటాలున వచ్చిపడింది. తానప్పటికి చేసిన యత్నం చాల అల్పం. ఆ పాటికే అది లభించునా యని, అది చింతామణి కాజాలదని దాన్ని విడనాడి అతడు తపస్సు కొనసాగించాడు. కొంతకాలం తరువాత ఒక సాధువు పలుముఖాల నగిషీతో తళతళలాడుతున్న రాతినొకదాన్ని అతని ఎదుట ఉంచాడు. దాని చూపులకు మోసపోయి, అతడు దాన్ని చింతామణియని నమ్మి స్వీకరించాడు. నిజానికది రాయి, దానివల్ల అతడు కలలుగన్న ఏ కోరికా ఫలించలేదు. అలాగే, ఆత్మ నీలోనిదే, మరెక్కడా దానికై వెదక నక్కరలేదు.

ఒక మావటివాడు, వాని ఏనుగును ఊరకే సతాయిస్తున్నాడు. ఒకరోజు వానికేదో ప్రమాదం జరిగింది. ఒక త్రొక్కుతో వాని నంత మొందించవచ్చు. కాని ఏనుగు అలా చేయలేదు. ఆ తరువాత కొన్నాళ్ళకు అడవిలో ఒక పెద్దగుంట త్రవ్వి వాడే ఆ ఏనుగును దానిలో త్రోసి చంపివేశాడు.

శిఖిధ్వజుని తప్పిదాన్ని వెలిదెచ్చుటకీ కథను చూడాల ఉదాహరించింది. పాలనము చేస్తూన్న రోజుల్లోనూ అతనికి వలసిన వైరాగ్యం వుంది. అతడనుకొనే ఉంటే, ఆ వైరాగ్యాన్ని మరికొంత పెంచి అహంకారాన్ని అంతం చేసి, ఆత్మస్థితుడయ్యేవాడే. అలా చేయక అతడు అడవికి వచ్చి, తపస్సు కొక క్రమం నిర్ణయించి, ఆ ప్రకారం సాగించాడు. 18 ఏండ్లు తపస్సు సాగింది. కాని ముందుకొక్కడుగు వేయలేక పోయాడు. తన కల్పనకు తానే బలియైనాడు. చివరకు అహంకారాన్ని నాశం చేసి ఆత్మను సంధించమన్న చూడాల సలహాతోనే అతడట్లు చేసి తరించాడు. (పై కథలో ఏనుగు వైరాగ్యాన్ని, మావటివాడు అహంకారాన్ని సూచిస్తాయి.)

ఈ చూడాల కథవల్ల ఒకటి తెలుస్తుంది. అహంకారమును వదలని వైరాగ్యం ఎందుకూ పనికి రాదు. అహంకారం లేనినాడు, సర్వసంపదలూ, ఆత్మసిద్ధికడ్డురావు.

## భాషణములు 405

ఆచారపరాయణు లొకరు శ్రీచక్రాన్ని గూర్చి తెలియగోరారు.

మహర్షి: శ్రీచక్ర ప్రభావము చాల గంభీరమైనది. దానిలో 43 కోణాలు, అన్నిటిలో మంత్రాక్షరాలు (బీజాక్షరాలు) ఉంటాయి. చిత్తైకాగ్రతా సాధనాల్లో శ్రీచక్ర పూజ ఒకటి. మనస్సుకు బహిః ప్రవృత్తి ఎక్కువ. దాని నాపి అంతర్ముఖం చేయాలి. మనస్సుకు నామరూపాల్లో మక్కువ హెచ్చు. అందుచేతనే బాహిరాలైన విషయాల కన్నిటికీ, రూపాలు, పేర్లూనూ. వెలివిషయాలనుండి మరల్చి మనస్సు అంతర్ముఖం చేయవలెనంటే, ఆ నామ రూపాలను మనఃకల్పితాలకు ప్రతీకలుగా మార్చాలి. అంతర్ముఖావస్థలో మనస్సుకు పోషకాలీ విగ్రహాలూ, మంత్రాలు, యంత్రాలూ, వానిసాయంతో మనస్సు ఏకాగ్రత సాధిస్తుంది. ఆ తరువాత అత్యున్నతమైన స్థానం సహజంగా చేరడం జరుగుతుంది.

## భాషణములు 406

థియోసోఫిస్ట్ ప్రముఖుల్లో ఒకరు “నిర్వాణ” అనే గ్రంథం రచించారు. దాన్ని గూర్చి ఆశ్రమవాసి, కోహెన్, కొన్నాళ్ళుగా ఆలోచిస్తూ మథనపడుతున్నాడు. ఆ రచయిత ప్రతిరాత్రీ నిద్రపోగానే నిర్వాణంలో చేరుకుంటాడట. ఆ నిర్వాణ మొక కాంతి సముద్రము; అందులో ఉజ్జ్వల దీప్తులుగా థియోసోఫిస్ట్ గురు ప్రముఖులను, తన గురువును గూడ ఆయన చూచాడట. ఇదెట్లు సాధ్యమని కోహెన్ భగవాన్ నడిగాడు. అద్వైతరీత్యా నిర్వాణానుభూతి, శుద్ధచైతన్యస్థితికి పేరు కాదు కదా అని అతడి సందేహం.

మహర్షి: నిర్వాణమంటే పూర్ణత. పూర్ణస్థితిలో విషయము లేదు; కర్తలేదు. చూచుటకు, తెలియుటకు, అనుభవించుటకు అక్కడ ఏమీ ఉండదు. చూచుట, తెలిసికొనుట అనేవి మనఃప్రవృత్తులు నిర్వాణంలో. 'నేనున్నా'ననే శుద్ధచిత్తానందంకాకుండా వేరేమీ ఉండదు.

భ: మరి దూరదృష్టివంటి సిద్ధులు ఉన్నాయని చాటే గొప్ప థియోసోఫిస్ట్ నాయకుడు, ఆ గ్రంథంలో నిర్వాణవర్ణనం కన్నులకు కట్టినట్లున్నదని, ఆ రచయిత నంతంగా పొగడినాడేం? “సేవ” గురించి థియోసోఫికల్ సొసైటికి ఎందుకు అంత పట్టింపు?

మ: సరిసరి. థియోసోఫికల్ సొసైటీ అలాగే, ఇతర సంస్థలూ, మంచిపనే చేస్తున్నాయి. మనుష్యుని స్వార్థపరతను తగ్గించి, పరమసత్య దర్శన సన్నద్ధుణ్ణి చేయ యత్నిస్తున్నవి. సేవ, ప్రార్థనలు, జపము, దైవార్థంగా చేసే వ్యాపారమూ, పనులూ కూడా. ఇవన్నీ పరమ గమ్యానికి - ఆత్మానుభూతికి సోపానాలు.

భ: కాని ఎంత కాలానికి? శుద్ధ జ్ఞానానుభవానికి సిద్ధంగా ఉన్నతడు, సాపేక్ష జ్ఞానాన్ని చిక్కబట్టుకొని కూర్చోట మెందుకు?

మ: ప్రతీదీ, దాని సమయంలోనే అది అవుతుంది. శుద్ధజ్ఞానానికి అర్హుడైనవాని కావార్త ఎలాగో ఒకలాగు చేరనే చేరుతుంది. వాడది అనుసరిస్తాడు. ఆత్మవిద్య సర్వధర్మాల పారమ్యమనీ, ఈ యాత్ర కది తుదియని తెలుసుకుంటాడు.

ఆపైన బాహిరాంతర నిర్వికల్ప సమాధులను (ప్రశ్న 391 ను చూడుము) శ్రీభగవాన్ వివరించారు

సత్యాన్ని పట్టుకొని, జగత్తును పరికిస్తూ, లోపల నుండి ఏ విధంగా ప్రతిక్రియ లేకుండా ఉండడం, బహిస్సమాధి. నిస్తరంగ సముద్రపు నిస్తబ్దత అందుంటుంది. అంతస్సమాధిలో దేహ స్పృహయే ఉండదు.

భ: సహజ సమాధికి దేహ స్పృహ లేకపోవడం అవసరమా?

మ: దేహ స్పృహ యేమో విచారించు. దేహమూ, దానికే పరిమితమైన ఎరుకా, రెండూ కలిస్తే దేహస్పృహ. ఈ రెండూ వేరొక చేతనకు తెలియాలి. అది పూర్ణము, అబాధితము, అయి వుండాలి. దాన్ని అంటి పెట్టుకొని ఉండు. అది సమాధి. దేహస్పృహ లేనప్పుడూ అది వుంటుంది, ఎందుకంటే అది దేహస్పృహను నధిగమించింది గనుక. దేహస్పృహ యున్నప్పుడు కూడా అది ఉంటుంది. అట్లు అది సదా ఉండేదే. దేహస్పృహ ఉంటేనేం, పోతేనేం? పోతే, అది అంతస్సమాధి; ఉంటే అది బహిస్సమాధి; అంతే.

ఆరువిధముల సమాధులలో ఏదో ఒకదానిలో స్థితుడైతే, సహజ సమాధి సులువౌతుంది.

భ: మనస్సావిధంగా ఒక్కక్షణంగూడ మగ్నం కాదు.

మ: మనస్సుకూ, విషయాలకూ అతీతమైన అతి దృఢవిశ్వాసము. "నేనాత్మ" నన్నది ఉండడం చాలా ముఖ్యం.

భ: ఏమైతేనేం. దాన్ని ముంచవలెనన్న అన్ని యత్నాలనూ విఫలం చేసే తాడుగా మనస్సు వుంటుంది.

మనస్సు: మనస్సు పనిచేస్తూనే ఉంటే ఏం? ఆ చేష్టల కన్నిటికీ ఆధారం ఆత్మయే కదా. మనస్సు వర్తిస్తున్నప్పుడు గూడా ఆత్మనే పట్టుకొని వదలక.

భ: కావలసినంత లోతుగా లోనికి పోలేకపోతున్నాను.

మ: అట్లనుకోవడమే తప్పు. ఆత్మలో కాకపోతే నీ విప్పుడెక్కడున్నట్లు? వేరెక్కడికి పోగలవు? కావలసినదంతా నీవాత్మనన్న గాఢవిశ్వాసమే. చేత కాదనడం కన్నా, ఇతర వ్యవహారాలు నిన్ను కప్పేస్తున్నాయను.

భ: అవును, అదే నిజం.

మ: అంటే, విశ్వాసం బలహీనంగా ఉందని అర్థం.

భ: “నేను” కృత్రిమమని నా కర్థమయింది. నిజమైన 'నేను'ను సాధించుటకు నా యత్నాలన్నీ, విఫలమౌతున్నాయి. ఎందుకంటే ఈ కృత్రిమ “నేను”తోనే ఆ నిజం “నేను” ను పొందే ప్రయత్నం చేస్తున్నాను.

మ: ఈ కృత్రిమమైన “నేను” విజ్ఞానకోశం నుండి ప్రసరించేదనీ, దాని ద్వారా యథార్థమైన “నేను” వాచ్యమును చూడవలెననీ, వివేక చూడామణి తెలుపుతున్నది.

## భాషణములు 407

భక్తుడు: సెయింట్ థెరెసా, తదితరులూ, మెడోనా విగ్రహం సచేతనం కావడం చూచారు; అది బయట. ఇతరులు వారి వారి ధ్యేయ మూర్తులను మానసికంగా చూస్తారు; అది లోపల. ఈ రెంటిలో తీవ్రతలో ఏమైనా తేడా ఉందా?

మహర్షి: వారికందరికి ధ్యానం ప్రగాఢమని స్పష్టం. ఇరుతెగలవారూ మంచివారే, పురోగములే, వారి పరిణతిలో తేడా లేదు.

ఇర్వురికి దైవానుభూతి ఉన్నది. ఒకరు దానిని మానసిక మూర్తుల్లో చూస్తారు; రెండవవారు విగ్రహంలో కనుగొంటారు. ఇర్వురి పక్షంలోనూ అనుభూతి లోపలే.

## భాషణములు 408

వక్షానికి కుడిగా హృత్ స్థాన మన్న సందర్భంగా శ్రీ భగవాన్ వివరించారు. ప్రాణిశాస్త్రాలు (Physiology) బోధించేదానికి విరుద్ధమని కొందరు విద్వాంసులు కాదంటున్నా, నేను హృత్కేంద్రం వక్షస్సునకు కుడిపైపున అని చెప్పుతూ వస్తున్నాను. నేనట్లనడానికి ఆధారం నా అనుభవం. నాకది మా ఇంటిలోనున్న రోజుల్లోనూ సమాధి (ట్రాన్స్) దశల్లోనూ తెలుసు. తరువాత 'ఆత్మసాక్షాత్కారము' (సెల్ఫ్ రియలైజేషన్) గ్రంథంలో తెలిపిన ఘటనలోనూ, నేనది సుస్పష్టంగా తెలిసి అనుభవించాను. ఉన్నట్లుండి ఏదో కాంతి పుంజము ఒక వైపునుంచి చొచ్చుకొని. వచ్చింది. దాని మార్గంలో దృశ్యమానమైన జగత్తు తుడుచుకొని పోయింది. ఆ కాంతి నలువైపులూ ప్రసరించింది. అసలు జగదృశ్యమే మాయమయింది. నా వక్షంలో ఎడమవైపున నున్న మాంస (హృత్) పిండం పనిచేయుట మాగింది. దేహం శవంలాగ అయిందనీ, రక్తప్రసారం ఆగిపోయి, దేహం నీలవర్ణమై అచేతనమైందనీ నాకర్థమవుతూనే ఉంది. వాసుదేవశాస్త్రి నా దేహాన్ని తన కౌగిలిలో గ్రుచ్చిపట్టి నేను చనిపోయానని ఏడ్వసాగాడు. కాని నాకు మాటరాలేదు. అంతసేపూ వక్షంలో కుడివైపున హృత్కేంద్రం ఎప్పటిలాగే పనిచేస్తున్నది నేను గమనించే ఉ న్నాను. ఇట్లు 15, 20 నిముషాలైనవి. ఆకాశము ప్రేలినట్లు, తటాలున ఏదో కుడినుండి ఎడమకు దూసుకొని పోయింది. రక్తప్రసారం మొదలయినది. పూర్వస్థితి తిరిగివచ్చింది. అప్పుడు వాసుదేవశాస్త్రిని నాతో రమ్మన్నాను. ఇర్వురుమూ నివాసము చేరుకున్నాము.

101 నాడుల హృదయంలో చేరుకుంటాయని వానినుండి 72000 నాడులు బయలుదేరి దేహమంతా వ్యాపించి ఉండుననీ, ఉపనిషత్తుల్లో ఉంది. ఆ విధంగా హృదయం శరీర మధ్యం అవుతుంది. మనం దేహంలో ఉన్నామనుకోటం అలవాటు గనుక హృదయం శరీర మధ్యమన్నాము. నిజానికి దేహమూ, ఇతర సర్వమూ ఆ హృదయంలోనివే.

స్మృతులు

## భాషణములు 409

నడివయస్సు వాడొకడు భగవాన్ ఎదుట సాగిలబడి మ్రొక్కిలేచాడు. భగవాన్

వాని క్షేమమడిగారు. కొన్ని నిమిషాలూరుకొని, స్మృతికి తెచ్చుకుంటూ భగవాన్ “ఈ ఒక్కడికే నేను చెంపలు వాయించా"నన్నారు. అది 30 ఏండ్ల క్రిందటి మాట. అప్పుడు భగవాన్ ములైపాల్ తీర్థంలో నివసిస్తున్నారు. ప్రక్కనే చూతగుహ, అందులో జటాస్వామి ఉన్నారు. వీనికప్పుడు ఎనిమిదేండ్లు. భగవాన్తో సహా అందరితోనూ అల్లరి ఆటలాడేవాడు. ఒకరోజు భగవాన్ వద్దకు వెళ్ళి జటాస్వామి ఒక బక్కెట్టు తెమ్మంటున్నారని చెప్పి, వారు సరే అనకముందే దాన్ని తీసుకొనివెళ్లాడు. పరిచారకుడు పళనిస్వామి అప్పుడక్కడ లేడు. అందుచేత భగవాన్ ఆ కుర్రవాని వెంటనే జటాస్వామి వద్దకు వెళ్ళారు. వారక్కడికి చేరకముందే వాడు జటాస్వామితో "బ్రాహ్మణస్వామి” మీకిమ్మని ఈ బకెట్టు పంపారని చెప్పాడు. ఎందుకా అని జటాస్వామి ఆశ్చర్యపడ్డాడు. తరువాత కొద్ది నిమిషాలకు భగవాన్ అక్కడికి

చేరుకొన్నారు. విషయం తెలిసింది. వానికి ఒక లెంపకాయ కొడదామని చేయైతే ఎత్తారుగాని వారికి మనస్సు రాలేదు. కాని తనలో తాను తర్కించుకొని, వానికది తగునని నిర్ణయించి ఒక లెంపకాయ వేసారు.

## భాషణములు 410

అవ్వైయార్ పద్యమొకటి. ప్రాణం పొట్టను సంబోధిస్తూ అంటుంది

“ఓ పొట్టా, నీతో ఎట్లు వేగేది? అన్నం లేకుంటే పస్తుండలేవు. అన్నం దండిగా వుంటే మరింతగా తిని, ఇంకొక సారికని దాచుకోనూ లేవు. నీకిష్టమైనప్పుడు నీ కిష్టమైనంత తింటావు. నన్ను నీవు బలే తంటాలు పెడుతున్నావు. నాకు శాంతే లేకుండా చేస్తున్నావు."

దానికి బదులుగా భగవాన్ పొట్ట ప్రాణాన్ని సంబోధిస్తున్నట్లొక పద్యం వ్రాశారు. "ఓ ప్రాణమా, నీవు నన్నెంతగా బాధిస్తున్నావో నీకు తెలుసా? నా పాటికి నన్ను శాంతంగా ఉండనీయవు. చీటికి మాటికి ఆహారం క్రుక్కుతూనే ఉంటావు. నీతో రోజులు వెళ్ళద్రోయడం బహుశ్రమగా వుంది."

అంటూ భగవాన్ నవ్వసాగారు. తనకు హితవు కాకున్నా ఎన్నోమార్లు ఎక్కువగా తినేట్లు చేసేవారన్నారు.

## భాషణములు 411

బ్రాహ్మణ వివాహాల గూర్చి శ్రీభగవాన్ అన్నారు -- అందులో కాశీయాత్ర వరుణ్ణి విరాగిగా చిత్రిస్తుంది. గృహస్థాశ్రమానికి అట్టివాడే తగిన వాడని వానికి కన్యనీయుట. విరాగియే సద్గృహస్థుడుగా నుండ నర్హుడని తాత్పర్యం.

## భాషణములు 412

అవి చలిరోజులు, కొండపైన ఒక గుహలో భగవాన్ కూర్చుని ఉన్నారు. చేతులు ముడుచుకొని, అరచేతులు రెండూ గుండెపై నుంచుకొన్నారు. ఆ స్థితి చలిని కాస్తుందని కాబోలు. అప్పుడొక ఆంధ్రు డక్కడికి వచ్చాడు. ఒక కొబ్బరికాయ కొట్టి ఆ నీరును భగవాన్ నెత్తిన పోసాడు. అభిషేకార్థమట! శ్రీ భగవాన్ కాశ్చర్యమయింది.

## భాషణములు 413

చూడవచ్చిన ఒకరడిగారు -

నామజపం చేస్తూ సుమారొక గంట అయ్యేప్పటికి ఏదో నిద్రవంటి అవస్థకు దిగుతాను. స్మృతిరాగానే నా జపం భగ్నమయిందని తెలుస్తుంది. జపం మళ్ళీ మొదలు పెడతాను.

మహర్షి: 'నిద్రవంటి అవస్థ' అది సరి. అది సహజస్థితి. ప్రస్తుతం నీవు అహంకారంతో కూడియున్నావు గనుక, జపాన్ని చెడిపిందని, నీ సహజస్థితినే అనుమానిస్తున్నావు. నీ సహజస్థితి అదేయని దృఢపడిందాకా, సాధన సాగించు. అప్పుడు జపాదులన్నీ పైపైవే అని తెలుస్తుంది. తెలిసినా కూడ జపం తనంత సాగుతూనే ఉంటుంది. నీ సందేహానికి మిథ్యాన్వయమే (False Identity) కారణము. జపమంటే, ఇతర ఆలోచనలన్నీ త్రోలి, ఒకే ఆలోచనల నంటిపెట్టుకొని ఉండటం. జపప్రయోజనమే అది. అది ధ్యానానికి, ధ్యానం ఆత్మానుభవానికీ దారి తీస్తుంది.

## భాషణములు 414

భక్తులు శ్రీ గుర్రం సుబ్బరామయ్యగారు కొన్ని పద్యాలను సరసంగా రచించారు. అందులో కొన్ని చిన్న పిల్లల గురించి ఉన్నాయి. అవి విని శ్రీభగవాన్ దైవము శిశువౌతాడని, శిశువు దైవమౌతాడని అన్నారు. అంటే బిడ్డకి సంస్కారాలన్నీ అణగియుంటాయనీ, గనుక వానికి అమాయకత్వం పూర్తిగా వుంటుంది. ఆ సంస్కారాలు పోయిన తర్వాత బాగా వయసైనవాడూ శిశువే అయి దైవంగా నిలుస్తాడు.

భ: బిడ్డ తన చుట్టూ ఇంటి వాతావరణాన్ని సృష్టిస్తాడు.

మహర్షి: అవును. పిల్ల లెప్పుడూ ఇంట్లోనే ఉంటారు. మనమున్నదీ అక్కడే కాని కలలలో పడి ఎక్కడో బయట ఉన్నామని ఊహిస్తాము.

శ్రీ భగవానన్నారు - శ్రీ దక్షిణామూర్తిస్తోత్రంలోని 'యువ' పదాన్ని నేను 'బాల' అని మార్చేను. ఇది ఎక్కువ ఉచితంగా ఉంది. మళ్ళీ జన్మించడమంటే మళ్ళీ చిన్న పిల్లలం కావడమే. జ్ఞానసిద్ధికి అంటే, సహజస్థితిని తిరిగి పొందటానికి ముందు మళ్ళీ జన్మించవలసిందే.

## భాషణములు 415

తమిళ పద, తమిళార్థ కోశం ఉపోద్ఘాతంలో ఆ భాష గొప్పతనాన్ని వర్ణిస్తూ, కొన్ని పద్యాలున్నాయి. అవి చదివి వానిలో చెప్పబడిన విషయాలను శ్రీ భగవాన్ హృదయంగమంగా వివరించారు.

జైనంకన్నా శైవం గొప్పదనటానికి మూడు తార్కాణాలు -- ఒకటి, తిరుజ్ఞానసంబంధర్ పాండ్యుని వద్దకెళ్ళి ఆ రాజు జబ్బు కుదిర్చిన వైనం. రాజు విషయంగా రాణి చాల వ్యాకులపడింది. సంబంధర్ పసివాడు, పన్నెండేండ్లయినా లేవు. వయసులో తాను పిన్న అయినా బహుసంఖ్యాత జైన గణాలకన్న తానెక్కువే అని రాణికి నమ్మకం కలిగిస్తూ ఒక పద్యం చెప్పాడు. (ఆ పద్యం చదివేప్పుడు భగవాన్ కంఠం గద్గదమై పూర్తిచేయలేకపోయారు).

రెండవది - తాళపత్రాన్ని కాల్చకుండా అగ్ని వదలివేసిన వృత్తాంతం.

మూడవది - తాళపత్రం తిరుపేడగం నదీ ప్రవాహానికి ఎదురొడ్డి రావటం.

శ్రీభగవాన్ ఈశ్వరగాథ ఒకటి చెప్పారు -- అందులో ఈశ్వరుడు వృద్ధరూపంలో భిక్షావృత్తి సల్పి, యువరూపంలో భిక్ష గ్రహించి, శిశువై భక్తురాలిని రక్షించి ఇన్నింటినీ ఏకకాలంలో చేసినట్లున్నది.

జ్ఞానిస్థితిని, బిడ్డ, వెర్రి, పిశాచావస్థలతో పోల్చడం చూపి (బాలోన్మత్త పిశాచవత్), మిగత ఇర్వురకన్నా ప్రముఖంగా బాలునే పేర్కొనడం గమనించాలి.

## భాషణములు 416

శ్రీభగవాన్ అన్నారు: వాల్మీకంలోని 24000 శ్లోకాలకు కంబరామాయణంలో 12000 ఉన్నవి. పండితులేగాని, అందరూ కంబరును అర్థం చేసుకోలేరు. ఒక తమిళయోగి కంబరామాయణాన్ని తనకై హిందీలో వల్లిస్తే విని, ఆ తరువాతనే తులసీదాస్ ప్రసిద్ధమైన తన రామాయణ కావ్యం వ్రాశారు.

## భాషణములు 417

1937లో మెహరుబాబానుగూర్చి 'పూర్ణగురువు' (ద పర్ఫెక్ట్ మాస్టర్) అన్న గ్రంథం వెలువడింది. దానిలోనిది ఒక ఘటన -- నౌకాధికారి, తమదేశంలో విదేశీయుల ప్రవేశాన్ని పరిశీలించే అధికారితో, బాబాను వారి దళాన్ని న్యూయార్క్ ని కనుమతించమన్నాడు. అయిష్టంగానే అతడంగీకరించాడు. బాబాదళంలోని ఒకరు ఆ నౌకాధికారికి కృతజ్ఞత తెలుపడానికై వెళ్ళితే, అతడెక్కడా కనుపించనే లేదు.

ఈ సంఘటన బాబాగారి అద్భుత మహిమ స్ఫురింపచేసేట్టుగా ఉన్నది. ఆ భాగం భగవాను చదివి వినిపించారు.

మహర్షి: సరి సరి. ఏమయితే?

భక్తుడు: అది ఒక, అద్భుతమేనా?

మహర్షి: కావచ్చు. కాని ఆ ఇమిగ్రేషన్ ఆఫీసర్, ఆ నౌకాధికారిని తనకన్నా ఉచ్చ పదవి వానిగా అతని మాట దాటరానిదిగా గుర్తించాడు కదా? ఆ విషయం అంతటితో సరి. బాబా దళంలో వారి కాతడు కనుపించక పోవటమా? దానికెన్నైనా కారణాలుండవచ్చు.

## భాషణములు 418

భగవాన్ కంబరామాయణం చదివారా యని ఎవరో అడిగారు.

మహర్షి: నేనేమీ చదవలేదు. నా పాండిత్యమంతా నా 14వ ఏటికి పూర్వమేం చదివానో దానికే పరిమితం. ఆ తరువాత ఒకటి చదువవలెననీ లేదు, నేర్చుకోవలెననీ లేదు. భగవద్గీతాదుల విషయం ఎట్లు భాషిస్తానా యని వారి ఆశ్చర్యం. అది వినికిడివల్లనే, నేను గీత చదువలేదు. దాని అర్థానికై బాష్యసముద్రాల నీదులాడనూ లేదు. ఒక శ్లోకం వింటే దాని అర్థం నాకు సుస్పష్టంగా తోచి, ఆ శ్లోకాన్ని తిరిగి వల్లిస్తాను. అంతే, అంతకన్నా మరేమీ లేదు. అప్పుడప్పుడూ నేనుదాహరిస్తానే వాని సంగతీ అంతే. అవేవో వాటంతటవే వస్తాయి. సత్యం వాక్కుకూ స్మృతికీ అందదని నాకు తెలుసు. అటువంటప్పుడు, చదివి అర్థం చేసుకొని వల్లించటానికై మనస్సును వినియోగించుటెందుకు? వాని ప్రయోజనం

సత్యం గుర్తించడమే. ప్రయోజనం సిద్ధించాక ఆ చదువులతో మరి పనేమి? మరొకరు: భగవాన్ చదవదలచేయుంటే మాకీ యోగి లభించియుండడేమో?

మహర్షి: బహుశః! నా చదువులన్నీ పూర్వజన్మలలో పూర్తి అయి, ఇంకా అవసరంకంటే ఎక్కువ చదివేసేమో. అందువల్లనే ఆ వైపు వెళ్ళే సంస్కారమేమీ లేదు.

## భాషణములు 419

మహాపూజకు (3 జూన్ 1937) వారం రోజులుంది. ఎంతమందో వచ్చి చేరారు. వారిలో కొందరు భగవాన్ బంధువులూ ఉన్నారు. వారిలో ఒక పెద్దవయస్సు, వితంతువు, సుబ్బయ్యర్ పత్ని. 1896 ఆగస్టులో ఇల్లువీడక పూర్వం భగవాన్ వారింటిలోనే ఉండిరి. ఆమెను చూడగానే భగవాన్కి పాత కథలు జ్ఞప్తికి వచ్చాయి.

అది పర్వదినం. లడ్డులు కట్టడంలో ఆమెకు సాయపడమన్నారు. కొంత సంకోచించి చివరకు తానొప్పుకోలేదు. కారణం గుడ్డలు మార్చుకొని గోచి పెట్టుకోవాలి. తనకు సిగ్గువేసింది. ఈమె, తన పిన్నాయన, ఇర్వురూ తన్ను కోప్పడ్డారు, అన్నారు భగవాన్.

'నిజమే, ఇంత ఉచ్ఛస్థితికి రావలసి ఉండగా, ఆ రోజుల్లో అంతటి అల్పపు పనులెలా చేస్తారు' అని ఆమె సవినయంగా మృదువుగా పలికింది.

శ్రీభగవాన్ 'కౌపీనం ధరించనని ఒక్కమారన్నందుకే, శిక్ష బాగా అయింది; ఆజన్మమూ కౌపీనమే గతి అయింది.'

అప్పట్లో రోజుల తరబడి భగవాన్ తలనొప్పితో బాధపడేవారని ఆమె జ్ఞప్తి చేసింది.

మహర్షి: అవునవును. నేను మధుర వదలడాని కొక నెలముందు. అది తలనొప్పి కాదు. అది ఒక చెప్పలేని బాధ. అంతాయింతా గాదు. బాధ దుర్భరంగా ఉండింది. అప్పటికెట్లో అణిచిపెట్టాను. అవన్నీ తలనొప్పి యొక్క బాహ్యలక్షణాలని చెప్పేను. నా తలపోటు బాధ చూచి నీవెంత తపించావో నాకు జ్ఞాపకం ఉంది. రోజు ఏదో ఒక మందు నుదుట రుద్దేదానివి. మధురవీడి ఇక్కడికి చేరేదాక ఆ బాధ ఉంది.

## భాషణములు 420

కడలూరు న్యాయవాది యొకరొక శ్లోకం వల్లించారు ---

"అచట రవి లేడు, చంద్రుడు లేడు, తారలూ, మెరుపులూ, ఏవీ లేవు. అచ్చట అగ్ని మాత్ర మేమని వెలుగొందగలడు? ఈ తేజోమూర్తులన్నీ, ఆ పరముని ప్రకాశమందలి దీపికలే. ఆ తేజస్సుతోనే, వీరందరూ ప్రకాశింప గల్గటం."

"ఇక్కడ ఆ 'తేజస్సుతోనే' అంటేఏమి? ఇతరమంతా వెలుగొందడాని కతడు కారణమా, కాక ఆయన వెల్తురులోనే వీరు వెలిగెదరనియా?"

మహర్షి: ఉన్నదతఁ డొకడే. అతడూ, ఆ తేజమూ ఒక్కటే. ఇతరాలను చూచేందుకు ఏ వ్యక్తీ లేడు. చూచువాడూ, చూడబడునదీ, రెండూ అతడొకడే. సూర్యచంద్రులు బయట మెరుస్తారు. ఎట్లు? వారుగాని, వారి తరపున మరొక్కరుగాని వచ్చి మీతో వారు వెలుగుతున్నారని చెప్పారా?

భక్తుడు: వారు వెలుగుతున్నారని చెప్పేది నేనే.

మ: అవన్నీ కూడా నీవలనే వెలుగుతున్నాయి. అవన్నీ వెలుగుతున్నాయని చెప్పడానికి చైతన్యం కావాలి. ఆ చైతన్యమే నీ ఆత్మ అంటే నువ్వే. అందుచే నీవు లేదా నీ చైతన్యమూ; సర్వమూ వెలిగించే అతడూ, లేదా ఆయన తేజస్సు ఒక్కటే.

భ: ఆ తేజస్సు సూర్యకాంతి వంటిదా?

మ: కాదు, సూర్యకాంతి జడము. నీకది తెలుసు. అది విషయాలను కన్పించేట్టు చేస్తుంది. చీకటిని తొలగిస్తుంది. కాని చైతన్య తేజస్సు ప్రకాశాన్నే గాక చీకటినిగూడ దర్శింపచేయగలదు. చీకటి సూర్యరశ్మి ఎదుట ఉండలేదు గాని చిత్ తేజ మెదుట ఉండగలదు. అలాగే చైతన్యము, శుద్ధజ్ఞానము. దానిలో జ్ఞానము, అజ్ఞానమూ రెండూ ప్రకాశిస్తాయి.

భ: సర్వము దైవమే అయితే, వ్యక్తి తన కర్మలకి ఏల బాధపడాలి? ఈ కర్మలను ప్రోత్సహించేది ఆయనా కాదా దానికి వ్యక్తి బాధ పడవల్సి వస్తోంది.

మ: కర్త అని అనుకొనేవాడే బాధపడేది.

భ: కాని కర్మలను ప్రోత్సహించేది దైవము. వ్యక్తి కేవలం ఉపకరణ మాత్రమే. మ: ఈ తర్కం దుఃఖం కల్గినపుడే చెప్తారు; ఆనందించేప్పుడు అనుకోరు,

ఈ నమ్మకమే సదా ఉంటే బాధగూడ ఉండదు.

భ: దుఃఖం ఎప్పుడు పోతుంది.

మ: వ్యక్తిత్వం పోనంతవరకూ పోదు. మంచి చెడులు రెండూ ఆయనవే అయితే, సుఖదుఃఖాలు మాత్రం నీ వెట్లయినాయి? మంచో, చెడో చేసినవాడు సుఖమో దుఃఖమో అనుభవిస్తాడు. దాన్ని అంతతో వదిలివేయి, ఆ దుఃఖాన్ని నీపై ఆపాదించుకోక.

# భాషణములు 421

ఆశ్రమవాసి, భక్తులు కుంజుస్వామి 1923లో ఆశ్రమంలో దొంగలు పడినప్పటి భగవాన్ వచనాన్ని ఒకటి తెలిపారు

కొందరు శిష్యులు ప్రశ్నించసాగారు -"దొంగలు సాధువులను కొట్టి బాధిస్తూ ఉంటే వారిని ఎందుకు అలా చెయ్యనివ్వడం జరిగింది; అలాగే సాధువులు తమనితాము, తమ మీద ఆధారపడిన వాళ్ళను ఎందుకు రక్షించుకోలేదు?"

శ్రీభగవాన్ అన్నారు - 'వారనుకొంటే మరో విశ్వాన్నే సృష్టింప సమర్థులు. విశ్వామిత్రులవంటి ఋషులు ఉండిరి. వారున్న సమయంలో రావణాసురుడూ ఉన్నాడు. ఇతరులకేగాక సీతారాములకు గూడా వాడత్యంత వ్యధ కల్గించాడు. తన సిద్ధులతో, శక్తులతో విశ్వామిత్రులు, రావణుని నాశం చేయలేరా? శక్తియుండి కూడా వారు స్థిరంగా ఉన్నారు. ఎందుకు? ఈ ఘటనలన్నీ వారికి తెలుసు. కాని అవన్నీ గడచిపోయేవి. వాని ముద్రలు వారి మనస్సులో హత్తుకొనేవి కావు. ప్రళయంగూడ వారికి చిన్నవిగానే తోస్తుంది. వారు వేనినీ లక్ష్యపెట్టరు."

# భాషణములు 422

వెంకటరావుగారు, గుంటూరువారు, భగవాన్ నడిగారు

"నీతి విరుద్ధపు తప్పు పనులను చేయుమని గురువు శిష్యు నాజ్ఞాపిస్తారు. ఆయన్ను గురువుగా గ్రహించిన శిష్యునికి ఆయన్ను తృప్తి పెట్టుకోర్కి ఉందిగాని, వాని ధర్మబుద్ధి వానికడ్డు వస్తుంది. అలాంటప్పుడు అతడేం చేయాలి.

భగవాన్ జవాబు చెప్పలేదు.

ఇంకా స్పష్టంగా చెబుతాను. గురువు శిష్యుని దొంగిలించమన్నాడు. శిష్యుడు చేయలేదు. “నిన్ను నీవు పూర్తిగా అర్పించుకొన్నావో, కాక వ్యక్తిత్వమింకా నిలుపుకొనే ఉన్నావో పరీక్షింపనెంచి అట్లన్నాను. అది ఇప్పుడు నిర్ణయమయిందన్నాడు గురువు. అట్లు శిష్యుని ఆదేశించడం గురునికి ధర్మమేనా?

భగవాన్ జవాబు చెప్పలేదు.

మరొక రన్నారు: 'ఒకరి ధర్మాధర్మాల నిర్ణయించడం నాకిష్టంలేదు. గాని అట్టివారు గురుపదాని కర్హులా యన్న శంక తప్పడం లేదు. వాళ్ళు కపటులు. వారు నిజంగా యోగ్యులే అయితే ఆ విధంగా శిష్యునాజ్ఞాపించే వారు గాదు.'

మహర్షి: కాని ఆ విషయం పరీక్షించటాని కంటున్నాడు.

భ: అలాంటప్పుడు ఆ పని చేయవల్సిందేనా?

మ: మొదట నీవడిగిన ప్రశ్నలోనే నీకు సమాధానం గూడా ఉంది. పృచ్ఛకులు ఇద్దరూ కలిసే అడిగారు: "ఆ పని ఉచితంగాకున్నా చేయవచ్చునా?"

మ: ఆ ప్రశ్నను ఆ గురువునే అడగవచ్చునే. ఆ సందిగ్ధ స్థితికి బాధ్యుడాతడే గదా.

## భాషణములు 423

యువకుడొకడు: నేనిచ్ఛాశక్తి (will power) పెంచుకోవాలని యత్నిస్తున్నాను. ఎలా దాన్ని సాధించడం?

భగవాన్ జవాబు చెప్పలేదు.

నే నిక్కడికి మూడేండ్ల క్రితం వచ్చాను. అప్పుడు మనోదార్ఢ్యానికి, ఇచ్ఛాశక్తి అవసరమని శ్రీ భగవాన్ అన్నారు. అప్పటి ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. కాని ఫలితం కనబడడంలేదు (బదులు లేదు).

ఈ మూడేండ్ల జీవితంలో నాల్గయిదు మార్లు దెబ్బతిన్నాను. అవి నన్ను చాల అలజడి పెట్టాయి. ఏది యత్నించినా వైఫల్యం తప్పదనే భయం నన్ను వేధించుకు తింటున్నది. దాని వలన నాలో నాకు నమ్మకం పోతున్నది. అది కారణంగా యత్నాలూ విఫలమౌతున్నాయి. నిజంగా విజయానికి మించిన సాఫల్యం ఏదీ లేదు. (Nothing succeeds like success) అలాగే విఫలం అవడం అన్ని యత్నాలను విఫలం చేస్తుంది. నా ప్రశ్న అందుకే. (బదులు లేదు).

సాఫల్యానికి ఇచ్ఛాశక్తి అవసరం లేదా? అది జయాన్ని ఇచ్చి విఫలం రాకుండా చెయ్యాలి. ఇన్నేండ్లు గడిచాయేగాని, మొదట్లో ఎక్కడున్నావో, ఇప్పుడూ అక్కడే ఉన్నాను. ప్రగతే లేదు. (బదులు లేదు)

భ: ఇచ్ఛాశక్తి సంపాదించుకొనే ఉపాయాలేవి?

మ: ఇచ్ఛాశక్తి (will power) అంటే నీ అభిప్రాయం విజయానికి భీమా అని. ఇచ్ఛాశక్తి అంటే జయ, అపజయాలని సమానంగా తీసుకోగలిగే మనోశక్తిగా అర్థం చేసుకోవాలి. ఇచ్ఛాశక్తి అంటే ఒకరకమైన జయానికి పర్యాయ పదంగా తీసుకోకూడదు. ప్రయత్నాలన్నింటికీ విజయమే ఎందుకు కల్గాలి? విజయం వలన అహంకారం, గర్వం పెరిగి వ్యక్తి ఆధ్యాత్మిక ప్రగతి ఆగిపోతుంది. కాని వైఫల్యం వ్యక్తి యొక్క శక్తిసామార్థ్యాల పరిధిని చూపి కళ్ళు తెరిచేటట్లు చేసి, శరణాగతికి తయారుచేస్తుంది. శరణాగతి నిత్య ఆనందానికి మరోపేరు. అందువలన వ్యక్తి మనస్సులో అన్ని పరిస్థితులలో సమత్వం తెచ్చుకొనే ప్రయత్నం చేయ్యాలి. అదే will power. అలాగే జయాపజయాలు ప్రారబ్ధ ఫలితాలేగాని, ఇచ్ఛాశక్తి ఫలితాలు కావు. ఒకడు ఎప్పుడూ మంచివి, ఉన్నత ఆశయాలతో కూడిన పనులే చేసున్నా సఫలుడు కాకపోవచ్చు. కాని మరొకడు దానికి భిన్నంగా పనులు చేస్తున్నా ఎప్పుడూ వాడనుకున్నట్లే సాధించవచ్చు. దాని అర్థం ఒకరికి will power ఉంది. వేరొకరికి లేదని కాదు.

భ: 'ఉన్నది నలువది'లో జగత్తు మనఃకల్పితమని ఉందిగదా?

మ: అవును.

భ: అట్లయితే మనస్సు దృఢమయ్యేకొద్దీ ప్రపంచాన్ని వశంచేసుకోడం సులువు అవుతుంది గదా.

మ: మనస్సు బాహ్యప్రవృత్తిలో ప్రపంచానికి కారణమైంది. అట్టి ప్రవృత్తి మనశ్శక్తిని పోగొడుతుంది. బాహ్యప్రవృత్తి నడ్డగించి తన్నుతాను సంయమించుకొంటేనే దానికి బలం కలుగుతుంది.

భ: ఒక మూర్ఖుడున్నాడు. వాడు పదివరకుకూడ లెక్కింపలేదు. విజ్ఞాని మనస్సువలె వాని మనస్సెక్కడికి చరించదు. వాడు విజ్ఞానికన్నా ఉత్తముడా? మ: వాడు మూర్ఖుడన్న దెవరు? భ్రమిస్తున్న నీ మనస్సు ఆ మాటన్నది.

భ: ఆలోచనలుపోతే ఇచ్ఛాశక్తి హెచ్చుతుందా?

మ: అంతకన్నా ఒకే ఆలోచనపై లక్ష్యముంచితే మేలు. చివరకు శుద్ధచైతన్యాన్ని మిగిల్చి, సాయపడుతుంది. ఆ ఆలోచన కూడా తొలగిపోతుంది. ఏకాగ్రత అందుకు సాయపడుతుంది.

భ: మనస్సునొక లక్ష్యానికి మళ్ళించి అచటనే నిలిపితే శుద్ధ చిత్ లభిస్తుందన్న మాట. వ్యక్తిత్వానికి దానికి ఎట్టి సంబంధమూ లేదు.

మ: బాహ్య ప్రవృత్తులన్నిటికీ వ్యక్తిత్వమే మూలకారణం. పరమ శ్రేయస్సు " పొందడానికి ఆ మనస్సు మునిగిపోవాలి.

## భాషణములు 424

ప్రకృతి పురుషుల గూర్చి ఒక విద్వాంసునితో చర్చిస్తూ శ్రీభగవాన్:

ఒకే బ్రహ్మమును ప్రకృతియని పురుషుడనీ రెండుగా విభజించారు. ద్వైత భావము తనలో బాగా గట్టిగా ఉన్నందున, విద్యార్థి ఆ విధంగా ఊహించాడు. గీతలో పురుషోత్తముని, ప్రకృతి పురుషుల కందనివానిగా వర్ణించియున్నది.

భక్తుడు: పరానాడి, సుషుమ్నానాడి, హృదయం ఇవి ఏవి?

మహర్షి: సుషుమ్న పరాలో లీనమవుతుంది. (సుషుమ్నాతు పరేలీనా). హృదయాన్ని సామాన్యంగా ఛాతికు ఎడమవైపున ఉన్న అవయవంగా భావిస్తారు. “మాడరన్ సైకలాజికల్ రెవ్యూ” శారీరక హృదయం వక్షానికి ఎడమవైపున అనీ, హృత్ కేంద్రం కుడివైపున యనీ అన్నది. జ్ఞానుల హృదయం కుడివైపునా, మూఢుల కెడమవైపునా ఉంటుంది అని బైబిల్. యోగవాసిష్ఠం ప్రకారం, హృదయాలు

రెండు -- 1. సంవిత్, 2. రక్తప్రసారి.

భక్తుడు: అనాహతమంటే ఏమి?

మహర్షి: హృదయానికి వెనుకనున్న చక్రాన్ని అనాహత మంటారు. అది ఆ సంవిత్గాదు. లలితాసహస్రంలో 'అనాహత చక్రస్థాయై నమో నమః' (అనాహత మధ్యంలోని నీకు నమోవాకములు.) అని యన్నది. ఆ తరువాతి మంత్రము 'హృత్'. కాబట్టి అనాహతం హృత్ వేరనటం స్పష్టమే.

## భాషణములు 425

ఇచ్ఛాశక్తి గాని మరేదిగాని అభ్యాసం వల్లనే లభిస్తుంది.

భక్తుడు: సాఫల్యము గుర్వనుగ్రహం కారణం కాదా?

మహర్షి: అవును. నీ అభ్యాసమే, అటువంటి అనుగ్రహంవల్ల కాదా? ఫలితాలు అభ్యాసంవల్ల వచ్చేవి. అవి సహజంగా అభ్యాసాన్ని అనుసరిస్తాయి. కైవల్య నవనీతంలో ఒక పద్యం ఉన్నది. 'ఓ గురూ, నా పుట్టువు లన్నిటా నన్ను చూస్తూ,

నా మార్గం నిర్దేశిస్తూ, నిరంతరం నాలోనే ఉన్నావు'. సమయం వచ్చినప్పుడు ఆత్మ, గురురూపేణ బయట ప్రత్యక్షమౌతుంది; లేకుంటే ఎప్పుడూ లోననే ఉండి కావలసిందల్లా చేస్తూ ఉంటుంది.

## భాషణములు 426

బి.సి.దాస్, అలహాబాదు యూనివర్సిటీలో ఉద్యోగం చేస్తున్నాడు. అతడడిగాడు. సాధారణంగా మనం పుచ్చుకొనే ఆహారంవల్ల ఆధ్యాత్మికత పెరగడం లేదా తగ్గడం జరుగుతుందా? అంటే ఆహార ప్రభావం, అది మంచికిగాని, చెడుకుగాని అధ్యాత్మజీవనంపై వుటుందా?

మహర్షి: అవును. సాత్త్వికాహారం మితంగా పుచ్చుకుంటే ఆధ్యాత్మిక ప్రగతికి సహాయంగా వుంటుంది.

భ: ఎలా నడుచుకుంటే గృహస్థునకు ఆధ్యాత్మిక పరిణతి సులువౌతుంది?

మ: ధ్యానాన్నిగాని, భక్తినిగాని పెంచుకుంటే; ఇంతకూ ఆ రెండూ ఒకటే.

భ: దేముని పేరు తల్చుకో అంటారే, దాని యథార్థమేమి? దైవం పేరు వృధాగా చెప్పవద్దని బైబిల్లో లో వుంది. హిందూశాస్త్రాలు దైవాన్ని ఎప్పుడూ తలచుకోమని చెప్తాయి. వీని సమన్వయమేమి?

మ: భగవంతుని పేరు కృత్రిమంగా పైపైన, భావం లేకుండా తల్చుకో కూడదు. ఆయన పేరు ఉపయోగించు కోవడం అంటే, ఆయన్ను నిస్సందేహంగా, సంకోచాలు లేకుండా తలచుకోవడం, మరియు శరణాగతి చెయ్యడం. అటువంటి శరణాగతి చేసేక, భగవంతుని నామం ఆ వ్యక్తిలో ఎప్పుడూ ఉంటుంది.

pre-destinedులను గుర్తించేందుకు మూల లక్షణాలున్నాయా? ఎందుకంటే కొందరు పిచ్చవాళ్లు వలె కనబడతారు కదా!

మః జ్ఞాని మనస్సు జ్ఞానికే తెలుస్తుంది. తాను జ్ఞాని అయితేనే జ్ఞాని నర్థం చేసుకోగలడు. మహాత్ముని చుట్టూరా మనశ్శాంతి నిండి ఉంటుంది. దానివలన మాత్రమే ఆయన ఔన్నత్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

వారి మాటలు, చేతలు, వారగుపించే తీరు --- ఇవేవీ వారి ఔన్నత్యానికి కొలమానాలు కావు. అవి సామాన్యులకు సులువుగా అర్థమూ కావు.

భ: మనుజునికి తన ఇచ్ఛ (పురుషార్థము, పురుషకారము, Free will) అని ఏదైనా యున్నదా? అంతా విధి విహితమూ విధాయకమేనా? (ప్రారబ్ధము లేదా pre-destined)?

మ: పురుషకారము, వ్యక్తిత్వము కలిసే ఉంటాయి. వ్యక్తిత్వమున్నంత వరకూ పురుషకారమూ ఉంటుంది. దీన్ని గుర్తించే అన్ని శాస్త్రాలూ పురుషాకారాన్ని సరియైన మార్గంలో నడిపే విధానాలు బోధిస్తాయి.

విధి, పురుషాకారములు ఎవనికో విచారించు. ఆ విచారంలో స్థిరపడు. ఆ రెంటినీ దాటిపోతావు. ఈ విషయాలను చర్చించే ఉద్దేశ్యమే అది. ఈ ప్రశ్న లెవరికి కలుగుతున్నవో గుర్తించి సుఖంగా ఉండు.

భ: దేహంలాగే బుద్ధి, (intellect) భావోద్వేగం (emotion) మనిషి పుట్టుకతోనే పెరిగినవా? అవి మృతిలో లయించిపోతాయా, మృతి తర్వాత గూడ మిగిలేయుంటాయా?

మ: మృతి పిదప గతి ఆలోచించేముందు, నిద్రలో ఏమవుతుందో యోచించు. నిద్ర, రెండు జాగ్రదావస్థల అంతరం. ఆ అంతరంలో అవి మిగులుతాయా?

భ: అవును. మిగులుతాయి.

మ: మృతి విషయంలోనూ అంతే. అవి దేహబుద్ధిని సూచించేవి అంతే. నీవే దేహమైతే, అవి నీ ఆలంబనం వదలవు, నీవు దేహంకాకుంటే అవి నిన్ను బాధించవు. నాతో ఇప్పుడు మాట్లాడుతున్నది నిద్రలోనివాడే. నిద్రలో నీవు దేహం కావు, ఇప్పుడు దేహానివా? అదేమో విచారించు, అప్పుడు సమస్య సర్వమూ పరిష్కారమవుతుంది.

ఆ విధంగానే పుట్టినవన్నీ గిట్టేవే. పుట్టుక ఎవరికి? నీవు పుట్టావా? అవునంటావా? ఎవరి పుట్టుక విషయం మాట్లాడుతున్నావు? పుట్టినది దేహము; గిట్టేది అదే. నిత్యమైన ఆత్మను జనన మరణాలెట్లు బాధిస్తాయి? ఈ ప్రశ్నలు కల్గుటెవరికో యోచించి, తెలుపు. అప్పుడు నీకు తెలుస్తుంది.

## భాషణములు 427

భ: విశ్వం శబ్ద తేజోమయములు అన్నారు. ఆ రెండూ స్థూల జగత్తులో మనమెరిగిన శబ్దం తేజములవంటివా? వానిని శరీరావయవములతో -- చెవితో, కంటితో గ్రహించగలమా? అలాకాక ఎవరికివారు, వాటిని అనుభవము వలన ఎరుగవలసిందేనా?

మ: శబ్ద తేజములు తాంత్రిక పరిభాషలో నాదబిందులకు, వేదాంత పరిభాషలో మనఃప్రాణములను సూచిస్తాయి. అవి స్థూల, సూక్ష్మ, అతీంద్రియములుగ ఉంటాయి. స్థూల అంశమును అవయవములు గుర్తించగలవు. కాని మిగత రెండూ అట్లు గోచరించేవి కావు. సూక్ష్మ అంశమును అనుమాన ప్రమాణము ద్వారా గుర్తించవచ్చు. అతీంద్రియ అంశం అతీంద్రియమే!

భ: హిందూ ధర్మము జీవునికి పునర్జన్మ ఉందంటుంది. ఒక దేహం నష్టమై మరొక దేహం తీసుకొనేముందు, ఆ జీవుని గతి ఏమి?

మ: దీనికి జవాబు నిద్రావస్థను ఉపయోగించి కనుక్కోవాలి. నిద్రలో నీవేమయ్యావు?

భ: నాకు తెలీదు.

మ: తెలియకున్నా నీవున్నావు. అంటే జ్ఞానాజ్ఞానాలకు అందని ఉనికి ఒకటి సూచితమైంది. నీవు ఇప్పుడు ఆలోచిస్తున్న ప్రకారం నిద్రలో అజ్ఞానం ప్రబలియున్నా నీవు దానిని అప్పుడు పేర్కొనలేదు. కాని నీవుంటూనే ఉన్నావు. కేవలము అజ్ఞానము నీ ఉనికి అనే సత్యాన్ని తిరస్కరించదు. పురోగమిస్తున్నాడో, లేదో, ధ్యాన కాలంలో

భ: ఆత్మసాధనలో తాను అనుభవంగానో మరొక విధంగానో, తెలిపే సూచనలు ఏమైనా ఉంటాయా? మ: ఆ పురోగమనాన్ని రెండు విధాల కొలవవచ్చు. ఇష్టంగాని తలపుల

నుండి ఎంతవరకు విడివడ్డావు. ఒకే తలపుపైన ఏకాగ్రత ఎంతవరకు సాధించావు. భ: ఆత్మ సాక్షాత్కారానికి సన్న్యాసము తీసుకోవడం అవసరమా?

మ: సన్న్యాసమంటే వ్యక్తిత్వ త్యాగం - ముండనమూ, కాషాయమూ కాదు. ఒకరు గృహస్థే అయినా, తాను గృహస్థు అనుకోనంతకాలం అతడు సన్న్యాసి. మరొకరు కాషాయాలు దాల్చి, దేశసంచారి కావచ్చు; కాని అతడు తాను సన్న్యాసిననుకొన్నాడా, అతడు సన్న్యాసి కాజాలడు. సన్న్యాస యోచనే, దాని మూల ఉద్దేశ్యాన్ని పాడుచేస్తుంది.

ప్రజలు ప్రపంచాన్ని చూస్తారు. చూచుట అనగానే చూచేవాడూ, చూడబడేదీ ఉండాలి. విషయములు చూచువానికి బయట ఉన్నాయి. చూచేవాడు అత్యంత సన్నిహితుడు. వాడు ఆత్మగా తానే గనుక. అతడు తన దృష్టిని విస్పష్టంగా ఉన్న చూపరివైపు త్రిప్పక విషయాలను (చూసేవాటిని) విశ్లేషణ చేస్తాడు. మనస్సు విస్తరిల్లే కొద్దీ, అది దూరమై, ఆత్మసిద్ధి క్లిష్టమూ, కష్టతరమూ అవుతుంది. సూటిగా చూపరినే (చూసేవాడినే) చూసి ఆత్మానుభవం పొందాలి.

భ: అంటే విషయాలన్నిటినీ సమన్వయించి, వాని ఆధార సత్యాన్ని తెలుసుకోవడమే కదా?

మ: మళ్ళీ విషయాల గొడవెందుకు? చూచేవాడు. ఎవరో చూడు. సమన్వయమంటే మనస్సు నిరంతరం పనిచేయడం. ఆత్మసాధనా విధమదిగాదు.

భ: అనాత్మను నిరాకరిస్తే ఆత్మను గుర్తించవచ్చు. అదెలా చేయటం? అనాత్మ లక్షణాలేవి?

మ: అనాత్మను తొలగించాలి అనే వాడొకడున్నాడు. వాడెవడు?

భ: నా ఉద్దేశం, ఈ మనిషి. నేను కలకత్తానుండి మద్రాసు రావాలంటే నాకు మద్రాసు తెలిసియుండాలి. లేకపోతే అజ్ఞానం వల్ల దారిలో మరో స్టేషన్లో దిగిపోవచ్చు. స్టేషన్ పేర్లతోటి పలకలు, రైల్వేగైడు, సాయానికున్నాయి గాని, నా ఆత్మానుసంధానంలో మార్గదర్శి ఏది?

మ: నీవన్నది ప్రయాణం వరకు సమంజసమే. మద్రాసుకు నీవెంత దూరంలో ఉన్నావో నీకు తెలుసు. ఆత్మను వెదకి అందుకోడానికి అది నీకెంత దూరంలో ఉందో చెప్పగలవా?

భ: నాకు తెలీదు.

మః నీవు ఆత్మకెపుడైనా దూరమైనావా? దూరం కావడం సాధ్యమేనా? ఈ విషయాలన్నీ నీకు బయటవి, ఆత్మ అత్యంత సన్నిహితము కాదా? ఆత్మను పొందడానికి నువ్వు ఎక్కడికి పోవాలి?

భ: ఇప్పుడు ఆత్మకు నేను దూరంగా ఉన్నాను. ఆత్మను చేరడానికి అడుగులు వెనకకు వేయాలి.

మ: ఆ దూరం ఎంత? వేరుగానున్నాననేదెవరు? రెండు "నేను"లు ఉండగలవా? భ: ఆభరణాలు బంగారము యొక్క పరిణామమైనట్లు, వ్యక్తులు ఆత్మయొక్క పరిణామమంటారు కదా.

మ: వాని ఆధారమైన బంగారాన్ని పట్టించుకోకుండా కేవలం ఆభరణాల గురించి మాట్లాడే వారితో అవి బంగారని తెలుపుతారు. కాని ఇక్కడ వ్యక్తి ఎరుకగలవాడు, ఆత్మకు పరిణామం తానంటున్నాడు. ఆత్మకు పరిణామం కావడానికి నీవు ఆత్మకు భిన్నంగా వున్నావా?

భ: తాను ఆభరణాన్ని అయ్యానని బంగారమే అన్నట్లు ఊహించవచ్చు కదా? మ: అది జడం గనుక, అట్లు చెప్పలేదు. కాని వ్యక్తికి చైతన్యమున్నది.

అది లేక ప్రవర్తించనే లేడు. ఆత్మశుద్ధ చైతన్యము, అయినా వ్యక్తి తాను దేహంతో తాదాత్మ్యం చెందుతాడు. దేహము జడము; తాను దేహాన్నని తానుగా చెప్పుకోలేదు. ఆ చెప్పేది మరొకరు. అనంతమైన ఆత్మ అలా చెప్పుకోదు. మరి ఆ చెప్పేవాడెవరు? శుద్ధ చైతన్యానికి జడ దేహానికి నడుమ, ఒక కల్తీ 'నేను' కనిపించి తన్ను దేహానికి పరిమితం చేసుకుంటుంది. దానికై వెదకితివా, అది దెయ్యంవలె మాయమైపోతుంది. ఆ ఊహా దెయ్యమే అహంకారం అదే మనస్సన్నా, వ్యక్తిత్వమన్నా.

అన్ని శాస్త్రాలూ ఈ ఊహా దెయ్యం మీద ఆధారపడి వున్నాయి. దాని నివారణమే వాని ప్రయోజనము. ఇప్పటి స్థితి కేవలం భ్రాంతి. ఈ భ్రాంతి వదలిపోవడమే గమ్యం, మరేదీ కాదు.

భ: మనస్సును 'ఆలోచనల మూట' అన్నారు.

మ: ఎందుకంటే దాని ప్రవృత్తికంతా ఆ మూలమైన “నేను” భావమే కారణం కనుక. 'మానసంతుకిం మార్గణేకృతే, నైవమానసం మార్గ ఆర్జవాత్'. దానికి తనకని ప్రత్యేకంగా నిజమైన ఉనికి లేదు.

భ: ఆలోచనలు మనస్సు నుండి ప్రసరించబడేవి కావా?

మ: అలా అయితే మనస్సు, “నేను” ఆలోచన లేదా అహంకారానికి

పర్యాయపదంగా తీసుకోబడిందని అర్థం.

## భాషణములు 428

శ్రీ శంకరుల 'శివానందలహరి' నుండి భక్తిని వర్ణించే శ్లోకాలు పదింటిని శ్రీ భగవాన్ ఎన్నిక చేసేరు.

1. భక్తియంటే ఏమి? - అంకోలం బీజం (ఊడుగుగింజ) చెట్టునుండి పడి మరలచెట్టునే చేరేట్టు, ఇనుపముక్క ఐస్కాంతమునందుకొనేట్లు, తలపులు వెలువడి మరల మూలమందే అణగిపోతాయి. ఇది భక్తి. తలపుల మూలము ఈశ్వర చరణములు. ఈశ్వర పాదభక్తియే భక్తి. (61)

2. భక్తి ఫలము: ప్రభుని పాదతలమే, ఆధ్యాత్మికాకాశము. భక్తి అందలి దట్టమైన మబ్బు. అది కురిసిన ఆనందవర్షము మనస్సు అనే సరస్సును పొంగిపొర్లేటట్లు నింపును. అంతదాకా పలుచోటుల పరిభ్రమిస్తూన్న జీవుని పరమ ప్రయోజనం అప్పుడు సిద్ధిస్తుంది. (76)

3. భక్తిని ఎక్కడ ఉంచాలి? దేవతలకు, ఎవరికైతే జననమరణాలు ఉన్నాయో, వారియందు భక్తిని కల్గినవాళ్ళకు, దాని ఫలితంగా వచ్చేది కూడా ప్రారంభం అంతం కల్గి ఉంటుంది. అఖండ ఆనందస్థితి కావలెంటే దాని ఉత్పత్తిహేతువైన సచ్చిదానంద ప్రభు పాదములందే భక్తిసేయ తగును. (83).

4. భక్తి వచో విషయంగాదు, అనుభవైకవేద్యము. ఇందులో తర్కవాదముల ప్రయోజనము ఏమున్నది? తార్కికుల కభిమాన్యములైన ఘటపటాలు. (తర్కంలో ఘటము (కుండ), పటము (వస్త్రము) ఉదాహరణలు ఎక్కువగా వాడతారు) కష్టాల కాదుకొనవు. వాని తలపోతలతో, చర్చలతో నీవు వ్యర్థుడ వగుటెందుకు? వాక్ అవయవానికి శ్రమ తగ్గించు. ప్రభు చరణాలాశ్రయించు. అమృత మాస్వాదించు. (6).

5. అమృతత్త్వము భక్తికి ఫలము: ప్రభుచరణాంకితమైన హృదయం కలవానిని చూడగనే మృత్యువు, పూర్వం మార్కండేయునివల్ల తనకైన భంగమూహించి, పారిపోవును. ఇతర దేవతలు తమ మకుట ఘటిత మూర్ధములు శివుని పాదములు సోక మ్రొక్కుదురు. అట్టి అసంకల్పిత ఆరాధనము శివునికి మాత్రమే సహజము. మోక్షమహేశ్వరి అతని భార్య ఎప్పుడూ ఆయన అర్థాంగియే (65)

6. భక్తియే యున్నచో జీవుని పరిస్థితులు వానిని బాధించవు. తనువు లెంతవేరైనా మనసు మాత్రం అతని చరణములందే లయించును. ఆనందము ఉప్పొంగును. (10)

7. భక్తి ఎప్పుడు అక్షయము: ఎటనున్నను, ఎటులున్ననూ మనస్సును పరమేశు ని పాదములందే లయింపనిమ్ము. అదియే యోగము. ఆనందమదియే. లేక యోగి! సశరీరమైన ఆనందమే! (12)

8. కర్మయోగము గూడ భక్తియే: దైవమును వెలి వస్తువులగు పుష్పాదులచే పూజించుట ప్రయాస. ఒకే ఒక పూవు నీ హృదయము; శివుని పాదములను అర్చించి, శాంతితో ఉండుము. ఇంత సులభోపాయమును తెలియక ఊరక

పరిభ్రమించుటా! ఎంత అజ్ఞానము! ఎంత కష్టము! (9).

9. కర్మయోగము, వ్యక్తి సంసారమును నశింపచేయును - ఏ ఆశ్రమమున ఉన్నను భక్తుడు తన్నొక్కమారు తలచిన చాలును. శివుడాతనికి సంసారభారమును తొలగించి, తనపై వేచికొనును. (11)

10. భక్తియే జ్ఞానము - శివపాదములందు మనస్సు లయించుట భక్తి. అజ్ఞాన నష్టమే! జ్ఞానము! మోక్షము (91).

## భాషణములు 429

బెంగళూరునుండి వచ్చిన స్త్రీలలో నొకరు - మా దృష్టికి ప్రపంచము నానాభేదములతో నిండియుంది. ఈ నానాత్వ భేదములను దాటి సర్వార్థములకు ఏకైకమైన సారాన్ని గ్రహించే విధమేమి? sonm

మ: ఈ నానాత్వ భేదమంతా కర్తృభావనవల్ల. వేరును ధ్వంసం చేస్తే ఫలాలు కూడా నశిస్తాయి. కాబట్టి చేస్తున్నది నేనను భావనను వదిలివెయ్యి. నానాత్వం మాయమౌతుంది. సారభూతమైన సత్యం అదే బోధపడుతుంది.

కర్తృత్వభావన పోవడానికి, కర్త ఎవరో విచారించాలి. లోనవెదకితే కర్తృభావన పోతుంది. విచారమే మార్గము.

## భాషణములు 430

ఒక మహారాష్ట్ర భక్తుడు: ఆత్మ సాధనను గూర్చి చాలా చదివాను. జపార్చనాదులు చేస్తున్నాను. కాని ఏదీ తృప్తి నీయడం లేదు. శ్రీ భగవాన్ దయతో నాకు ఏదైనా మార్గం చూపించగలరా?

మహర్షి: ఏం పొందవలెనని నీ ప్రయత్నం? సుఖం ప్రతివాడూ కోరేదే. రోజూ నిద్రలో నీకు సుఖం వ్రాసి పెట్టే ఉంది. ఆ స్థితిని జాగ్రత్తులో గూడ తెచ్చుకో. అది

చాలు.

భ: నా కర్థం కాలేదు. అది ఎట్లు?

మ: ఆత్మ విచారం దానికి మార్గం.

భ: అదీ అసాధ్యంగానే ఉన్నది. ఎందుకంటే దాని మార్గం అగోచరంగా ఉంది. ఈ విచార మార్గానికి నేననర్హుణ్ణి అని అనిపిస్తే అప్పుడేమి చేయటం?

మ: సహాయం ఉంది. వ్యక్తులు దాన్ని ఉపయోగించు కోవాలి.

## భాషణములు 431

ఆంధ్రులొకరు, లేచి నిలిచి అడిగారు -- వాసనలన్నీ తుడిచి వేస్తే మనస్సు శుద్ధమౌతుంది. అదే, పరమ గమ్యమన్నారు. పొందవలసింది ఏమైనా మిగిలి ఉంటే అది ద్వైతము కాదా?

మ: మనస్సు మొదట శుద్ధం కానీ. అప్పుడూ ఈ ప్రశ్న వస్తే సమాధానం కోసం చూడవచ్చు.

## భాషణములు 432

మరొక ఆంధ్రులు - నిద్రయంటే ఏమిటి?

మ: అదేమీ? నీవు రోజు అనుభవించడం లేదా?

భ: అదేమో సరిగా తెలుసుకుందామని, దాని వలన సమాధికి నిద్రకు భేదం

గ్రహించవచ్చని. మ: నీవు మేల్కొని ఉండగా, నిద్ర ఎట్లర్థమౌతుంది? జవాబు, నిద్రపోయి అది ఏమిటో కనిపెట్టు.

భ: ఆ విధంగా నాకది తెలియదే.

మ: ఈ ప్రశ్న. నిద్రలో వేయాలి.

భ: అప్పుడీ ప్రశ్న నేనడగనే లేను.

మ: కాబట్టి నిద్రయంటే అదే.

శ్రీ భగవాన్ లేచి హాలు బయటకి వెళ్ళారు. వారు తిరిగి రాగానే ఆ పృచ్ఛకుడే

అడిగాడు --

భ: ఆత్మసిద్ధులైన జ్ఞానులు ఆచార వ్యవహారాలందరిలాగే సాగిస్తారు. అందరివలెనే వారికీ స్వప్న సుషుప్తులుంటాయా? మ: జ్ఞానలుగానీ, మరెవరుగానీ, ఒరుల స్థితి నీకెందుకు? వారిని గూర్చి

తెలిస్తే నీకేమి లాభం? నీ నిజస్వభావం తెలుసుకోవడానికి ప్రయత్నం చెయ్యాలి. ఇంతకూ నీవెవరనుకుంటున్నావు? దేహమనేనా?

భ: అవును.

మ: అలాగే జ్ఞానియన్నా నీ దృష్టిలో దేహమే. అందుకే ఈ ప్రశ్నలు. తనకు

కల నిద్రలున్నవాయని జ్ఞాని అడగడు. అతని మట్టు కతనికా సందేహాలే లేవు. సందేహాలు నీలో ఉన్నాయి. దీని వలన. నువ్వు ఇంతక్రితం చెప్పిన విషయాలు తప్పని నీకు తెలిసి ఉండాలి. జ్ఞాని దేహం కాదు, ఆయన అందరియొక్క ఆత్మ. కల, నిద్ర, సమాధి -- ఇవన్నీ అజ్ఞానుల అవస్థలు. ఆత్మకివేవీ లేవు. నీ మొదటి ప్రశ్నకు కూడా ఇదే సమాధానం.

భ: స్థిత ప్రజ్ఞత ఏమో తెల్సుకో గోరుచున్నాను.

మ: శాస్త్రాలు జ్ఞానిని ఉద్దేశించికావు. ఆయనకు తీర్చవలసిన సంశయాలు లేవు. ఇట్టి సమస్య అజ్ఞానులకే. శాస్త్రాలూ వారికే.

భ: నిద్ర అవిద్యాస్థితి, అదే సమాధియనీ అన్నారు.

మః జ్ఞానము, జ్ఞానము-అజ్ఞానములకు, అతీతమైనది. ఆ స్థితి గురించి ఏ ప్రశ్న ఉండజాలదు. అది ఆత్మ.

## భాషణములు 433

తిరువనంతపురంలో ఓరియంటల్ కాన్ఫరెన్స్ జరిగింది. దాని కధ్యక్షుడు థామస్, ఆక్సుఫర్డు యూనివర్సిటీలో ప్రొఫెసరు. ఆయన కలకత్తాకు తిరిగి వెళ్ళుతూ దారిలో భగవాన్ దర్శనానికై వచ్చాడు. కొంచెం పెద్ద వయస్సు; వెడల్పైన నుదురు. ప్రసన్నమైన వర్తన, మెత్తని, మెల్లనైన పలుకు. ప్రాచ్య వాఙ్మయంలో మక్కువ, సంస్కృతంలో కూడా, తమిళ సాహిత్యం గొప్పలు విన్నాడు. శ్రీమద్భగవద్గీత కాంగ్లంలో ఎన్నో అనువాదాలున్నాయి. వాటిలో ఉత్తమమేదో తెలియగోరాడు.

హాలులో భక్తులు క్రిక్కిరిసి ఉన్నారు. ఎవరికి నచ్చినది వారు పేర్కొన్నారు - ధీబో, మహాదేవశాస్త్రి, తెలాంగ్ ప్రముఖ రచయితలు మొదలైనవి. శ్రీభగవాన్ ఎఫ్.టి.బ్రూక్ అనువాదాన్ని పేర్కొన్నారు. థామస్ పద్యానువాదాన్ని కోరారు. ఎందుకంటే, పద్యము గీతలోని రసానికి చక్కటి వాహనము. రసము శాంతము కూడా అని ఆయన అన్నాడు.

మ: అవును. బ్రహ్మము రసమే. (రసోవైసః)

భ: రసము ఆనందము కూడా.

మ: రసము, ఆనందము, శాంతము -- ఇవన్నీ ఒకే ఆనందానికి పర్యాయ పదాలు.

పారిస్లో జరిగిన వేదాంత సభలో, గ్రాంట్ఫ్ ఇచ్చిన ఉపన్యాస ప్రతిని థామస్ కందించారు. ఆపైన డాక్టర్ జి.హెచ్. మీస్ వ్రాసిన 'ధర్మ' అనే గ్రంథాన్ని ఇచ్చారు.

థామస్: వర్ణముల విషయంలో భగవాన్ భావనలెట్టివి?

మ: వర్ణములు దేహానికి, ఆత్మకు కావు. ఆత్మ, ఆనందము. ఆనందానుభవానికై, ఆత్మానుభవం సాధించాలి. వర్ణములు మొదలైన వాటి గురించి ఎవరూ బాధపడనక్కర లేదు.

భ: అహంకారాన్ని కూడ ఆత్మ అంటారే.

మ: అహంకారము పరిమితమూ, ఆత్మ అపరిమితము.

భ: ప్రాచ్యవేదాంతము ధర్మము (religion) లపైన ఆంగ్లంలో ఎన్నో గ్రంథాలున్నాయి. ఎందరెందరో వ్యాఖ్యాతలు గూడ, రామానుజుల మతంపైని రచనలు బాగా వ్రాసారు. అద్వైతవాదులు ప్రొ॥ రాధాకృష్ణన్. ఆయన ప్రమాణములకన్న అనుభవానికే ప్రాధాన్యమంటారు. శ్రీ శంకరులెంతయో పరిణత బుద్ధిని ప్రదర్శించారు.

తర్వాత ప్రత్యక్ష జ్ఞానముపై చర్చ జరిగింది. మానసిక జ్ఞానము, ఇంద్రియ జ్ఞానము కంటే భిన్నమని ప్రొఫెసర్ ప్రసంగించారు.

మ: తన ఉనికిని నిరూపించుటేమి? దానికే ఇతర ఏ ప్రమాణమూ అవసరం లేదు. అహంకారమునుండి జనించే ఇంద్రియములూ, మనస్సూ, ఆత్మ నిరూపణకు చాలవు. వానికే ఆత్మ ఆధారము. ఆత్మ లేక అవి నిలువవు. తన ఉనికి స్వయం వ్యక్తము. ఆనందమే ఆత్మ. ఆత్మప్రియత్వమే సర్వ ప్రీతికి మూలము. (ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి)

భః ప్రీతియనగానే ద్వంద్వము స్ఫురింపదా? ఆత్మ ప్రీతి విషయమెట్లౌతుంది?

మ: ప్రేమ ఆత్మకు వేరుగాదు. విషయప్రీతి తక్కువ తరముది, కనక ఎక్కువకాలము నిలవదు. ఆత్మ అలాకాదు. ఆత్మయే ప్రేమ. అంటే దైవమే ప్రేమ.

భ: క్రైస్తవులుగూడ అట్లే భావిస్తారు. అలాగే గమ్యప్రాప్తికి ఉత్తమ విధానమేది? పతంజలి విధానం ఉత్తమం కాదా?

మ: 'యోగఃచిత్తవృత్తి నిరోధః'. (మనస్సు మారకుండా నిరోధించడమే యోగం) ఇది అందరూ అంగీకరించేదే. అందరి లక్ష్యమూ అదే. లక్ష్యమొకటే అయినా, పద్ధతి మాత్రం, వాని వాని అర్హతను బట్టి. లక్ష్య సాధనకు పూర్వాంగంగా ఎన్నిన పద్ధతి కనురూపంగా, లక్ష్యానికి వేరు వేరు పేర్లు పెట్టారు -- భక్తి, జ్ఞాన, యోగ ఇత్యాది. ఇవన్నీ ఒకటే. “స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" (ఆత్మయొక్క అనుసంధానమే భక్తి అనబడును) ఆత్మచింతనను భక్తియన్నారు.

భ: భగవాన్ అద్వైతం సమర్ధిస్తారా?

మ: ద్వైతం అద్వైతం, అనే పదాలు సాపేక్షాలు. ద్వంద్వ భావనపై నాధారపడ్డవి. ఉన్నరీత నుంటుంది ఆత్మ. దానికి ద్వైతం లేదు, అద్వైతం లేదు. 'నేనదేనేను' (అయామ్ దట్ అయామ్), కేవలం స్థితియే ఆత్మ.

భ: ఇది మాయావాదము కాదే.

మ: మనస్సే మాయ, సత్యం మనస్సుకవతల ఉంది. మనస్సు పనిచేస్తున్నంత కాలం ద్వైతం, మాయలున్నాయి. దాన్ని దాటితే, సత్యం సర్వాన్ని ప్రకాశింప చేస్తుంది. ఆత్మ ప్రకాశించును అని అన్నప్పటికీ, నిజానికి ఆత్మ స్వయం ప్రకాశము.

భ: అది సచ్చిదానందము.

మ: 'సత్ చిత్ ఆనంద'మనటం 'అసత్ అచిత్ అనానంద'లు కావనుటకే. మనం విషయ జగత్తులో ఉన్నాము. కనుక ఆత్మను సచ్చిదానందమని వ్యవహరిస్తాము.

భ: 'అహం' పదము వ్యక్తికీ, బ్రహ్మమునకూ గూడ వర్తిస్తుంది. ఇది పెద్ద దురదృష్టం.

మ: అది ఉపాధి భేదమువల్ల వచ్చింది. జీవునికి చెందిన 'అహం' దేహానికే పరిమితం. బ్రహ్మమును సూచించే 'అహం' విశ్వావధి. ఉపాధిని తొలగిస్తే 'అహం' ఏకమూ శుద్ధమునూ.

భ: భగవాన్ ఎవరికైనా దీక్ష నిస్తారా?

మ: దీక్ష లన్నింటిలో అత్యుత్తమమూ, శక్తిమంతమూ మౌన దీక్ష. దాన్ని శ్రీదక్షిణామూర్తి అవలంబించాడు. స్పర్శ, దృష్టి ఇత్యాది దీక్షలు తక్కువ తరమువి. మౌనదీక్ష అందరి హృదయాలనూ మార్చివేస్తుంది. ఇందు గురువు లేడు, శిష్యుడు లేడు. అజ్ఞాని దేహాత్మ బుద్ధి గనుక మరొక దేహాన్ని గురువుగా భావిస్తాడు. అది సరే. కాని గురువు తన దేహమే ఆత్మ

అనుకొంటాడా? అతడు దేహాన్ని అధిగమించినవాడు. ఆయనకు భేదము లేదు. అజ్ఞాని గురుశిష్య దృక్పథాన్ని తెలిసికోలేడు.

భ: మరి వారి ఇద్దరిలో భేదం లేదా?

మ: భేదాలు విషయ జగత్తు దృష్ట్యానేగాని, సత్య దృష్ట్యాగాదు.

ఆ ప్రొఫెసర్ భగవాన్కెంతగనో కృతజ్ఞత తెలిపాడు. వారినొకమారు చూచి భాషించాడు గనుక, ఇక భగవద్రచనలను సరిగా అవగాహన చేసుకోగలనన్నాడు.

మాట వరసగా భగవాన్ ఉపాసనధ్యానాలు రెండూ మనస్సున్నంత దాకానే సాధ్యమని, మనస్సణిగిపోగానే అవీ అణగిపోతాయని అన్నారు. చివరి దశయైన మనోనిశ్చలతకూ, సమూల భావనాశానికి అవి పూర్వాంగాలే యని తెలిపారు.

భ: శైవ సిద్ధాంతం మూడింటిని నిత్య, ఆధార సత్యాలుగా ప్రతిపాదించినది గదా? అది వేదాంతమునకు విరుద్ధమా?

మ: ఆ మూడూ. జీవుడూ, ఈశ్వరుడూ, బంధమూ, ఇలాంటి త్రిపుటి అన్ని మతాలలోనూ ఉన్నాయి. మనఃప్రవృత్తి యున్న వరకే అది నిజము. అవి మనఃకల్పితాలు, మనస్సు ప్రారంభమైన తర్వాతనే దైవ ప్రతిపాదనము. దైవము ఆత్మకు భిన్నుడు కాడు. ఆత్మకు దైవరూపమిచ్చారు.; గురువుకు కూడా అలాగే.

సాయంత్రానికి ఆ ప్రొఫెసర్ థామస్ తిరిగి వచ్చాడు. ఏవో సత్కర్మలను గూర్చి అడిగినాడు. బ్రహ్మమును దైవమనకుండా సచ్చిదానందమని ఎందుకన్నారాయని ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

మ: సత్ అంటే సత్- అసత్తకు అతీతము.

చిత్ అంటే చిత్ - అచిత్తకు అతీతము.

ఆనందమంటే ఆనందము - ఆనందము లేకపోవుటలకు అతీతము. అలా [illegible]?

అది సదసత్తులు రెండూ కాకపోయినా, దానిని సత్తనే ఒప్పుకోవాలి. జ్ఞానపదంతో పోల్చిచూడు. అది జ్ఞానాజ్ఞానముల కందని స్థితి. అయినా అది అజ్ఞానము కాదు. జ్ఞానమే. సత్, చిత్ ఆనందముల సందర్భమూ అంతే.

భ: అది ఒక పక్షాన్నే సమర్థిస్తోంది.

ఆయనకింకా ఎన్నో సంశయాలు, మహర్షి నడిగి తీర్చుకోవలసినవి, ఉన్నా, తాను వారికి శ్రమనీయగోరలేదు. అంతవరకు విన్నదానిని నిదిధ్యాస చేయ నభిలషించాడు. ఆత్మవిచార విషయము లొకటి రెండడిగి ఆయన వెళ్ళిపోయాడు.

మైసూరు నుండి ఒక జడ్జి నిష్క్రియత్వము ఆత్మసిద్ధి అన్నారు. సాధ్యం? ఉపాసనాధ్యానాలు మనశ్చేష్టలన్నారు. ఉపాసనాధ్యానాలు చేయక ఆత్మసిద్ధి ఎలా

మ: అవి పూర్వాంగాలు. అవి అభిలషించిన నిష్క్రియతకు దారితీస్తాయి.

భ: వక్షానికి కుడివైపున హృదయం స్ఫురిస్తుందన్నారు. శారీరకంగా అది ఎడమ వైపున ఉంది.

మ: నేను చెప్పినది ఆధ్యాత్మికము.

భః అది తాత్త్విక (సైకిక్) హృదయమా?

మ: అవును.

భ: అది కుడివైపునని తెలియడమెలాగ?

మ: అనుభవం వల్ల.

భ అట్టి సూచన ఏమైనా ఉందా?

మ: నిన్ను నీవు చూపి, చూడు.

## భాషణములు 434

క్రిస్మస్ సెలవులు - దూర ప్రాంతాలనుండి గూడ చాలామంది రావడంతో ఆశ్రమం క్రిక్కిరిసిపోయింది. అందులో ఒక బృందం భగవాన్ ఎదుట కూర్చుని ఉన్నారు. వారిలో ఇర్వురు ప్రశ్నింపసాగారు.

భక్తుడు: మీకు ఇంగ్లీషు వచ్చునా? (ఇంగ్లీషులోనే కానిమ్మను సూచనపై)

మీ కాత్మసిద్ధియైందా?

శ్రీ భగవాన్ నవ్వి 'ఇంకా అడుగు' అన్నారు.

భక్తుడు: మీరు నిర్వికల్ప సమాధి అనుభవించేరా?

భగవాన్ ప్రశ్నలన్నీ పూర్తి కానీయమన్నారు.

భక్తుడు: ఇష్టం వచ్చినప్పుడెల్లా మీరు నిర్వికల్ప సమాధిలో ప్రవేశించగలరా? జ్ఞానులు వారి పరిసరాలను ప్రభావితం చేయడం అవసరం కాదా?

మరొకరడిగారు -

భ: సత్యం సాధించడానికి భగవాన్ మాకేమైనా సాయపడతారా?

మ: సహాయం ఎప్పుడూ ఉంది.

భ: అట్లయితే ప్రశ్నలతో పనే లేదు. ఎప్పుడూ ఉన్న ఆ సాయమేదో నాకేమో తెలియరావడం లేదు.

మ: శరణాగతి చెయ్యి కనబడుతుంది.

భ: నేనెప్పుడూ తమ పాదాలవద్దనే ఉన్నాను. భగవాన్ ఏదేని ఉపదేశం ఇస్తే, అనుసరించగలను. లేనిపక్షంలో 600 మైళ్ళ దూరంలోని నాకు మీ సాయం లభించేదెలాగ?

మ: సద్గురువు నీలోనే ఉన్నాడు.

భ: అది అర్థం కావడానికి గూడ నాకు సద్గురు సాయం కావాలి.

మ: ఆ సద్గురువు నీలోనే ఉన్నాడు.

భ: నాకు ప్రత్యక్ష గురువు కావాలి.

మ: ఆ కనబడే గురుపే నీలోనే ఆ గురువు ఉన్నాడని అంటున్నాడు. భ: నా భారమంతా సద్గురువు కరుణకు వదిలెయ్యవచ్చా?

మ: అవును. ఉపదేశాలు, శరణాగతి చెయ్యనంతకాలం అవసరం.

భ: ధ్యానానికి నిర్ణీత సమయం అవసరం లేదా?

మ: ధ్యానం మనోబలంపై ఆధారపడి ఉంటుంది. ధ్యానం నిరంతరంగా

సాగాలి. పని చేస్తున్నప్పుడు గూడ, క్రొత్తగా ఆరంభించేవారికైతే సమయం నిర్ణయించాలి.

భ: సద్గురువులు నా తలపై చేయియుంచి సాయం ఉందని నమ్మకం కల్పిస్తారా? వారి వాక్కు నెరవేరునని నాకు ఊరట కల్గుతుంది.

మ: ఆపైన ఒక అగ్రిమెంటు పత్రం; నీవనుకొన్న సాయం కనబడకపోతే కోర్టులో కేసు. అవునా (నవ్వుతారు).

భ: మీ ఆశీస్సుకై దగ్గరగా రావచ్చునా?

మ: నీ కలాంటి సంశయాలే రాకూడదు. కలిగితే నీ శరణాగతిని నీపే నిరాకరించినట్లు అవుతుంది. సద్గురువు సదా నీ తలపైనే ఉన్నాడు.

భ: శరణాగతికి గూడ ప్రయత్నము వల్లనే వస్తుందా?

మ: అవును. అది పూర్తి కావడానికి కాలం పడుతుంది. భ: ఉపదేశానికై గురువుండాలా?

మ: ఏమైనా క్రొత్తగా నేర్చుకోవాలంటే గురువవసరమే. కాని ఇక్కడ నీవు నేర్చుకున్నది మరచిపోవాలి.

భ: ఎలాగైనా గురువవసరమే.

మ: నీవెక్కడో వెదకుతున్న దానిని నీకిప్పటికే పొందావు. కాబట్టి ఏ గురువూ

అక్కరలేదు.

భః సాధకునికి జ్ఞానివల్ల ప్రయోజనమేమన్నా ఉంటుందా?

మ: ఉంటుంది. ఆత్మసిద్ధి కాలేదే అన్న నీ భ్రాంతిని పోగొట్టుటకు సాయం చేస్తాడు.

భః ఏం చేయాలో చెప్పండి.

మ: వ్యక్తి విభ్రాంతిని తొలగించుటకే, వివిధ మార్గాలు చెప్పారు.

భ: అయితే నా విభ్రాంతిని తొలగించి, ఏ మార్గంలో పోవాలో చెప్పండి.

మ: నీవిప్పుడెక్కడున్నట్లు? ఎక్కడికి వెళ్ళాలి?

భ: 'నేనున్నాను' అది నాకు తెలుసు. కాని నేను ఏమిటి అది తెలీదు.

మ: అయితే, రెండు “నేను”లు ఉన్నాయా?

భ: అది సమాధానం కాదు, ప్రశ్నను తిరగతోడడమే.

మ: అట్లనేదెవరు? ఆ ‘ఉన్నవాడా'? కాక తానున్నస్థితిని తెలియనివాడా?

భ: నేనున్నాను. ఎట్లున్నానో, ఏమిగా ఉన్నానో తెలియదు.

మ: 'నేను' సదా ఉన్నది.

భ: ఆ 'నేను'లో మార్పేమన్నా కలుగుతుందా? మాట వరసకు మరణించినప్పుడనుకోండి.

భ: ఆ మార్పును చూసేదెవరు?

భ: మీరిప్పుడన్నది జ్ఞానయోగంవలె ఉంది.

మ: అవును అదే.

భ: కాని శరణాగతి భక్తియోగం కాదా?

మ: రెండూ ఒకటే.

భ: కొంతసేపాగి అతడన్నారు. నాకు తోచిన సారాంశమిది నేను శుద్ధచైతన్యాన్ని, నా ఉనికి లేకుండా ఏమీ జరగదు.

మ: తర్కంవల్ల అట్టి నిరూపణ ఒక ఎత్తు; అది సరియన్న నమ్మకం దాని

భావం కల్గడం మరొక ఎత్తు.

భ: మూడు నెలలు వేచి చూస్తాను. సాయం వస్తున్నదో లేదో తెలియడానికి. ఆపాటి నమ్మవచ్చా?

మ: ఇదా శరణాగతి చేసిన వ్యక్తి అడిగే ప్రశ్న.

ఆగంతకులు నల్గురూ వెళ్ళిపోయారు. ఆ పృచ్ఛకుడింకా వదలలేదు. 'మీ మాట నిలబెట్టుకోండి' అన్నాడు. అందరూ నవ్వారు.

అతడింకా అన్నాడు -

దైవం తినడానికి కావలసినంత ఇచ్చాడు. నేను సుఖంగానే ఉన్నాను. దానికి తోడు నాకు కావలసింది మనశ్శాంతి. దాని కోసమే ఈ ప్రార్థన.

## భాషణములు 435

సిలోనుండి ఇద్దరు మగవారూ, ఇద్దరాడవారూ వచ్చారు.

భక్తుడు: తమకు దైవసాక్షాత్కారమైందా? అయితే ఏ రూపంలో?

మహర్షి: దైవాన్ని చూడడానికి మిగిలియుండేదెవరు? అంతకన్నా, తనకు తాము తెలుసునా అని అడగడం బాగుంటుంది.

భ: నన్ను నేను తెలుసుకున్నాను.

మ: అందులో రెండు 'నేను'లు ఉన్నాయా? అవి వేర్వేరా?

భ: ఆత్మ శరీరంతో సమానమని నేను ఎరుగుదును. ఆత్మ దేహానికి భిన్నమైతే, నన్ను నా దేహానికి భిన్నంగా చూచుటెట్లో భగవానే చెప్పుదురు గాక. ఆయన దైవాన్నెరుగుదురు, నాకు తెలియజెప్పనూ గలరు.

మ: ఆత్మను దేహమునుండి విడదీయడం ఎందుకు? దేహంపాటికి దేహాన్ని అట్లే ఉండనీయండి.

భ: శరీరం పోయిన తర్వాత ఆత్మ అన్ని శరీరాలనూ చూడగలదు.

మ: అప్పుడు ఇతరులూ ఉన్నారా? లేదా. నీ శరీరమైనా ఉందా? నీ నిద్ర విషయం చూడు నిద్రలో నీ దేహాన్ని ఎరుగవు. అయినా నీ వంతసేపూ అక్కడే ఉన్నావు. అప్పుడు నీ వీ ప్రపంచాన్ని నీ దేహంతోగాని ఇతర దేహాలతోగాని చూచావా? అది ఏమైనా నీవు నిద్రలో లేవనలేవు గదా? జగత్తును చూడటానికి ఒక కర్త ఉండాలి. ఆ కర్త పరిమితంగానే ఉండాలి. నిరవధి అయితే అవధులులేని ఆత్మకు ఇతరులెట్లుంటారు?

భ: దైవానికి హద్దులున్నాయా?

మ: దైవాన్ని వదిలేద్దూ. నిద్రలో నీకే హద్దులున్నాయి?

భ: అట్లయితే మృతి ఉత్తమోత్తమ స్థితి కావాలి.

మ: నిజమే. మనమిప్పుడు చావులోనే బ్రతికియున్నాము. నిరవధియైన ఆత్మను పరిమితం చేసేవాడు, ఆ పరిధులను నిర్మించి ఆత్మహత్య నొనర్చినట్లే.

భ: ఆత్మపై చిత్తం నిల్పమన్నారు. ఎలా?

మ: అది పరిష్కారమైతే, ఇతరాలన్నీ పరిష్కారమైనట్లే.

భ: నిన్ను నీవు తెలుసుకొమ్మంటారు. అది ఎలా?

మ: నీవు దేహమని ఇప్పుడు నీకు తెలుసు.

భ: రాజయోగంలో సిద్ధి దేహేంద్రియములద్వారా, భగవాన్ ఆత్మసిద్ధి విచారంవల్ల అన్నారు. ఇది జ్ఞానయోగము.

మ: దేహం లేకుండా నీవెలా ఆలోచిస్తావు?

భ: దైవం ఆలోచించదు.

మ: మరి దైవాన్ని ఏ రూపంలో చూసారని మొదలుపెట్టావే, ఎందుకు?

భ: దైవానుభవం ఇంద్రియముల ద్వారా ఉండాలి.

మ: దైవానుభవం నీకిప్పుడు లేదా?

భ: దైవానుభవం ప్రతివానికి సదా ఉంటుందా?

మ: అవును ఉంటుంది.

భ: అయితే ఆత్మసాక్షాత్కారమంటే ఏమిటి?

మ: ఆత్మసాక్షాత్కారం కాలేదన్న భ్రాంతిని తొలగించడమె, ఆత్మసాక్షాత్కారం.

భ: తాత్పర్యం బోధపడలేదు.

కేమెరాతో భగవాన్ ఫొటో ఒకటి తీసికొని వారు వెళ్ళిపోయారు.

## భాషణములు 436

భ: విశ్వరూపమంటే ఏమిటి?

మ: ఈ ప్రపంచాన్ని దేముని యొక్క ఆత్మగా చూడడం. భగవద్గీతలో దైవము నానావిషయములు, బహు జీవరాశులు విశాలప్రపంచము అంతయు తానేయని చెప్పియున్నది. దాన్ని అర్థం చేసుకోవటం, చూడడం ఎలాగ? తన ఆత్మను తాను చూడగలడా? కనబడకపోయినంతకే, ఆత్మ లేదనవచ్చునా? ఇందు యథార్థమేమిటి?

భ: కొందరు దాన్ని చూసారంటే అది తప్పా?

మ: నీవెంత నిజమో అది అంతే నిజం. గీత ఎలా ఆరంభించిందో చూడు -- 'ఎవ్వరూ పుట్టనేలేదు' అని. నాల్గవ అధ్యాయంలో 'అవతారములెన్నో నీవి, నావి, గడచాయి. నేను వాని నెరుగుదును. నీకు తెలియవు' ఈ రెండు వాక్యాల్లో ఏది నిజం? వినేవాని బుద్ధిని బట్టి ఉపదేశం. రెండవ అధ్యాయంలోనే సత్య సర్వం ఉంటే, దాని తర్వాత పదాహారధ్యాయాలు ఎందుకు చెప్పినట్లు?

బైబిల్లో లో దైవము 'నేను అబ్రహంనకు పూర్వమే ఉన్నాను'. 'నేనుంటిని' అనలేదు. 'నేనున్నా'నన్నాడు.

## భాషణములు 437

మహర్షి: వివేకానందులు శ్రీరామకృష్ణులను అడిగారు - "మీరు దేముణ్ణి చూసారా" అని ఈ విషయం చదివి వస్తారు. దాన్ని ఇక్కడ అనుకరిస్తూ నన్ను అడగుతారు "మీరు దైవ సాక్షాత్కారం పొందారా" అని. వాళ్ళను "సాక్షాత్కారమంటే ఏమిటి" అని అడుగుతాను.

ఆత్మస్థితి అంటే పూర్ణత. నీకు పరిధులుంటే నీ గ్రహింపు కూడ పరిమితమే. అప్పుడు నీ ఎరుక పూర్ణం గాదు. అపూర్ణజ్ఞానానికి విలువ ఏంటి?

విశ్వరూప దర్శనమప్పుడు అర్జునుడితో, 'నీవేమీ కోరుతావో అవి చూడు' అని కృష్ణులన్నారు. అతని ఎదుట ఉంచిందంతా చూడమనలేదు. ఆ దర్శనం నిజం ఎలా అవుతుంది?

## భాషణములు 438

భక్తుడు: తత్త్వజీవితం ఆరంభిస్తున్న నావంటివానికి ఏది తగియుంటుంది సగుణ ధ్యానమా, లేక 'నేను బ్రహ్మ'మన్న విచారమా?

మహర్షి: సమాధానం నీ ప్రశ్నలోనే ఉంది. ఈశ్వరుని సగుణునిగా

అర్చించుమని ఆ ప్రశ్నే తెలుపుతున్నదే? భ: 'నే'నన్న భావన జాగ్రత్ స్వప్నావస్థల్లోనే ఉంది; గాఢనిద్రలో లేదే? కారణమేమి?

మ: అంత మాత్రాన గాఢ నిద్రలో 'నేను' లేకపోయిందా?

భ: బహుశః ఆ రెండవస్థల్లో మనస్సు చలనంతో కూడి ఉంది. నిద్రలో లేనందువల్లనేమో!

భాగం - 3

## భాషణములు 439

భ: శ్రీ రామచంద్రులడుగుతున్నారు - బ్రహ్మముశుద్ధము. అతని నుండి మాయ పుట్టడం ఏంటి? అతనినే కప్పడం ఏంటి?

వసిష్ఠుల సమాధానం - "గాఢ వైరాగ్యమున్న శుద్ధ మనస్సులో, ఈ ప్రశ్న జనించదు". నిజమే, అద్వైత వాదంలో జీవ, ఈశ్వర, మాయలకు తావు లేదు. తనలో తాను మునుగగా, వాసనలు పూర్తిగా నష్టమై, ఆ ప్రశ్నలకు తావీయవు.

మహర్షి: సాధకుని గ్రహణ శక్తికి తగినట్లే సమాధానాలు. గీత రెండవ అధ్యాయంలో 'ఎవరునూ పుట్టరు - చావరు. నాల్గవ అధ్యాయంలో శ్రీ కృష్ణులు తనకూ అర్జునునికి పుట్టువులెన్నో యుండినవని, అవన్నీ తనకు తెలుసుగాని అర్జునుడెరుగడనీ అన్నారు. ఈ రెండులో ఏది సరి? రెండూ సరియైనవే. వాటి దృష్టి కోణాలు వేరు. ప్రస్తుత ప్రశ్న - ఆత్మనుండి జీవుడెట్లు పుట్టెను? సమాధానము చెప్పాలి గదా? 'నీ యథార్థస్థితిని తెలుసుకో, నీకీ ప్రశ్నే రాదు.'

తాను వేరని ఎవరైనా ఎందుకనుకోవాలి? పుట్టక పూర్వం తానెట్లున్నాడు? చనిపోయిన పిదప ఎట్లుండబోతాడు? ఇట్టి ప్రశ్నలతో కాలం వృథా చెయ్యడం ఎందుకు? నిద్రలో నీ రూపేమి? నిన్ను నీవొక వ్యక్తిగా ఎందుకు భావిస్తున్నావు?

భ: నిద్రలో నా రూపం సూక్ష్మంగా ఉంటుంది.

మ: ఫలానికి అణుగుణంగానే కారణం. చెట్టుకొలది దాని విత్తనం. ఆ చెట్టంతా దాని విత్తనంలో ఇమిడియుంది. తర్వాత అది వృక్షంగా ఎదిగి విస్తరిస్తుంది. ఆ విస్తరిల్లిన చెట్టుకొక ఆధారం ఉంటుంది. ఆ ఆధారమే 'మాయయంటాము. నిజానికి విత్తనమూ లేదు, చెట్టూ లేదు; "ఉండుట" ఒక్కటే ఉంది.

భ: వాసనా క్షయం, మనోనాశం, ఆత్మసాక్షాత్కారం - ఇవన్నీ పరస్పరాశ్రయములుగా ఉన్నట్లు కనబడుతున్నాయి.

మ: మాటలే వేరు, అర్ధమొక్కటే. వ్యక్తి పరిణతిబట్టి, మాటలు వేరౌతాయి. వైరాగ్యమూ, ఆత్మసాక్షాత్కారమూ సమానార్థాలే. సాధన, వైరాగ్యము - సాధన ఎందుకు? సంస్కారాలు అణుగుతూ లేస్తూ ఉంటాయి గనుక.

భ: అనాదిగా ఉన్న వాసనలవల్ల తప్పులు చేస్తాము. జ్ఞానం కల్గితేనేగాని ఆ వాసనలు పోవు. కాని జ్ఞానమసాధ్యమనిపిస్తున్నది. కర్మక్షయానికి ప్రాయశ్చిత్తమాత్రం చాలదు. ప్రాయశ్చిత్త మెన్నిటికని, ఎంతకని? ఏమి చేద్దామన్నా కష్టంగా, అసాధ్యంగా తోస్తున్నది. ఈ కష్టాలన్నిటికీ సత్సంగమొక్కటే మందుగా అనిపిస్తోంది.

మ: ఏమి చేస్తాం? సత్యమొక్కటే ఒకటి. దాన్ని సాధించేదెట్లా? సిద్ధియనేది భ్రాంతి. అభ్యాసం కావలసినట్లున్నది. అభ్యసించేదెవరు? ఆ కర్తను వెదకితే కార్యము, ఉపకరణాలూ అన్నీ మాయమౌతాయి.

సిద్ధి ఇప్పటికిక్కడే లభించియుండక, క్రొత్తగా వచ్చేదైతే, దానివల్ల ప్రయోజనమూ లేదు. శాశ్వతమైనది ఎల్లప్పుడూ ఉండాలి. క్రొత్తగా సిద్ధించేదైతే అది కలకాలం ఉండగలదా?

అందుచేత, ఎప్పటికీ ఇక్కడే ఉండే దాన్ని సాధించు. పూర్వం యోగులట్లే చేశారు. ఇప్పుడూ చేస్తున్నారు. ఎప్పటికప్పుడే సిద్ధి కలుగుతున్నది గనుక, అది సరికొత్తగా కనిపిస్తుంది. ఒక్కమారు అజ్ఞానం కప్పేసి, అందుండి బయట పడితే, క్రొత్తగా దొరికినట్లు తోస్తుంది. కాని అందు క్రొత్తఏమీ లేదు.

భ: కర్మ భక్తి యోగ జ్ఞానాలూ, వాని అంతశ్శాఖలూ మనిషిని గజిబిజి చేస్తాయి. పెద్దలు చెప్పిన ప్రకారం నడుచుకోవడమొకటే సరియైన మార్గం. దేనిని అవలంబించటం? శ్రుతి స్మృతులను శోధించలేను; అవి అపారములు. అందువల్ల నన్ను కరుణించి మార్గం చూపండి. (బదులు లేదు).

## భాషణములు 440

భ: పెద్ద తర్కమూ, పరిభాషా లేకుండా ఆత్మానందానికి మార్గం సెలవీయండి. అది గుర్వనుగ్రహ మాత్రమే అయినా సరే.

మ: నీకేమి కావలెనో స్పష్టం చేసుకో. ఎవరు ఏమి పొందాలని ప్రయత్నం? అది నిర్ణయించుకొని ఆ పైన విధానమడుగు.

భః ఎప్పుడో ఒకటి రెండుమార్లు, ఆనందానుభూతి కలుగుతుంది. కాని దాన్ని వర్ణించలేను. అప్పుడప్పుడు తేజమగుపిస్తుంది - జ్ఞానప్రకాశమేమో -- అది సత్యమేనా? అదే అయితే, దాన్ని శాశ్వతం చేసుకొనేదెట్లా? పద్ధతి ఏదో సులభంగా కావాలి దయచేసి, తర్కం, తత్త్వవాదము, అజ్ఞేయ పదాలు వాడకుండా తెలుపండి (బదులు లేదు)

మరొకరు: దైవ ప్రార్థన, గుర్వనుగ్రహము, ఏకచింతన వంటి పద్ధతుల్లో అత్యుత్తమమేది?

మహర్షి: వానిలో ఒకటి మరోదాని ఫలితం. అందులో ఏ ఒకటైనా ఆ తరువాతి దశకు చేరుస్తుంది. అవి పరస్పరాలంబనాలు. వాటిలో తేడాలు లేవు. దైవము, గురువు, ఆత్మా -- అవి వేర్వేరు కావు. అన్నీ ఒకటే. కాబట్టి మార్గాల్లోనూ వ్యత్యాసం లేదు.

## భాషణములు 441

అలహాబాదులో గవర్నమెంటులో పెద్ద ఉద్యోగి, శ్రీపన్నాలాల్, ఐసిఎస్, ఆయన భార్య, బ్రిజనారాయణ యని మరొక రిటైర్డు జడ్జి వారం రోజులు ఆశ్రమంలో ఉండవలెనని వచ్చారు. మరుప్రొద్దుట తిరిగి వెళ్తారనగా ఆ రాత్రి వారు తమ సందేహాలు తీర్చుకోగోరి మహర్షి సన్నిధికి వచ్చారు. ఇది వారి సందేహము --

మా గురువొక గొప్పయోగి. వారు మాకు నామజపముగా 'హరి' జపాన్ని ఉపదేశించి అదియే సర్వసారమన్నారు. చిత్తైకాగ్రత అవసరం లేదు, హరినామం నిరంతరంగా జపిస్తుంటే ఏకాగ్రత అదే కుదురుతుందన్నారు. మేమట్లే చేస్తున్నాము. గురువులు బ్రహ్మీభూతులయినారు. మా స్థితి సముద్రంలో చుక్కానిలేని పడవ గతి అయింది. తగిన గురువుకై వెదకుతూండగా మిమ్ము గురించి విని మీరు రచించిన కొన్నిటిని చదివినాము. ఇక్కడికి రాక కది కారణము. మా కోరిక రెండేళ్ల తపన తర్వాత తీరింది. ఇక్కడికి వచ్చి శ్రీభగవాన్ భాషణలు విని, సద్గురువులు ఆత్మవిచారం బోధిస్తారని తెలుసుకొన్నాము. ఇది జ్ఞానమార్గము, పూర్వం మా గురువు బోధించినది భక్తిమార్గము. ఇప్పుడు మేము చేయవలసిన దేమి? పూర్వమార్గాన్ని వదిలి ఈ క్రొత్తమార్గాన్ని చేబట్టాలా? ఒక మారిలా మారితే, కొత్త కొత్త గురువులను కలుసుకొనే కొద్దీ మార్గాలు మార్చుకొనడమేనా? ఇట్లు మారుతుంటే, మాకు పరిణతి ఎలా? కృపచేసి, ఈ సందేహం తొలగించి మమ్మాశీర్వదించండి.

మహర్షులు వారికి కన్షన్గాడు ఆశ్రమంవారు ప్రకటించే విజన్ పత్రిక, సెప్టెంబరు ప్రతినిచ్చి దానిలోని వ్యాసమొకటిని చదువమన్నారు.

యోగి నామదేవుల ప్రకారం దివ్యనామతత్త్వము

1. దివ్యనామం విశ్వనిబిడంగా వ్యాపించియుంది. అధోలోకాల్లో ఏ అంతరానికో పోయిందో, ఊర్ధ్వలోకాల్లో ఏ అంతస్థుకు ఎగిసిందో ఎవరు చెప్పగలరు.

పుట్టుకలు 84 లక్షల విధాలు. తత్త్వసారము తెలియని మూఢులు పై అన్ని రకముల జన్మలూ పొందుతూనే ఉంటారు. నామము అమరము. రూపాలు అగణితాలైనా, అన్నీ ఆ నామమే.

2. నామమే రూపము, రూపమే నామము. నామ రూపములకు వ్యత్యాసం లేదు. దైవము ప్రత్యక్షముగ అవతరించి నామ రూపములను తాల్చినాడు. శ్రుతి విహితమూ నామమే. నామమునకు మించి వేరు మంత్రం లేదు. ఇది కాదన్నవారు మూఢులు. నామము స్వయముగా కేశవుడే. ప్రభునెడల భక్తి ప్రేమలు గలవారికే ఇది తెలుస్తుంది.

3. సర్వవ్యాపకమైన నామమును, వ్యక్తి తన 'నేను'ను గుర్తించి నప్పుడు మాత్రమే తెలిసికోగలడు. తన నామమే తెలియనివాడు సర్వవ్యాపియైన ఆ నామము నెట్లు గుర్తించును? తన్ను తాను తెలిసికొనిన వాడు ఆ నామము నెల్లెడలా చూడగలడు. నామమును, ఆ నామమున్న వానిని వేరనుకోవటం భ్రమ కల్గిస్తుంది. యోగులనడిగి చూడమన్నాడు నామదేవుడు.

4. జప, ధ్యాన, తపస్సులవల్ల ఎవరూ "నామము"ను అనుభవగోచరం చేసుకోలేరు. మొట్టమొదట గురుపాదములే శరణ్యములని స్వార్పణచేసి నీలోని "నేను" ఎవరో తెలిసికొనడాన్ని అభ్యసించు. ఆ 'నే'నెక్కడినుండియో తెలిసికొని ఆ ఏకంలో నీ వ్యక్తిత్వాన్ని లయంచేయి. ఆ ఏకము, ఆత్మస్థితము, అద్వితీయము, ద్వైతా ద్వైతముల నధిగమించునది.

ముల్లోకముల నిండియుండినది ఆ నామమే. నామము కేవలము పరబ్రహ్మమే. అచట ద్వైతము వలన క్రియా ప్రవృత్తి కలుగదు.

## భాషణములు 442

తమ పద్యాన్ని ఒకదాన్ని శ్రీభగవాన్ వివరించారు -- సూర్యుడు ప్రపంచాన్ని ప్రకాశింప చేస్తాడు. కాని అరుణాచల సూర్యుడు తన ఉజ్జ్వల ప్రభలచేత విశ్వాన్నంతటినీ కబళించి, ఉజ్జ్వలమైన ఆ తేజముగనే మిగిలియుంటాడు. అది ఇప్పటి స్థితిలో తెలియరాదు. హృదయ కమలం పూర్ణముగా వికసించాలి. మనం రోజూ చూసే సూర్యునికాంతికి సాధారణ కమలాలు విచ్చుకుంటాయి. కాని సూక్ష్మమైన హృత్పద్మము వికసించడానికి సూర్యులకు సూర్యుడు రావాలి. అతని అఖండ తేజోరాశి ఏకమై వెలుగుటకు అరుణాచలుడు వికసింపచేయుగాక. హృదయాన్ని నా

ఆ తరువాత పద్యాల్లో మరొకటి - అద్దంలో విషయాలు ప్రతిబింబిస్తాయి. కాని అవి నిజం కావు. అద్దంలేక అవి ఉండవు. అలాగే ఈ జగత్తు మనస్సులోని ప్రతిబింబము; మనస్సు లేక నిలువదు. ప్రశ్న ఏమంటే విశ్వము ప్రతిబింబమే అయితే, మనస్సులో ప్రతిఫలించటానికి అసలు విశ్వబింబముండవలెగదా? అట్లైతే విషయికమైన జగత్తున్న దన్నట్లేగదా? కాని నిజానికి అట్లది లేదు.

అందుకే స్వప్న సామ్యము తెచ్చారు. స్వాప్నిక జగత్తుకు అసలు జగత్తుండపనిలేదు. అయితే అదెట్లు సృజింపబడింది? మనస్సులో అటువంటి సంస్కారాలు ఉన్నాయని ఒప్పుకోవాలి. వానిని వాసనలన్నారు. ఆ వాసనలు మనస్సులో ఎక్కడివి? అవి సూక్ష్మంగా ఉన్నవని సమాధానం. అంత పెద్ద చెట్టు చిన్ని విత్తనంలో ఉన్నట్లు. అట్లే మనస్సులోని ప్రపంచమూను.

కాని విత్తనం చెట్టునుంచి వచ్చింది; ఆ విత్తనం నుంచి చెట్టు మళ్ళీ పుట్టి ఎదగటానికి, ఒకప్పుడా చెట్టు ఉండనేవలె. అలాగే ప్రపంచం గూడ పూర్వం కొంతకాలం ఉండియుంటుంది, అవునా? కాదని సమాధానము. వాసనలిన్ని పెరిగినా ఇప్పటి రూపులో మళ్ళీ వ్యక్తం గావటానికి, పూర్వం నా జన్మలెన్ని ఉన్నవో. ఇప్పుడున్నట్లే నేను పూర్వమొకప్పుడుండి ఉంటాను. సూటిగా సమాధానం రావలెనంటే జగత్తు అసలుందా? లేదా? పరిశీలించాలి. ప్రపంచం ఉందనుకుందాం. అప్పుడు ద్రష్టనొకనిని ఒప్పుకోవాలి. ఆ ద్రష్ట నేనే. జగత్తుకూ ఆ ద్రష్టకూ గల సంబంధం తెలుసుకోవలె నంటే, నన్ను నేను తెలుసుకోవలె గదా? నేను నన్ను విచారించి ఆత్మస్థితిలోనే ఉండిపోతే, చూడడానికి జగత్తేది? ఇంతకు సత్యమేమిటి? ద్రష్టయే సత్యం, జగత్తు కాదు.

యథార్థమది అయినా ప్రపంచం సత్యమనే భావనతోనే వాదం సాగిస్తారు. ప్రపంచం పక్షాన వాదించమని అతడిని ఎవరడిగారు? మిథ్యా వివర్జనమూ, ఆత్మ సంస్థితి నిర్వచనముంది. ఇవే మోక్షమని యోగ వాసిష్ఠంలో నిర్వచనముంది.

## భాషణములు 443

భ: అద్దం ఉదాహరణ దృగింద్రియానికే పరిమితం. జగత్తును ఇతరేంద్రియములతో సైతం తెలియుటలేదా? వాని పక్షాన గూడ జగన్మిథ్యాత్వమును ఋజువు చెయ్యగలమా?

మ: సినీదృశ్యంలో తెరపై నొకపాత్ర ప్రపంచాన్నంతా పరికిస్తున్నట్లు కనబడుతుంది. దృశ్యంలో కర్తృవిషయములు యాథార్థ్యమేమి? ఒక మాయామయమైన వ్యక్తి, ఒక మాయా ప్రపంచాన్ని గమనిస్తున్నాడు.

భ: కాని ఆ దృశ్యానికి ద్రష్టను నేనుగదా?

మ: అవును నీవే. నీవూ నీ జగత్తూ, సినీపాత్ర సినీ ప్రపంచం ఎట్టి నిజమో, అంతే నిజం.

## భాషణములు 444

ఒక న్యాయవాది - ఇంద్రియాలద్వారా మనస్సు ప్రపంచాన్ని తెలిసికొంటుంది. ఇంద్రియములు పనిచేస్తూండగా ప్రపంచస్థితిని గుర్తించక తప్పదు. శుద్ధజ్ఞానానికి కర్మయోగ ప్రయోజన మేమి?

మ: ప్రపంచాన్ని ఇంద్రియముల ద్వారా మనస్సు చూస్తుంది. అది మనస్సుకు సంబంధించినది. ద్రష్ట మనస్సునూ ఇంద్రియాలనూ ఆత్మలోనివిగానే చూస్తాడు, వేరుగా కాదు. కార్యాలవల్ల అబాధితుడైన కర్త ఆత్మస్థితుడయినదాక, ఇంకా ఎక్కువ శుద్ధుడౌతాడు.

## భాషణములు 445

అక్షరమణమాలలో ఒక పాదాన్ని వివరిస్తూ భగవాన్ అన్నారు ఉపదేశాలలో ఉత్తమోత్తమము మౌనము. నిశ్శబ్దమే గురువు, శిష్యుడు, సాధకుడూను.

భగవద్దర్శనానికి వచ్చిన ముగ్గురు సన్న్యాసులు చర్చించ మొదలు పెట్టారు. భ: మౌనంగా కూర్చుంటే పనులు జరిగేదెలాగ? కర్మయోగానికి స్థానమేది?

మ: మొదట కర్మయేమో, ఎవని కర్మమో, కర్త ఎవరో తెలుసుకుందాం. వానిని పరిశీలించి, యథార్థం విచారిస్తే, విధిగా అతడు శాంతుడూ, ఆత్మస్థితుడూ అవుతాడు. కర్మలు సాగుతూనే వుంటాయి.

భ: నేనేమి చేయక ఊరకే ఉంటే కర్మలు సాగేదెలా?

మ: ఈ ప్రశ్నించేదెవరు? ఆత్మయా, మరొకరా? ఆత్మకు కర్మతో ఏమైనా సంబంధముందా?

భ అడిగినది ఆత్మకాదు. దానికి వేరైన మరొకరు.

మ: కర్మలతో ఆత్మకు సంబంధం లేదని తేలిందిగా. ఇక ఆ ప్రశ్న రాదు.

భ: ఒప్పుకున్నాను.

మరొకరు ... ఆత్మజ్ఞుల మాటేమి? వారు పనులు చెయ్యడం లేదా?

మ: ఆ ప్రశ్నించే ఆతడు జ్ఞానికాడని ప్రశ్నయే తెలుపుతున్నది. ఇంకొకరితో నీకేం జోలి? ఇతరులను వదలి, నీ విషయం నీవు చూచుకో.

భ: శ్రుతులు జ్ఞానిని పరముడుగా ఘోషిస్తాయి.

మ: నిజమే. అతడు పరముడే, నీవూ ఆత్మజ్ఞుడవుకా. వాని స్థితిని ఇప్పుడు వర్ణించినా, అది నీ శక్తి మేరకే అర్థమవుతుంది. నీ శక్తి పరిమితమని నీవూ ఒప్పుకుంటావు. శ్రుతుల ప్రకారం ఆత్మస్థితికి అవధులు లేవు. కాబట్టి ఆత్మజ్ఞుడర్థం కావటానికి, ఆ స్థితిని సాధించి అనుభవించాలి. ఆ వెనుక ఆ ప్రశ్న వస్తే సమాధానమూ దొరుకుతుంది.

ఇంకొకరు - ఉపదేశసారం మొదటి శ్లోకంలో చితడాలకు భేదం చెప్పి ఉన్నది.

మ: ఉపదేశం వినేవాని స్థితినిబట్టి, జడం సత్యం కాదు. ఒకే సంపూర్ణమైన చైతన్యం పూర్తిగా ఏకమై వ్యాపించి ఉంది.

## భాషణములు 446

శ్రీ గ్రాంట్స్ హాలులో ఉన్నారు. శ్రీభగవాన్ ఆశ్రమ ప్రచురణలలో క్రొత్త వాటిని పేర్కొనుచుండిరి. అందులో 'మహాయోగమొకటి. 'సద్దర్శన భాష్యము' చదివని గ్రాంట్ డఫ్క 'మహాయోగములోని భిన్న దృక్పథము ఆశ్చర్యం గొల్పవచ్చు. రెండు గ్రంథాలూ మహర్షి మతాన్నే ప్రతిపాదిస్తున్నా మంటాయి. కాని వాని అభిప్రాయాలలో తూర్పుపడమరల అంతరం. నిజం చెప్పితే 'మహాయోగము! మొదటి గ్రంథానికి పూర్తిగ ఖండనము.

భక్తులలో ఒకరు, సద్దర్శన భాష్యంలో, అహంకార నష్టానికి తర్వాత గూడ, వ్యక్తిత్వం మిగిలే ఉంటుందన్నది ఉదహరించారు. శ్రీ భగవాన్ ఇలా వ్యాఖ్యానించారు.

మ: ఏమి చేయడం? ఉపనిషత్తులంటాయి "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి"యని, అంటే బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మమే అగును. "ఏక కాలంలో అనేకులు బ్రహ్మవిదులుంటారు. వారందరూ ఏకమేనా, వేర్వేరు కారా?' అని కొందరడుగుతారు. వానికి దేహాలే కనబడతాయి. కాని, ఆత్మజ్ఞత కానరాదు. బ్రహ్మవిదుల ఆత్మజ్ఞానంలో తేడాఏమి? నిజమది. వాని దేహాన్ని ఊహించి ఈ ప్రశ్న అయితే సమాధానం, 'అవును, వారు వేర్వేరే' అనవలసి వస్తుంది. ఈ అవ్యవస్థకు కారణమది.

గ్రాంట్స్: బౌద్ధులు ప్రపంచాన్ని నిరాకరిస్తారు. హిందూ వేదాంతం జగత్తు నంగీకరిస్తూ, అది మిథ్య అంటుంది. నేనన్నది సరియేనా?

మ: దృష్టి కోణములలోని భేదాన్ని బట్టి దృక్పథము యొక్క భేదము వుంటుంది.

భ: జగత్తును శక్తి సృజించిందంటారు. జగము మిథ్య అను జ్ఞానం మాయావరణం తొలగినందు వలనా?

మ: జగత్తును శక్తిసృష్టిగా అందరూ అంగీకరిస్తారు. ఆ శక్తి స్వభావమేమి? అది సృష్టి స్వభావాన్ని సమర్థించేదిగనే ఉండాలి. సృష్టి కర్త స్వభావము సృష్టి స్వభావ సదృశమే కావల్సిందే.

భ: మాయలో తరతమాలున్నవా?

మ: మాయయే ఒక మాయ. మాయను దాని కవ్వలివాడే చూడగలడు. ఆ సాక్షి మాయకు లోబడ వీలులేదు. అతడు తరతమాల గురించి ఎట్లు మాట్లాడగలడు. సినీతెరపై తేలిపోతూ ఎన్నో దృశ్యాలు కన్పిస్తాయి. అగ్ని ఎన్ని సౌధాలనో కాల్చి బూడిద చేస్తుంది. అయినా ఈ చిత్రాలన్నీ ప్రసరితమౌతున్న ఆ తెర కొంచెమైనా కాలదేం? తెర యథార్థం చిత్రాలు నిజం కాదు కనుక.

అద్దంలో ప్రతిబింబాలెన్నో కదలిపోతాయి. కాని వాని గుణగణాల వల్ల అద్దం బాధితం కాదు.

అదే రీతిగా, జగత్తు ఏకైక సత్యం పైని ఆరోపం, ఆ సత్యం దేని చేతనూ బాధితం కాదు, సత్యం ఒకే ఒకటి.

మాయపై చర్చ దృక్ భేదాలవల్ల వచ్చింది. ఆ దృష్టి కోణం జ్ఞానం దెసగా మారితే, అప్పుడు ప్రపంచం బ్రహ్మముగనే గోచరిస్తుంది. ఇప్పుడు జగత్తులో ఉన్నావు. అందువల్ల జగత్తు నున్నట్లే చూస్తావు. దాని నధిగమించు; అది అదృశ్యమై ఏకైక సత్యం ప్రకాశిస్తుంది.

## భాషణములు 447

శ్రీ నమశ్శివాయ యోగి పూర్వం కొండపై నివసిస్తుండినారు. వారు ఆరోజుల్లో చాల కష్టాలు పడవలసి వచ్చిందంటూ భగవాన్, ఆయన గీతాన్నొకటి వల్లించారు. -- ఎన్నో దురవస్థలలో చిక్కించి భక్తుని దైవం కఠినంగా పరీక్షిస్తాడు. చాకలి గుడ్డలను రాతిపై బాదడం, వానిని చింపుటకు కాదు, మురికి తీసివేయడానికి.

## భాషణములు 448

యోగి నామదేవుల ప్రకారం దివ్యనామతత్త్వము

1. దివ్యనామం విశ్వనిబిడంగా వ్యాపించియుంది. అధోలోకాల్లో ఏఅంతరానికో పోయిందో, ఊర్ధ్వలోకాల్లో ఏ అంతస్థుకు ఎగిసిందో ఎవరు చెప్పగలరు.

పుట్టుకలు 84 లక్షల విధాలు. తత్త్వసారము తెలియని మూఢులు పై అన్ని రకముల జన్మలూ పొందుతూనే ఉంటారు. నామము అమరము. రూపాలు అగణితాలైనా, అన్నీ ఆ నామమే.

2. నామమే రూపము. రూపమే నామము. నామ రూపములకు వ్యత్యాసం లేదు. దైవము ప్రత్యక్షముగ అవతరించి నామరూపములను దాల్చినాడు. శ్రుతి విహితమూ నామమే. నామమునకు మించి వేరు మంత్రం లేదు. ఇది కాదన్నవారు మూఢులు. నామము స్వయముగా కేశవుడే. ప్రభునెడల భక్తి ప్రేమలు గలవారికే ఇది తెలుస్తుంది.

3. సర్వవ్యాపకమైన నామమును, వ్యక్తి తన 'నేను'ను గుర్తించి నప్పుడు మాత్రమే తెలిసికోగలడు. తన నామమే తెలియనివాడు సర్వవ్యాపియైన ఆ నామము నెట్లు గుర్తించును? తన్ను తాను తెలిసికొనిన వాడు ఆ నామము నెల్లెడలా చూడగలడు. నామమును, ఆ నామమున్న వానిని వేరనుకోవటం భ్రమ కల్గిస్తుంది. యోగులనడిగి చూడమన్నాడు నామదేవుడు.

4. జప, ధ్యాన, తపస్సులవల్ల ఎవరూ "నామము"ను అనుభవగోచరం చేసుకోలేరు. మొట్టమొదట గురుపాదములే శరణ్యములని స్వార్పణచేసి నీలోని "నేను" ఎవరో తెలిసికొనడాన్ని అభ్యసించు. ఆ 'నేనెక్కడినుండియో తెలిసికొని ఆ ఏకంలో నీ వ్యక్తిత్వాన్ని లయంచేయి. ఆ ఏకము, ఆత్మస్థితము, అద్వితీయము,

ద్వైతా ద్వైతముల నధిగమించునది. ముల్లోకముల నిండియుండినది ఆ నామమే. నామము కేవలము పరబ్రహ్మమే. అచట ద్వైతము వలన క్రియా ప్రవృత్తి కలుగదు.

శ్రీ భగవానులు చదివినంతలో ఒక గాయకుడు హాలులోనికి వచ్చి, త్యాగరాజ కీర్తనలను తెలుగులో పాడనారంభించాడు. అందులో నొకటి -- ముత్యములకై సముద్ర మడుగునకు మునుగువానివలె, లోతులు దిగి మూలా ధార శబ్దమును కనుక్కో

మరొకపాటలో - "మనస్సును నియమించినవానికి తపస్సుతో పనేమి? తనువు తానను బుద్ధి విడిచి, ఉన్నది నేను కాదు, సర్వమూ నీవేయని తెలుసుకో."

ఈ పాటను హాలులోనున్న గ్రాంటఫ్కు అనువదించి విన్పించినారు. గ్రాంట్ఫ్: శ్వాసనిరోధ మవసరమా? శ్వాసనియమన మభ్యసించని వాని గతేమి?

మ: హృదయంలో లోతుల మునుగుటకు శ్వాసనిరోధము సాయపడుతుంది, అంతే. మనో నిగ్రహంవల్ల గూడ అట్లు చేయవచ్చు. మనస్సును నియమిస్తే శ్వాస తనంతతాను నియతమౌతుంది. శ్వాసనిరోధము అవసరం కాదు. మనోనిగ్రహం చాలు. సూటిగా మనస్సునే నియమించలేనివాడు శ్వాసనియమనంతో మొదలు పెడతాడు.

నాహం - నేనిది కాదు - రేచకము

కోహం - నే నెవరు - పూరకము (ఆత్మవిచారం)

సోహం - అతడే నేను - కుంభకము (ఆత్మయే)

ఇవి ప్రాణాయామ విధులు. ఆ మూడు సూత్రాలు

న + అహం = (కాని - నేను)

క + అహం = (ఎవరు - నేను)

స + అహం = (అతడు - నేను)

ఉపసర్గలు వదలి, ఆ మూటికీ సమానమైనదాన్ని ఎన్నుకో. అదే అహం (నేను). సర్వసారము అదే.

ఆ తరువాత భగవాన్ పాటను ప్రస్తావించారు. త్యాగరాజు చక్కగా అన్నారు. మనస్సును నిలుపాలి. మనస్సేమి? అని ప్రశ్న. దానికి ఆయనే ఆ తరువాతి పదంలో సమాధానమిచ్చారు. అది దేహమనే భావన. మనస్సును నిలిపే దెట్లు? అంటే ఆయనే అన్నారు - 'పూర్ణశరణాగతి వల్ల'యని. 'నేను లేనని ఎరుగు. సర్వమాతడే.' చక్కని పాట, చిక్కని కూర్పు. ఆయనే శ్వాస నిరోధపద్ధతిని గూడ చెప్పి ఉన్నారు.

## భాషణములు 449

గ్రాంట్స్ వెళ్ళిన తర్వాత అతని ఆశ్రమ సందర్శనం మాట వచ్చింది. శ్రీభగవాన్ అన్నారు - "ఏదో శక్తి ప్రపంచం అన్ని మూలల నుండి ప్రజల నిక్కడికి ఆకర్షిస్తున్నది". ఒక భక్తుడు అతికినట్లు పలికాడు, 'ఆ శక్తి శ్రీభగవానక్కు వేరుకాదు'. తక్షణమే శ్రీ భగవాన్ 'మొదట నన్నిక్కడికి లాగిన ఆ శక్తి మాటేమి? ఆ శక్తియే అందరినీ ఇక్కడకి ఆకర్షిస్తోంది' అన్నారు.

ఆనందంగా కూర్చుని శ్రీభగవాన్ కొన్ని కథలు చెప్పారు.

1. ఒక రాజు. ఆయన భార్య చాలా పతి భక్తి గలది. ఆమెకు రాముడంటే భక్తి. తనవలెనే భర్తకూడ రామభక్తుడైతే బాగుండునని ఎంతో ఆశ పడేది. ఒక రాత్రి నిద్రలో భర్త ఏదో గొణుగుతున్నట్లు గమనించింది. ఆయన పెదవులవద్ద చెవినుంచి జాగ్రత్తగా వింటే తీగసాగేట్లు రామనామ జపం! ఆమెకెంతో సంతోషమయింది. తెల్లవారగానే మంత్రిని పిలిచి విందు ఏర్పాటు చేయించింది. విందారగించిన పిదప రాజు విందుచేశావే; విశేషమేమి అని అడిగాడు. ఆమె విషయమంతా తెలిపి, తన చిరకాల వాంఛితం ఫలింపచేసినందుకు, దైవానికి కృతజ్ఞత తెలుపడానికన్నది. తన భక్తి బయటపడి పోయిందని రాజు చాల బాధ పడ్డాడు. దైవభక్తి నల్గురికీ తెలిసిపోవడం వలన తాను భగవంతునికి తగని వాడనని భావించి ఆ వ్యధతో రాజు ఆత్మహత్య చేసుకున్నాడని కొందరంటారు. ఎవ్వరూ తన భక్తిని చాటరాదని తాత్పర్యము. రాజామెతో ఆ మాటనే చెప్పాడని ఆపైన వారు ఇరువురూ సుఖముగా ఉన్నారని మన మనుకోవచ్చు నన్నారు భగవాన్.

2. తొండరడిప్పొడి (భక్తాంఘ్రిరేణు) ఆళ్వార్: భక్తుల పాదరేణులతో ఆనందించేవాడు. ఆయనకొక చిన్న పొలం. దానిలో తులసి మొక్కలను పెంచి, దళాలతో మాలలు గ్రుచ్చి గుడిలో దేవుని కర్పిస్తూండేవాడు. ఆయన బ్రహ్మచారిగనే

ఉండిపోయాడు. ఒకనాడు అక్క చెల్లెండ్రు ఇరువురు అటువైపు వచ్చి దగ్గరలో ఉన్న చెట్టుక్రింద కూర్చున్నారు. వారిది పడుపువృత్తి. అందులో ఒకతె, అక్క అనుకుందాం, అన్నది "రోజు తిరక్కుండా నా శరీరాన్ని మనస్సునూ మలినపరచుకొంటున్న నా ఈ జీవితం నా కసహ్యంగా ఉంది. ఈయన్ను చూడు, ఈ జీవితం ఎంత బావుందో!", చెల్లెలు ఆక్షేపించింది - 'ఆయన మనస్సు నీకేం తెలుసు? ఇంతకూ పైకి కనుపించేటంత మంచివాడు కాడేమో, శరీర చేష్టలను బలవంతంగా అణచవచ్చు. మనస్సులో వాంఛలు విజృంభిస్తూ ఉండనూవచ్చు.

వాసనలణచడం, భౌతిక శరీరాన్ని కట్టేటంత సులభం కాదు." అక్క: చేష్టలు మనస్సును తెలుపవా? ఆ జీవితం చూస్తే ఆయన మనస్సెంత శుద్ధమో తెలియలేదా?

చెల్లెలు: 'అట్లు తప్పనిసరిగా ఉండక్కరలేదు. అతని మనస్సును పరీక్షించి చూశావా ఏం?"

నీవే పరీక్షించి చూడుమని అక్క పందెం కట్టింది.

చెల్లెలంతట తనవద్ద తక్కువగా మాత్రం వస్త్రాలు వదిలివెళ్ళమన్నది. అట్లే చేసి అక్క ఇంటికి వెళ్ళిపోయింది. చెల్లె ఒంటిగా అట్లే ఆ చెట్టుక్రింద కూర్చునే ఉంది. పైకి ఆమె ఎంతో సహనం వినయం ఉట్టిపడేట్టుగా ఉంది. యతి ఆమెను చూసాడు. కొంతసేపయ్యాక సమీపించి ఆమె పైనమడిగాడు. "అంతగా క్రుంగియున్నావే. ఏం జరిగిం"దని ప్రశ్నించాడు. బదులుగా ఆమె "నేను పూర్వమెంతో పాపపు బ్రతుకు బ్రతికాను. ఇప్పుడు పరితపిస్తున్నాను. నిష్కల్మషమూ, ఉదాత్తమూ అయిన జీవితం నాకు దక్కగల్గునా అని తహతహలాడుతున్నాను. దయతో తామంగీకరిస్తే తమకో, లేదా ఈ తోటలోనో స్వల్ప సేవ చేసుకుంటూ శేష జీవితం వెళ్ళదోస్తా'నని ప్రాధేయపడింది. ఇంటికి తిరిగివెళ్ళి మామూలు జీవితం గడపమని యతి సలహా ఇచ్చాడు. ఆమె ఇష్టపడలేదు. అట్లే అయితే ఈ తులసి మొక్కలను తడపుతూ ఉండుమని ఆమెను తన వద్దనే ఉండమన్నాడు. ఒక రాత్రి జోరుగా వర్షం పడుతున్నది. యతి కుటీరం చూరుక్రింద ఆమె నిలుచునియుంది. వస్త్రం నీరోడుతున్నది. చలికి ఆమె గజగజలాడుతున్నది. ఎందుకంత దీనస్థితిలో నిలిచావని యతి ప్రశ్నించాడు. "మరేం చేసేది? నా కుటీరాన్ని నీరు ముంచెత్తింది. అంచేత ఈ చూరుమాటున తలదాచుకున్నాను. వర్షం వెలియగానే వెళ్ళిపోతాను" అని ఆమె బదులిచ్చింది. ఆమెను లోనికి రమ్మని తడిసిన వస్త్రం మార్చుకొమ్మన్నాడు యతి. కాని పొడిగా వేరు చీర ఉంటేగదా? మరేం చెయ్యడం? ఆయన తన ధోవతుల్లో నొకటి ఆమె కిచ్చాడు. ఆమె దాన్ని కట్టుకొని, ఆయన పాదాలు పిసకడానికి అనుమతి అడిగింది. ఆయన సరే నన్నాడు. ఫలితంగా వారు కౌగిలించుకొన్నారు.

మరురోజు ఆమె ఇంటికి వెళ్ళి సుఖభోజనం చేసి, మంచి బట్టలు ధరించింది. తోటలో పని మానక సాగిస్తూనే ఉంది.

ఒక్కొక్కమారు తోటకు పోక తన ఇంటిలోనే చాలసేపుండిపోయేది. ఎదురు చూసి ఆళ్వార్ తానే ఆమె ఇంటికి వెళ్ళేవాడు. క్రమంగా ఆమె ఇంట్లోనే ఆమెతో నివసింపసాగాడు. అప్పటికీ అతడు తులసి తోటను గాని, తులసి మాలలను దైవాని కర్పించడం గాని మానలేదు. యతిలోని ఈ మార్పునకు ప్రజలు రోతపడ్డారు. చివరకు దైవమే అతన్ని మునుపటి జీవితానికి మళ్ళించనెంచి,

భక్తిశ్రద్ధలు గల శిష్య యతిరూపం దాల్చి ఆ వేశ్య ఇంటికి వెళ్ళాడు. రహస్యంగా అమూల్యమైన దేవుని నూపురం ఆమెకు కాన్కగా ఇచ్చాడు. ఆమె ఎంతో సంతోషించి, దానిని పడకలో దిండుక్రింద దాచింది. శిష్యుడు మరి కనబడలేదు. ఇదంతా ఆ వేశ్య యొక్క పరిచారిక గమనిస్తూనే ఉంది.

గుడిలో నగ కనిపించలేదు. ఆ విషయం అధికారులకు అర్చకులు విన్నవించారు. పోయిన నగ ఆచూకీ తెల్పినవారికి పెద్ద బహుమానం ఆశ చూపారు. దానికై ఆ పరిచారిక ఉన్న విషయం తెల్పి బహుమానం పొందింది. నగను దొరికించుకొని రాజోద్యోగులు ఆ వేశ్యను బంధించారు. తనకేం తెలియదని నగను తనగా యతి ఇచ్చినాడని ఆమె మొరలిడింది. వారు ఆ యతిని పట్టి హింసించారు. అప్పుడు అశరీరవాణి వినవచ్చింది. "అది నేనే చేశాను. ఆయన్ను వదలండి" అని,

రాజుతో సహా అందరూ ఆశ్చర్యపడ్డారు. వారా యతికి సాగిలబడి మ్రొక్కి ఆయన్ను విడిచివేశారు. యతి మళ్ళీ ఋజువూ సాత్త్వికమూ అయిన జీవితం గడిపాడు.

3. కాడువేలి సిద్ధర్: దృఢదీక్షగల యతిగా పేరొందినవాడు. రాలిన ఆకులే ఆహారంగా జీవించేవాడు. ఆ దేశపు రాజు ఆయన్ను గూర్చి ఆయన మహత్మ్యము నిరూపించే వారికి బహుమానం ప్రకటించాడు. ధనికురాలైన ఒక దాసి అందుకు పూనుకుంది. ఆయన్ను సేవిస్తున్నట్లుగా నటించేది. ఆయన ఏరుకున్న ఆకుల్లో రహస్యంగా అప్పడం తునకలను దూర్చేది. వానిని ఆయన ఆరగించేవాడు. క్రమంగా అప్పడం ముక్కలస్థానే, రుచికర పదార్థాలు చోటుచేసుకోవడం మొదలయింది. కొన్నాళ్ళకు ఆమె చేకూర్చే స్వాదుపదార్థాల కలవాటు పడ్డాడు. వారిద్దరికీ జోడు కలిసింది. ఒక బిడ్డ పుట్టాడు. ఆమె ఈ వార్తను సవిస్తరంగా రాజు కందచేసింది.

వారి సంపర్కాన్ని ప్రజాబాహుళ్యానికి నమ్మ చూపమని రాజు ఆమెను ఆదేశించాడు. సరేనని ఆమె ఒక కార్యపద్ధతిని సూచించింది. ఆ మేరకు రాజామె నృత్య ప్రదర్శన మొకటి సమావేశ పరిచాడు. ప్రజలందరూ గుమిగూడారు. ఆమె వచ్చింది. కాని రాకముందు బిడ్డకు ఏదో మందు ఇచ్చి, ఆ యతి సంరక్షణలో బిడ్డను వదలి వచ్చింది.

నృత్యం మంచి పరాకాష్టలో ఉంది. అక్కడ ఇంట్లో బిడ్డ తల్లి కొరకు ఏడుస్తున్నది. బిడ్డనెత్తుకొని తండ్రి నృత్యప్రదేశానికి వచ్చాడు. ఆమె మహా ఉల్లాసంగా నృత్యం చేస్తున్నది. బిడ్డతో ఆమెను సమీపించేదెట్లు? అతన్నీ బిడ్డనూ ఆమె చూసింది. నృత్యం చేస్తూనే ఆమె వారిని సమీపించి ఒక పాద భంగిమలో తన పాదనూపురం యతి దగ్గర పడేట్లు చేసింది. ఆమె సవిలాసంగ ఎత్తిన కాలికి ఆ యతి అందెను తొడిగాడు. జనం చప్పట్లు చరిచి గేలిగా నవ్వసాగారు. కాని ఆయన తన మహిమాద్యోతకంగా ఒక తమిళ గేయాన్ని పాడాడు --

"విజయానికై క్రోధం పోవుగాక! పరువిడ నెంచితే మనస్సును స్వేచ్ఛగా వదలివేస్తాను; నా ఎరుక నిల్పుకుంటూనే రాత్రింబవళ్ళూ నేను నిద్రించడం నిజమేయైతే ఈ గండశిల రెండుగా బ్రద్దలై విస్తారమైన ఆకాశమగుగాక!"

తక్షణమే ఆ శిల పెద్ద చప్పుడుతో బ్రద్దలైపోయింది. జనులు ఆశ్చర్య స్తంభితులైరి.

ఈ కథ చెప్పి శ్రీభగవాన్ అన్నారు -- ఆ విధంగా కాడువేలిసిద్ధర్ అచంచల జ్ఞానిగా సుప్రతిష్ఠితుడైనాడు. జ్ఞానివిషయంలో పై చూపులకు మోసపోరాదంటుంది వేదాంత చూడామణి. (5:181)

ఈ కథ తాత్పర్యమిట్లు - ప్రారబ్ధంవల్ల దేహంతో కూడి ఉన్నప్పటికీ జీవన్ముక్తుడు, ఇతరుల దృష్టిలో అజ్ఞానంలో మునిగియున్నా, వివేకిగా వెలిగినా అతడెప్పుడూ ఆకాశంవలె నిర్మలుడే. వాయువేగం వల్ల మబ్బులు దట్టంగా అలమినా, చెదరినా, ఆకాశం మలినం కాదు. ప్రారబ్ధం వల్ల తనకెన్ని సిరిసంపదలు సంక్రమించినా పతితోనే లోకమైన ప్రియభార్యవలె జ్ఞాని సదా ఆత్మైక రాముడు. విద్యాగంధమే లేనివానివలె అతడు మూగగా వుండవచ్చు; తాత్పర్యం యథార్థంగా అద్వైతమైనా, శ్రుతుల వైఖరీ వాక్కు ద్వైతముతో కూడి వుంటే కూడా అతడు ఉదాసీనుడై వుండవచ్చు. పరబ్రహ్మానుభూతిని బాగా ప్రకటించేందుకు మౌనాన్ని మించి వేరొకటి ఉన్నదా? జ్ఞాని శిష్యుల కుపదేశించవచ్చు; కాని తాను గురువునని అనుకోడు. గురువూ శిష్యుడూ అన్న మర్యాద మాయాజనితమని అతడికి స్పష్టమే. అతడాకాశ వాణివలె పలుకుతూనే ఉంటాడు; ఒక్కొక్కవేళ పొందు పొలికా లేక వెర్రిగా గొణుగుతున్నా వాని వాక్కులు బిగి కౌగిలిలోని ప్రేమికుల పలుకులవలె అనుభూతిని తెలుపజాలనివిగా ఉంటాయి. వేరొకవేళ వచోవిదగ్ధుని ఉపన్యాసంలోవలె వాని వాక్కుధారా ప్రవాహంగా ఉంటే, అవి వాని యనుభవాన్ని స్మృతికి దెచ్చుకుంటూన్న విధంగా వుంటాయి. అతనికి ఇకపై తీరవలసిన కోర్కెలు లేవు. అతడేకైక మాత్రుడు, అద్వితీయుడు, అచలుడు. తమ ప్రీతిభాజనుల గోల్పోయిన వారివలె, అతడు దుఃఖవ్యగ్రుడుగా కనుపించవచ్చు. కాని, వివరము తెలియనివాడు. తాను నిగ్రహించిన ఇంద్రియములు గూడ పరమాత్మ పరికల్పించిన పరికరములే యని వానియెడల తగుమాత్రం ప్రీతిసానుభూతుల చూపుతున్నట్లు ఉండవచ్చు. జగత్తులోని అద్భుతము లెడల చాల కుతూహలిగా తోచినచో, నిజంగా అతడు అధ్యారోపితమైన అజ్ఞానము నెడల నిరసనం దెల్పుతూ ఉండవచ్చు. ఒకప్పుడు అతడు కామవాంఛలను తీర్చుకొంటున్నట్లు కనిపిస్తే, అది ఎప్పుడూ ఉండే ఆత్మానందాన్ని అనుభవిస్తున్నట్లు గ్రహించాలి. ఆ ఆత్మ, జీవాత్మగా పరమాత్మగా రెండుగా, జీవేశ్వరులుగా విభక్తమై,

నిజస్వభావాన్ని మరల పొందడానికై వాని ఐక్యానుసంధానంలో అతడు ఆనందించునట్లు గ్రహించాలి. అతడు క్రుద్ధుడైతే అది విపక్షులకు శుభంకరము. అతని చేతలను, మానవతా స్థాయిలో దైవఘటనలనుగా గ్రహించాలి. అతని జీవన్ముక్తతను లవలేశమూ అనుమానించరాదు. అతను జీవించియుంటే, అది ప్రపంచ కల్యాణానికే.

పైకి కనుపించే ప్రవర్తనకై జ్ఞానిని ఎప్పుడూ అవజ్ఞ చేయరాదని హెచ్చరిస్తూ భగవాన్ పరీక్షితు కథను ఉదహరించారు. అతడు పుట్టింది మృతశిశువుగా, విలపించే స్త్రీలు అతన్ని రక్షించమని శ్రీకృష్ణుని అర్థించారు. అశ్వత్థామ ప్రయోగించిన అపాండవ అస్త్రము ఫలితం నుండి ఆ శిశువును కృష్ణులెట్లు రక్షింపగలరాయని ఋషులు విస్మయావిష్ణులయ్యారు. నిత్య బ్రహ్మచారి తాకితే శిశువు బ్రతుకుతాడని శ్రీ కృష్ణులు ప్రకటించారు. శుకుడే బిడ్డను తాక సందేహించాడు. "నేను నిత్యబ్రహ్మచారిని అయినచో శిశువు జీవించుగాక" అంటూ శ్రీ కృష్ణులే ఆ బిడ్డను తాకారు. మెల్లిగా బిడ్డ ఊపిరి తీయనారంభించాడు. పరీక్షిత్తే ఆ బిడ్డ.

16,000 గోపికలు ప్రేమించి సేవించుకొనే శ్రీకృష్ణుడు నిత్యబ్రహ్మచారి ఎట్లో ఊహించండి. జీవన్ముక్త రహస్యమట్టిది. దేనినిగాని ఆత్మకు అన్యంగా నెంచనివాడే జీవన్ముక్తుడు.

కాని ఎవరైనా సిద్ధులను కోరి ప్రదర్శించబోతే వానికి దొరకేవి తన్నులే.

## భాషణములు 450

ఒక పోలిష్ వనిత హిందూమతం పుచ్చుకొని ఉమాదేవి అన్న పేరు పెట్టుకుంది.

ఆమె శ్రీ భగవాన్ ను అడిగింది:

భ: హిందువుగా మారే రోజుల్లో నేను మానసికంగా శివుని చూసానని శ్రీ భగవాన్కు పూర్వమే తెలిపాను. కుట్రాలంలో గూడ అట్టి అనుభవం కలిగింది. ఈ అలౌకిక దృశ్యాలు తాత్కాలికాలే అయినా, అవి ఆనందం కల్గించాయి. వానిని నిరతములూ నిత్యములుగా ఎట్లు చేయుటో తెలియగోరుతున్నాను. శివుడు లేక, నా చుట్టూరా ఉన్నది నిర్జీవంగా తోస్తున్నది. శివుని తలిస్తే నా కెంతో హాయిగా ఉంది. కృపజూపి నాకు ఆయన దర్శనం శాశ్వతంగా కలిగే ఉపాయం చెప్పండి.

మహర్షి: మానసికంగా శివుని చూచానన్నావు (vision of Shiva) చూడటానికి ఒక విషయం ఉండాలి. దానితోనే కర్తగూడ ఉండవలెనని వేరే చెప్పనక్కరలేదు. గదా. దృశ్యము విలువ ద్రష్టవిలువ సమమే. (అంటే ఇర్వురి స్వభావమూ ఒకే స్థాయిలోనిది. ) కనిపించడం జరిగింది అంటే మాయమవడం కూడా జరుగుతుంది. అందుచేత దృశ్యము శాశ్వతము కాజాలదు. కాని శివుడు శాశ్వతుడు గదా. శివసాక్షాత్కారమయిందంటే అతన్ని చూడడానికి కళ్ళు ఉన్నాయని సూచిస్తుంది. చూపు వెనుక బుద్ధి - బుద్ధి చూపుల వెను ద్రష్ట; వాని వెనుక అతనికి ఆధారభూతమైన చైతన్యము. ఈ సాక్షాత్కారము అందరనుకొనేటంత యథార్థం కాదు. అది స్వయం వేద్యం (ఫస్ట్ హాండ్)గాదు; చైతన్యంలో ఎన్నో దశలు. అంతర్దశలూ గడచిన పిదప కలిగే ఫలితమిది. వీటన్నింటిలోనూ మార్పులేనిది చైతన్యమొక్కటే. అది నిత్యము; అదే శివుడు; ఆత్మయదే.

దృశ్యము (vision) చూసేవాడిని సూచిస్తుంది. ద్రష్ట తన ఉనికిని కాదనలేడు. చైతన్యంగా ఆత్మ ఉండని క్షణం లేదు. అలాగే ద్రష్ట చైతన్యానికి భిన్నంగా ఉండలేడు. చైతన్యము ఏకము, నిత్యము. ద్రష్ట తన్ను తానై చూచుకోలేడు. అందుకే తనను తాను ప్రత్యక్షంగా చూడలేనందువలన తాను లేననడుగదా? కాబట్టి ప్రత్యక్షమంటే చూడటం గాదు, ఉండటం.

ఉనికి అంటే ఆత్మస్థితి. కాబట్టియే, 'నేనదే నేను' (అయామ్ దట్ అయామ్). ఆ ఉన్న 'నేను' శివుడు. అతడు లేక ఇతరమేమీ ఉండజాలదు. సర్వమును శివునిలోనే, శివుని వల్లనే.

అందువల్ల "నేను ఎవరు?" అని విచారించు. లోనిగి లోతుగపోయి, ఆత్మ ప్రతిష్ఠితుడవుకా. సంస్థితిగా, ఉనికిగా అది శివుడు. అతని దృశ్యాలకై మళ్ళీ మళ్ళీ ఎదురు చూడక. నీవు చూచే విషయాలకూ శివునికి భేదమేమి? అతడే కర్త, విషయమూ అతడే. శివుడు లేక నీవుండవు. శివానుభవము ఇప్పటి కిప్పుడే ఉంది. ఆ అనుభవము కలుగలేదనుకోవడం ఆ తప్పు నీది. అట్టి భావన శివానుభూతికి ఆటంకము. ఆ ఆలోచనే మానివెయ్యి. అనుభూతి ఉన్నది.

భ: అది సరే, కాని దాన్ని వీలయినంత త్వరగా సాధించుటెలాగ? మ: అనుభూతికిది ఒక అడ్డు. శివుడు లేక వ్యక్తి వుండునా? ఇప్పుడునూ ఆయనే నీవు. దీనిలో కాలం యొక్క ప్రసక్తే లేదు. అనుభూతి లేని క్షణమొకటుంటే, దాన్ని సాధించే ప్రశ్న. కాని అతడు లేక నీవు ఉండే పరిస్థితి లేదు. శివానుభవం అయ్యే ఉంది. ఎప్పుడూ అనుభవంలోనే ఉంది. అది లేకపోవడం ఎన్నడూ లేదు.

శివుని శరణుచెందు. ఆయన కనిపించినా, మాయమైనా సరే; ఆయన ఇచ్చకు తల ఒగ్గు. ఆయన సంతృప్తికై వేచియుండు. ఆయన నీవు కోరినట్లు చేయవలెననడం శరణాగతి కాదు. అది అతన్ని శాసించటమే. నీ ఆజ్ఞలను అతన్ని శిరసావహించమంటూనే, నీవు అతనికి శరణాగతి చేశాననుకోవటమా? ఏది మంచిదో ఏది ఎప్పుడెట్లు చేయవలెనో ఆయనకు తెలుసు. సర్వమూ సంపూర్ణంగా ఆయనకే వదలివేయి. ఆ భారం అతనిది. నీకేచింతా లేదు. నీ చింతలన్నీ ఆయనవే. శరణాగతి అంటే అది. అదే భక్తి.

మరో విధంగానూ ప్రయత్నించవచ్చు. ఈ ప్రశ్నలు ఎవరికి వస్తున్నవో విచారించు. హృదయంలో లోతులకు దిగి, ఆత్మగా నిలిచిపో. ఈ రెండు మార్గాల్లో ఏదే నొకదాన్ని ముముక్షువు అభ్యసించవచ్చును.

శ్రీభగవాన్ మరికొన్ని విశేషాలు ముచ్చటించారు. ప్రతివ్యక్తీ చైతన్యం ఉన్నవాడే; అంటే శివుడే. అతడు శివుడు కావటమే కాదు; అతనికి తెలిసినవీ తెలియనివీ అన్నీ కూడా అతడే. కాని అజ్ఞానవశుడై జగత్తును బహురూపమని తలపోస్తాడు. అతడు తన ఆత్మనే చూచియుంటే తనకూ ప్రపంచానికీ భేదమే తెలియదు. నిజానికి, వాని వ్యక్తిత్వమూ, అనేక రూపాలుగా వ్యక్తమయ్యే ఇతరములూ అన్నీ మాయమౌతాయి. శివునే ప్రపంచంగా చూస్తాడు. కాని ఆ చూసేవాడు ప్రపంచానికి అసలు ఆధారమేమో చూడడు. సాధారణంగా వస్త్రాన్నే చూస్తారుగాని, దానినిచ్చే ప్రత్తిని చూడరు. సినిమాలో కదలాడే ఛాయాచిత్రాలే చూస్తారు గాని వాని ఆధారమైన తెరను చూడరు. కాగితాన్ని చూడరు, దానిపై అక్షరాలనేగాని. కాబట్టి విషయము రూపచైతన్యముల కూడిక. సామాన్యుడు జగత్తులోని విషయాలనే చూస్తాడు. వాని ఆకృతుల్లోని శివుని చూడడు. మూలము శివుడు. అతడు తాల్చినవే ఇన్ని రూపాలూ, వానిని చూడగల్గిన చైతన్యమూను. అంటే కర్తకూ విషయానికీ, రెంటికీ ఆధారం శివుడు. శివుడు నిష్క్రియుడు, క్రియాపరుడుగూడ. శివుడు, శక్తి, ఈశ్వరుడు, జగత్తూ పేరేదైనా, అది చైతన్యము. ఆత్మస్థముగాని, క్రియాపరంగానీ, చేతనుడు కాని వాడు ఎవడైనా ఉంటాడా? మరి ఆత్మానుభవము లేకపోవుటేం? ఇంక అనుభవాన్ని శంకిస్తున్నవి, అనుభవం కోరేవి. ఈ ప్రశ్నలన్నీ ఎందుకు వస్తాయి? నేను నాకు ప్రత్యక్షం కాకుంటే అప్పుడు చెప్పవచ్చు శివుడు ప్రత్యక్షం కాలేదని.

ఈ ప్రశ్నలన్నీ రావటం, నిన్ను నీ దేహానికి పరిమితం చేసుకొన్నందువల్ల. అప్పుడే, బాహ్యమూ అంతరమూ, కర్తా విషయమూ అన్న భావాలు కలిగేది. విషయాలైన దృశ్యాలు (విజన్స్) అంతస్సారం లేనివి. అవి ఒకవేళ నిత్యాలైనా, తృప్తినీయవు. ఉమ, ఎల్లప్పుడూ శివునితో వుంటుంది. ఇరువురూ కలిసే, అర్ధనారీశ్వరత్వం, అట్లయిగూడ, ఆమె శివుని సత్యస్వరూపం తెలియగోరి తపస్సు చేసింది. ధ్యానంలో ఆమెకొక తేజస్సు కనిపించింది. ఆమె అనుకొంది - 'ఈ తేజం శివుడు కాదు. అది నా దృష్టిమేరలోనిది. అందువల్ల నేనే దానికి అతిశయం'. ఆమె తపస్సు సాగించింది. తలపులు అదృశ్యాలైనవి. నిశ్చలత వెలిసింది. అప్పుడామె తెలుసుకున్నది స్థితియే శివుడనీ, అదే ఆయన స్వభావమనీ.

మురుగనార్ అప్పర్ రచన ఒకదాన్ని ఉదాహరించారు "నా తమస్సు తొలగించి వెలుగీయడానికైనా నీ అనుగ్రహం నా మూలంగానే కదా ప్రవహించాలి?"

భగవాన్ మాణిక్యవాచకర్ వచనం చెప్పారు -- "మేమెన్నో భజనాదులను చేస్తాము. కాని నిన్ను చూచిన వానిని కనలేదు, వినలేదు." దైవాన్ని చూచిన తర్వాత వ్యక్తిత్వం నిలిచేదెలాగ? చూచేవాడూ, చూడబడినదీ, రెండూ ఏకమౌతాయి. జ్ఞాతా లేడు, జ్ఞానము లేదు. జ్ఞేయమూ లేదు. అందరూ పరమశివునియందే ఐక్యమొందుతారు.

## భాషణములు 451

మద్రాసు యూనివర్సిటీ ఫిలాసఫీ శాఖలో రీడరు, శ్రీ ఎస్. సూర్యనారాయణశాస్త్రి రాత్రి వచ్చిరి. వారికి ఒక సంశయము కలిగి, అది 'ఆత్మబోధ'కు లక్ష్మణశర్మగారి వ్యాఖ్య చదవగా తొలగిందట. ఆ సంశయమిది:

ప్రపంచం ఒక ఊహగాని, ఆలోచనగాని ఎట్లు కాగలదు? ఆలోచన మనఃప్రవృత్తి. మనస్సుకు స్థానం మెదడు. అది మానవుని కపాలంలోనిది. అతడు
విశ్వంలో అల్పాల్పమగు అంశం. అలా అయితే ఇంత విశ్వం వాని మెదడు పొరలలో ఒదగటం అసాధ్యమే.

దానికి భగవాన్ సమాధానం ఇలా చెప్పారు. -- నీవు చెప్పినట్టి అస్తిత్వాన్ని మనస్సుకు ఆరోపించినంత కాలం ఆ సంశయం తప్పదు. కాని మనస్సంటే ఏమో యోచించు. నిద్రనుండి లేచిన వానికి జగత్తు కనిపిస్తుంది. అది గూడ 'నేనన్న తలపు కల్గిన తర్వాతనే. తలపైకి లేస్తుంది. మనస్సు ప్రవృత్తమైందన్న మాట. జగత్తంటే దిగంతరాళంలో విరివిగా పరచుకొన్న విషయములు, వానిని అవగాహన చేసుకొనేది మనస్సు. ఆకాశాన్ని ఆకళించుకొన్న మనస్సు తానే ఆకాశం కాదా? ప్రదేశం, భూతాకాశం; మనస్సు, మానసాకాశం; అది చిదాకశంలోని అంశము. ఈ రీతిగా మనస్సు ఆకాశతత్త్వం. జ్ఞానతత్త్వపక్షంగా దానిని ఆధ్యాత్మికులు ఆకాశంగా గుర్తించారు. ఆపైన ప్రశ్నలోనిది విరోధాభాసమే అని తేలిపోతుంది. శుద్ధమనస్సు, ఆకాశం; రజస్తమోదశల్లో అది స్థూల విషయాదులుగా పనిచేస్తుంది. ఈ విధంగా సర్వవిశ్వమూ మనోకల్పితమే..

కలలు కనే వానిని చూడు. నిద్రా భంగం కలగకూడదని, వాడు గదిలో తలుపులు వేసుకొని పడుకుంటాడు. కళ్ళు మూసుకొని నిద్రిస్తాడు. కాని కలలో విశాల ప్రదేశాలు, వివిధ జనాలు, వారి బ్రతుకులూ, తనతోబాటు వారి పయనాలూ అన్నీ వానికి గోచరిస్తాయి. ఈ విపుల దృశ్యం గదిలోకి దూరివచ్చిందా? అంతా వాని మనస్సులో విప్పారింది. ఆ మనస్సు నిద్రిస్తున్న తనదా, కాక కలలోని వ్యక్తిదా? అది నిద్రిస్తున్న వానిదే. దాని చిన్నిపొరలలో అంత విస్తృతాకాశం ఎలా ఇమిడింది? విశ్వసర్వమూ కేవల సంకల్పమాత్రమనీ, లేక ఆలోచనల వరుసయనీ ప్రాయకంగా అంటారే, దానికి ఈ విధంగా అర్థం చెప్పుకోవాలి.

ఒకస్వామి: నాకు పన్ను నొప్పి ఉంది. అది ఒక ఆలోచన మాత్రమేనా?

మ: అవును.

భ: నొప్పి లేదని అనుకొని, నన్ను నేను ఎందుకు నయం చేసుకోలేను?

మ: మనస్సు ఇతర విషయాల్లో మగ్నమైనప్పుడు, ఆ నొప్పి తెలియదు. నిద్రించేప్పుడు కూడా అది తెలీదు.

భ: అయినా సరే నొప్పి ఉంది కదా.

ఆ కారణాన ప్రపంచం వ్యక్తికన్నా ఎక్కువ యథార్థం కాలేదు.

మ: ప్రపంచం సత్యమన్న నమ్మకం అంత ప్రగాఢం; సులభంగా పోగొట్టుకోలేం. ఆ కారణాన ప్రపంచం వ్యక్తి కన్నా ఎక్కువ యథార్థం కాలేదు.

భ: ఇప్పుడు చైనా జపానులకు యుద్ధం జరుగుతున్నది. అది కేవలం మనఃకల్పనే అయితే శ్రీ భగవాన్ తద్విరుద్ధం ఊహించి ఆ యుద్ధం నిలుపుతారా, నిలుపగలరా?

మ: ఆ పృచ్ఛకుని భగవాన్కూడా చైనా - జపాన్ యుద్ధంవలెనే కేవలం ఆలోచనే కదా! (నవ్వు)

## భాషణములు 452

ఒక పెద్ద ఉద్యోగి, శ్రీ ధర్, ఐ.సి.ఎస్. ఆయన భార్యా ఇర్వురూ యువకులు, సంస్కారపరులు, విద్యావంతులూ, వారిక్కడికి రాగానే జబ్బుపడ్డారు. ఆమె ధ్యానం నిశ్చలమయ్యే విధానం ఏదో తెలియగోరింది.

మ: ధ్యానం అంటే ఏమిటి? ధ్యానమంటే ఆలోచనలను తరిమివేయడం. ఇప్పటి కష్టాలన్నీ ఆలోచనవలవల్లనే. ఆ కష్టాలూ ఆలోచనలే. ఆలోచనలు వదలిపెట్టు; సుఖమదే, ధ్యానమన్నా అదే.

భ: ఆలోచనలను వదలేదెలా?

మ: ఆలోచనలు, ఆలోచించే వానికి, ఆలోచించేవాని ఆత్మగా నిలిచిపో. దానితో ఆలోచనలు ఆగిపోతాయి.

శ్రీ ధర్: బ్రహ్మము పూర్ణము. ఆయన సృజించట మెందుకు? మళ్ళీ తనలో చేరుకోడానికి అందర్నీ ఇంత బాధపెట్టడ మెందుకు?

మ: ఈ ప్రశ్నించే వ్యక్తి ఎక్కడివాడు? అతడూ ఈ ప్రపంచం లోనివాడే, సృష్టిలో భాగమే. సృష్టిబద్ధు డయినవాడు ఈ ప్రశ్నసెలా అడుగుతున్నాడు? సృష్టిని అధిగమిస్తే ఇట్టి ప్రశ్నలు కలుగునేమో, అప్పుడు చూడవచ్చు.

## భాషణములు 453

న్యూజిలాండ్ నుంచి శ్రీమతి హర్బ్, లండన్ నుండి శ్రీమతులు క్రెగ్, అలిసన్లు ఆశ్రమానికి వచ్చారు. అందులో నొకరు:

భ: ప్రపంచ శాంతికై ఏది ఉత్తమ మార్గం.

మ: ప్రపంచమేమి? శాంతి ఏమి? దానికి ప్రయత్నించే వారెవరు? ఆ ప్రపంచం నీ నిద్రలో లేదు, మేల్కొన్న పిదప దాన్ని నీ మనస్సు ప్రసరింప చేసింది. కాబట్టి అది కేవలం భావన, మరేమీ కాదు. శాంతియంటే, అలజడి లేకపోవడం, శుద్ధచైతన్యం నుంచి వచ్చిన అహంకారమే వ్యక్తి. వాని ఆలోచనలే ఈ అలజడికి కారణం.

శాంతి నెలకొల్పడం అంటే ఈ ఆలోచనల నుండి విడివడి శుద్ధచైతన్యంలో స్థిరపడటం. ఎవనికి వాడు శాంతుడైతే అంతటా శాంతియే.

భ: ఒక విషయంలో ఇది చెయ్యడం తప్పు అనుకొంటే, అటువంటి తప్పు ఇతరులు చెయ్యకుండా చూడాలా, వద్దా?

మ: సరియేమి? సరికానిదేమి? ఒకటి సరియని మరొకటి సరికాదని నిర్ణయించే ప్రమాణమేమైనా ఉందా? వ్యక్తుల స్వభావాల బట్టి, పరిసరాల బట్టి అభిప్రాయాలు భిన్నమౌతాయి. అవిగూడా భావనలే, మరేమీ కావు. వాని విషయంలో వ్యధ అక్కరలేదు. కాని ఆలోచనలను పోగొట్టుకో. నీవు సదా ధర్మంగా చరిస్తే, ప్రపంచంలోనూ ధర్మమే జయిస్తుంది.

భః ధ్యానించేప్పుడు దేన్ని తలచుకోవాలి.

మ: ధ్యానమంటే ఆలోచనలను తరిమివేయడం. ఒకటి వెనుక ఒకటిగా వస్తూన్న ఆలోచనలు నిన్ను కలచివేస్తాయి. ఏ ఒక్కదాన్నో అవలంబిస్తే మిగిలినవి పరిహరించడం మవుతుంది. నిరంతరం అభ్యసిస్తే ధ్యానం చేయగల మనోబలం లభిస్తుంది.

సాధకుని పరిణతి ప్రమాణాన్ని బట్టి ధ్యానం పేర్వేరు విధంగా ఉంటుంది. అర్హుడు సూటిగా ధ్యాతనే పట్టివేయవచ్చు; ధ్యాత తన మూలంలో లయిస్తాడు. అదే శుద్ధ చైతన్యం.

అంత పరిణతి లేనివాడు దైవంపై ధ్యానం నిలపాలి. క్రమంగా ఆ వ్యక్తే తగినంత శుద్ధుడై ధ్యాతను చిక్కించుకొని పరమాత్మలో మగ్నుడౌతాడు.

ఆ స్త్రీలకీ సమాధానం నచ్చలేదు. వారింకా విపులమైన వివరణం కావాలనన్నారు.

శ్రీ భగవాన్ అన్నారు - పరులలో తప్పులెన్నడం, తన తప్పు. ధర్మాధర్మ వివేచనే పాపమూలము. తన పాపం బాహిరంలో ప్రతిఫలిస్తుంది. అతడు అజ్ఞానవశుడై దాన్ని మరొకరికి ఆరోపిస్తాడు. అట్టి ధర్మాధర్మ వివేచన చేయబోని స్థితిని చేరుకోవడం ఉత్తమం, నిద్రలో నీవు ధర్మాన్ని చూస్తావా, అధర్మాన్ని చూస్తావా? జాగ్రదావస్థలోనూ నిద్రించు. చుట్టూ ఏం జరిగినా అంటకుండా ఆత్మలో స్థిరపడు.

నీ వెంతగా బోధించినా నీ శ్రోతలు మారబోయేది లేదు. నీవు ధర్మంలో వుండి మౌనం వహించు. నీ మాట చేతలకన్నా మౌనానికే బలం హెచ్చు. మౌనం ఇచ్ఛాశక్తిని పెంపొందిస్తుంది. అప్పుడు ఈ జగత్తు స్వర్గరాజ్య మవుతుంది, అది నీలోనే వుంది.

భ: ఎవరికి వారు ఏమీ చేయకపోతే ఈ ప్రపంచం ఎందుకుంది?

మ: ప్రపంచం! ఎక్కడ? తనను వెనక్కు తీసుకొని ఎక్కడికి వెళ్ళిపోతాడు. విమానంపై ఆకాశం దాటిపోవడమా? వెనక్కి తగ్గడం అంటే అదేనా?

నిజమిది, ప్రపంచమొక భావన మాత్రమే. నీవేమంటావు, నీవు ప్రపంచంలో వున్నావా, ప్రపంచం నీలో వుందా?

భ: ప్రపంచంలో నే నున్నాను. నేను దానిలోని యొక అంశం.

మ: అదే పొరపాటు. నీకు వేరుగా ప్రపంచం ఉంటే, అది వచ్చి నీతో తానున్నానంటుందా? లేదే. అది ఉన్నట్లు చూచేది నీవు. నీవు మేల్కొని ఉన్నప్పుడే దాన్ని చూస్తావు. నిద్రిస్తుండగా కాదు. నీకది వేరుగా ఉంటే అట్లని అది అనాలి. నిద్రలోనూ నీవు దాన్ని ఎరిగియుండాలి.

భ: నా జాగృతిలో నేను దాన్ని తెలుసుకున్నాను.

మ: నిన్ను ముందు తెలుసుకొని తర్వాత ప్రపంచాన్ని తెలుసుకున్నావా? లేదా ప్రపంచాన్ని ముందు తెలుసుకొని తర్వాత నిన్ను తెలుసుకున్నావా? లేదా రెండూ సమకాలంలో తెలుసుకున్నావా?

భ: ఏకకాలంలోనే అని అనాలి.

మ: నిన్ను నీవెరుగక ముందు నీవు ఉన్నావా, లేవా? అంతకు ముందూ, ప్రపంచాన్నెరుగక ముందూ నీవుంటూనే వున్నావని ఒప్పుకొంటావా?

భ: అవును.

మ: నీ వెప్పుడూ ఉంటే, ఆ ప్రపంచం నీ ఆత్మకు వేరైతే, అది నిద్రలో నీకేల తెలియలేదు ?

భ: నేను నన్ను మరియు ప్రపంచాన్ని గూడ తెలుసుకుంటాను.

మ: నిన్ను నీవు తెలుసుకున్నావన్నమాట. అయితే ఎవరు ఎవరికి తెలుసు? అచటి రెండు "నేను"లు ఉన్నాయా?

భ : లేదు

మ: ఎరుక (చైతన్యం) వచ్చిపోయేది అనుకోవడం తప్పు అని ఇప్పటికే నీరు అర్థమై ఉంటుంది. ఆత్మ. నిత్యచిత్ -- ఎప్పుడూ తెలిసియుండేది. ఆత్మ తన్ను ద్రష్టగా భావిస్తే అది విషయాలను చూస్తుంది. కర్త మరియు విషయాల సృజనమే జగత్ సృష్టి, శుద్ధచైతన్యంలోనిది కర్త విషయసృష్టి, సినీతెరపై బొమ్మలు కదలటం చూస్తావు. తదేకంగా చిత్రాలు చూచేప్పుడు నీవు తెరను గమనించవు. ప్రపంచం ఆ బొమ్మలు; తెర చైతన్యం. చైతన్యం శుద్ధమైనది. చైతన్యమే ఆత్మ. అది నిత్యము, అవికారమూ, కర్త మరియు విషయాలను వదులు. శుద్ధచైతన్యమొక్కటే మిగులుతుంది.

భ: పరబ్రహ్మమునకు ఆ తలపే లేకుంటే ఈశ్వరుడై ప్రపంచాన్నెందుకు సృజించాడు.

మ: బ్రహ్మము లేదా ఈశ్వరుడు నీకిలా చెప్పాడా? బ్రహ్మము ఈశ్వరుడైనాడనీ మొదలైనవి చెప్పేది నీవే. అది గూడ నీవు నిద్రలో అనవు. జాగృత్లోనే బ్రహ్మమూ, ఈశ్వరుడూ జగత్తు అంటూ మాట్లాడుతావు. ఆలోచనల కారణంగా జాగ్రదావస్థలో కర్త విషయములంటూ ద్వంద్వము భావిస్తావు. అంటే ఇవి నీ ఆలోచనల సృష్టి

భ: కాని గాఢనిద్రలో నాకు తెలియకున్నా, ప్రపంచం ఉందిగదా?

మ: ఉందనడానికి ఆధారం ఏంటి?

భ: ఇతరుల కది తెలుసు.

మ: నీ నిద్రలో వాళ్ళు వచ్చి చెప్పిరా? నీవు నిద్రిస్తూండగా ప్రపంచాన్ని చూచినారన్నావే, వాళ్ళ గురించి నీకు ఎప్పుడు తెలిసింది. మేల్కొనాకనా లేదా నిద్రలోనా?

భ: అది కాకపోయినా, దేవునికి ఎప్పుడూ తెలుసు.

మ: దైవం విషయం వదలిపేయి. నీ సంగతి చెప్పు. నీవు దైవాన్నెరుగవు. దైవం నీవెలా అనుకుంటే అలాగే. ఆయన నీకు వేరా? అన్ని ఆలోచనలకూ కారణమైన శుద్ధచైతన్యం ఆయన. నీవు ఆ చైతన్యం.

## భాషణములు 454

శ్రీమతి ధర్: పనుల్లో నిమగ్నమైనపుడు కూడా విచారమార్గ మభ్యసించమన్నారు శ్రీ భగవాన్. దాని తుదిఘట్టం ఆత్మానుభవం. దానివలన కుంభకం కావాలి. శ్వాస నిలిస్తే పని జరిగేదెట్లు? పని జరుపుతూ, శ్వాసను నిలిపేదెలాగ?

మహర్షి: సాధన, సాధ్యము -- వీని విషయంలో సందేహం. ఆ విచారించే దెవరు? సాధకుడు; సిద్ధుడు గాదు. విచారము అనగానే విచారించేవాడు. విచార్యమునకు తాను వేరనే భావిస్తాడు.

ఈ ద్వైతభావము పోనంతవరకూ అంటే వ్యక్తిత్వము పూర్తిగ తొలగి (విచారించువాడు, విచార్యము రెండూ ఏకమై) నిత్యమైన కేవలాత్మ స్థితియే ఆత్మయను అనుభవము కల్గేదాకా ఆ విచారము కొనసాగాలి.

యథార్థమేమంటే ఆత్మ నిరతమూ, అవిరళమూ అయిన ఎరుక (Awareness) ఆత్మ స్వరూపము ఎరుకయని కనుగొనటమే విచారోద్దేశ్యము. భేదభావన ఉన్నంతదాకా విచారము అభ్యసించాలి.

ఆత్మసిద్ధి పిదప విచారముతో పనిలేదు. అసలు ప్రశ్నయే రాదు. ఎరుక, తెలుస్తున్న దెవరికి అని ఎప్పుడైనా ప్రశ్నిస్తుందా? ఎరుక శుద్ధము, సవిరళము. విచారించేవానికి తన వ్యక్తిత్వము తెలిసే ఉంటుంది. విచారము వాని వ్యక్తి భావనకు అడ్డురాదు. అతని బయట వ్యవహారము ఆ ఎరుకను అడ్డుకోదు. బయట అనుకొన్న పనులే వ్యక్తి ఎరుకను అడ్డుకోనప్పుడు, ఇదంతా ఆత్మ కభిన్నమని తెలిసిన సాధనను ఎలా అడ్డుకోగలదు? ఆ ఎరుకకు వృత్తీ వ్యక్తీ అభిన్నులు. అది అవిరుద్ధము, ఏకము, అద్వితీయము.

## భాషణములు 455

శ్రీమతి ధర్: సృష్టిలో నేనూ ఒక భాగమే, అందుచేత పరతంత్రను. స్వతంత్ర నయ్యేదాకా ఈ సమస్యను పరిష్కరించలేను. అయినా భగవాన్ నడుగుతున్నాను. ఈ సమస్యకు మా కోసం వారే జవాబు చెప్పకూడదా?

మహర్షి: అవును. భగవానే చెప్తున్నారు - 'స్వతంత్రవుకా; నీ సమస్యను నీవుగా పరిష్కరించుకో. ఆ పని చేయవలసింది నీవే" మళ్ళీ ఈ ప్రశ్న అడగడానికి. ఇప్పుడు నువ్వు ఎక్కడ వున్నావు? ప్రపంచంలో నీవున్నావా, నీలో ప్రపంచం వుందా? నిద్రలో నీవు లేవని తప్పించుకోలేవు. ఉండీ, నిద్రలో ఈ ప్రపంచం గోచరించలేదని ఒప్పుకొంటావు. కాని మేల్కోగానే ప్రపంచాన్ని చూస్తావు. మరి ప్రపంచం ఉన్నదెక్కడ? నిస్సందేహంగా ప్రపంచం నీ ఆలోచనలోనే ఉంది. ఆలోచనలు నీవు ప్రసరింప చేసినవి. మొదట "నేను"పుట్టింది. ప్రపంచం ఆ తర్వాత పుట్టింది. ఆత్మలో జనించిన "నేను" జగత్తుకు కారణమయింది. "నేను" సృష్టిని పరిష్కరిస్తే జగత్సృష్టి రహస్యాన్ని పరిష్కరించవచ్చు. అందుకే నేను చెప్పేది, 'నిన్ను నీవు తెలుసుకో" అని.

తానెందుకున్నదో, తన సృష్టి ఎట్లో ఆ ప్రపంచం వచ్చి నిన్నడగదు; ఆ ప్రశ్నలు నీవి. తనకూ ప్రపంచానికీ గల సంబంధాన్ని పృచ్ఛకుడే నిశ్చయించాలి. ప్రపంచం వాని కల్పనే అని విధిగా ఒప్పుకోవలసి వస్తుంది. ఆ కల్పించిన తాను ఎవరు? అది తెలిసికొని ఆత్మను తెలిసికొమ్మను.

భౌతిక, ధర్మశాస్త్రాలలో దొరికే సమాధానాలకు సమన్వయం కుదరదు. వారి సిద్ధాంతాల్లోని భేదాలు చూస్తే, అలాంటి సమస్యలకు పరిష్కారాలు వెదకడం వృథా యనిపిస్తుంది. ఆ సమాధానాలు కేవలం బుద్ధి చాతుర్యం కల్పించేవేగాని సారవంతాలు గావు. కాని వారిలో దృష్టిభేదాలు అంగీకరిస్తే వారి సమాధానాలు వ్యక్తిగతంగా సరియైనవే. ఆత్మస్థితిలో సృజనలేదు. ప్రపంచం చూచేవాడు తన్ను చూడలేడు. ఆత్మను చూచిన వానికి జగత్తు లేదు. కనుక ఆత్మను చూడు; సృష్టియంటూ ఏదీ లేదని తెలుసుకో.

శ్రీమతి ధర్కు జబ్బు చేసింది. అంత దగ్గరగా వుండి కూడా హాలుకు పోలేక పోతనని చింతిస్తున్నది. అట్లని భగవాన్కు తెలియచేసారు. ఆయనన్నారు 'సరి అట్లనుకొన్నంత సేపూ ఆమె సన్నిధిలో ఉన్నట్లే. హాలులో వుండి మరేవో ఆలోచించే కన్న అది ఎంతో మేలు కదా?"

(సాధు సాంగత్యము)

## భాషణములు 456

ఒక అపాయము - "సాధు సాంగత్యాన్ని సర్వవిధాల సంపాదించు; కాని అదే పనిగా వారితోనే ఎల్లప్పుడూ ఉండిపోకు. 'అతి పరిచయంవల్ల అవజ్ఞ'యనే నానుడి వాళ్ళ విషయంలోనూ వర్తిస్తుంది" అన్నారు స్వామి రామదాస్ విజన్ పత్రికలోని వ్యాసంలో.

ఆధ్యాత్మిక పరిణతిని చాలవరకు యోగ్య సంగం మీద ఆధారపడి వుంది. అందుచేత యతుల సంపర్కం సత్యాన్వేషికెంతో అవసరం. యతి సంగం అంటే సాధకుడు సాధువులను సదా అంటిపెట్టుకోడం అనుకోకూడదు.

సాధు సంగతి కొంతకాలం చేస్తే వానికి వలసిన ఉత్సాహం, ఉపదేశం లభిస్తాయి. దాని వలన లోపల ఉండే సత్యము పూర్తిగా జాగృతము కావచ్చు. తానుపొందిన ఆ ఉత్సాహ జ్ఞానాలు మందగించి మాయం కాకముందే వారి నుండి తిరిగి వెళ్ళుట సాధకునికి మంచిది.

అధిక్షేపకులు కావచ్చు (ఆక్షేపించే వారిగా మారవచ్చు)

మహాత్ములతోనే చిరకాల ముండిపోయిన వారిని చాలమందిని ఈ రచయిత స్వయంగా ఎరుగును; అట్టివారిని గూర్చి వినీ ఉన్నాడు. వారిలో చాలమంది తమ ఆసక్తి అభినివేశములూ చల్లబడడంతో మానసిక ఆశంకితులూ ఆక్షేపకులుగా గూడ తయారైనారు.

సాధకుడు తన విశ్వాసమును, పవిత్రతను, ఆకాంక్షను పోగొట్టుకుంటే కలిగే అపకారం చాలా ఎక్కువ.

మహావృక్షం నీడలో ఏ మొలకా ఏపుగా పెరగదు. అది మట్టమై, వాడి తెగులు పట్టిపోతుంది. అదే ఆరు బయల, అప్పటప్పటా మారే వాతావరణంలో ఎండా మంచూ, గాలీ, వానల తాకిళ్ళతో భూమ్యాకాశాల రెండిటినుండీ పోషణ సేకరించి, పెరిగి మహావృక్షమవుతుంది.

జ్ఞానికి సంబంధించిన బాహ్య విషయాలు లేదా వ్యక్తిత్వాన్ని మాత్రమే అనుకరిస్తూ వానికి అత్యంత సన్నిహితుడుగా తన దినాలన్నీ వెళ్ళద్రోసే సాధకుని వృద్ధి ఎలా దెబ్బతింటుందో, పై మొక్క ఉదాహరణ తెలుపుతుంది. ఆధ్యాత్మికంగా వానికగల వైశిష్ట్యాన్ని నిరాఘాటంగా చాటగల కార్యోత్సాహం కుంటుపడి పోతుంది. పరిణితి కధిక ప్రధానాలైన నిర్భీతి, స్వావలంబనం దృఢదీక్షాది గుణముల నతడు పెంచుకోలేడు. మనోవాక్కాయాలను అదుపులోనికి తేగల గొప్ప మార్గదర్శి, తనలోనే ఉన్న సర్వశక్తిమంతుడైన ఆత్మ అయి ఉండాలి. దానికి శరణాగతుడై, తద్రూపంగా మెలగడం వాని గమ్యం. తన కాళ్ళపైనే నిలిచి, శ్రమించి స్వశక్తి స్వానుభవాలు ఆధారంగా పెరిగి, చివరకు స్వాయత్తుడై దైవానికి ఆత్మార్పణం చేసుకోవటమే నిజమైన ముక్తి, శాంతి.

ఇట్లన్న మాత్రాన దైవానుభవంగల సాధువుల సంగాన్ని, దాని మహిమ ప్రాభవాలను శంకిస్తున్నా ననుకోరాదు. జీవి అధ్యాత్మిక పరిణతిని సత్వరం సమకూర్చగల పరమసాధనం సాధుసంగతి. యథార్థంగా సాధనా సంపత్తికి యోగుల అనుగ్రహం అమూల్యమైనది. అది లేనినాడు సాధకుని గతి, పంజరంలో వృథాగా రెక్కలను రెపరెపా కొట్టుకొంటున్న పక్షిగతియే. యోగులు, రక్షకులు, ముక్తిదాతలు. హిందువుల దృష్ట్యా యతి, మూర్తిగొన్న దైవమే. కావున వారిని పూజించు. వారి సాంగత్య మీయగల అరుదైన లాభాన్ని, నిష్కపటంగా, శుద్ధ హృదయంతో సేవించు. పరమశ్రద్ధతో వారి మాటలను ఉపదేశాలను విని, ఆ ప్రకారం ఆచరించి నీవు వెదకే పారమార్థిక జ్ఞానాన్ని పూర్ణంగా ఆకళించుకో. కాని వ్యక్తిగతంగా వారినే సేవించుకుంటూ, వారి తొలి సంపర్కంలో లభించిన తత్త్వసంపత్తిని జారవిడువకు."

పై వ్యాసాన్ని చదువుతున్నంత సేపూ శ్రీభగవాన్ వింటున్నారు. గాని మౌనంగా వుండిపోయారు. సత్పురుష సాంగత్యం ప్రమాదకరమా తెలుపగోరితే వారొక తమిళ పద్యాన్ని వల్లించారు, 'విదేహముక్తి పర్యంతం గురు సాంగత్యం వదలరాదని. శ్రీ భగవాన్, ఆపై ప్రశ్నించారు. 'ఇంతకూ ఆ సత్పురుషుడున్న దెక్కడ, నీలోననే గదా?" అంటూ మరొక పద్యం

ఉదాహరించారు - 'ప్రభూ, ఇంతకు ముందు అన్ని జన్మలలోనూ నాలోనే ఉండి, నా కర్థమయ్యేట్లు మాట్లాడి, నన్ను సన్మార్గంలో నడిపించటానికై మానుషరూపం దాల్చావు.'

## భాషణములు 457

శ్రీమతి రోసిటా ఫోర్బ్స్ ఇండియాలోనే ఉన్నదని విని, శ్రీ భగవాన్ అన్నారు 'ఎంతో సాహసంతో, కొత్తవింతలనూ, దేశాలను కనుగొనడంలో ఈ పరిశోధకుల కానందం. ఆ యత్నాలు ఉద్వేజకాలు (thrilling) సరే కాని వానిలో ఆనందమెక్కడిది? అది యుండేది లోపలే. ఆనందాన్ని బాహ్యప్రపంచంలో వెదక కూడదు."

## భాషణములు 458

అద్వైతం భావనలోనే, ఆచరణలో కూడదన్నారు భగవాన్. గురువును కలిసి, ఉపదేశాలు పొందకుండా అద్వైతబోధ ఎలా సాధ్యం? దానిలోనే ద్వైతం లేదా, యని అర్థం.

## భాషణములు 459

అలెగ్జాండర్ సేల్కర్క్ వ్రాసిన "స్వగతం" నుంచి ఉదాహరిస్తూ శ్రీ భగవాన్ అన్నారు - 'ఏకాంతంలోని ఆనందం, ఏకాంత నివాసంలో లేదు. సందడిగా వున్న తావుల్లో గూడ అది సాధ్యమే. ఆనందం ఉన్నది ఆత్మలో. ఏకాంత నివాసాల్లోనో, సందడిగా ఉన్న పరిసరాల్లోనో కాదు.

## భాషణములు 460

సూర్యోదయం కాబోతున్నది, అప్పుడు చంద్రుణ్ణి చూస్తూ భగవానన్నారు - చంద్రుణ్ణి చూడు, అలాగే ఆ ప్రక్కనే యున్న మేఘాన్ని చూడు. వాని తేజస్సులో ఏ భేదమూ లేదు. చంద్రుడు మబ్బు తునుకలాగే ఉన్నాడు. జ్ఞాని మనస్సు సూర్యోదయ తరుణంలో చంద్రుని వంటిది. అది అక్కడే ఉంటుంది, కాని తనై ప్రకాశించదు.

## భాషణములు 461

ఆ రోజు వచ్చిన ఉత్తరాలు చూస్తున్నారు భగవాన్. అందులో ఒకటి ఇట్లు చదివారు:

ఒక ఇంట్లో పనిచేసే బ్రాహ్మణ పిల్లవాడు ఎప్పటిలాగే రాత్రి నిద్రించాడు. నిద్రలో బిగ్గరగా కేకలు వేశాడు. లేచిన తర్వాత అడిగితే, తన ప్రాణం నోటివెంటా, ముక్కువెంట, దేహం వీడిపోతున్నట్లు అన్పించి ఏడ్చాడట. ఆ వెంటనే చనిపోయాడు. వాని ఆత్మ వైకుంఠానికి పోయింది. అక్కడ విష్ణువు ఆయనచుట్టూ ఇతర దేవతలు భక్తులు నొసట ఊర్ధ్వ పుండ్రాలతో పరివేష్టించి యున్నారు. రేపు 2 గంటలకు కదా వీనిని తన వద్దకు తేవలసియుంది. ఇప్పుడే ఏల తెచ్చారన్నాడు విష్ణువు. వానికంతలో మెలకువ వచ్చింది తన ఈ అనుభవాన్ని వారికి తెల్పాడు. మరురోజు 2 గంటలకు ఆ కుర్రవాడు చనిపోయాడు.

## భాషణములు 462

శ్రీమతి ధరు కొన్ని సందేహాలు. అవి తీరడానికి భగవాన్ సహాయం కావలెనని ఆతురంగా ఉంది. చాల జంకుతూ ఆమె భగవాన్ను సమీపించి తన కష్టాలు వెళ్ళబోసుకుంది. 'చిత్తైకాగ్రతకైన నా యత్నాలు విఫలమైపోతున్నాయి. గుండెదడ, పైపైన, చిన్నగా, గాబరాగా తీసుకునే ఊపిరి. ఇవి అధికంగా అడ్డుతున్నవి. అప్పుడు ఎక్కువగా ఆలోచనలు వచ్చి మనోనిగ్రహం పూర్తిగ సడలిపోతుంది. ఆరోగ్యం సరిగా ఉంటే నా ప్రయత్నం కొంత ఫలించి ఏకాగ్రతతో బాటు శ్వాసమీద

నియమనం కూడా కలుగుతుంది. నా ధ్యానం సంపూర్ణంగా ఫలించడానికి భగవాన్ సామీప్యమెంతో సాయమౌతుందని చిరకాలంగా ఆసించి ఎంతో యత్నించి ఇక్కడికి రాగలిగాను. వచ్చేక ఇక్కడ జబ్బుపడ్డాను. ధ్యానం సాగలేదు. చాల నిరుత్సాహంగా వుంది. కష్టంగా శ్వాస తీసుకొంటున్నప్పుడు గూడ చిత్తైకాగ్రతకై దృఢయత్నం చేసాను. కొద్దిపాటి ఫలించింది కాని తృప్తికరంగా లేదు. నేను తిరిగివెళ్ళే రోజు దగ్గిరౌతున్నది. వెళ్ళిపోవలస్సివస్తుందన్న ఆలోచన నన్ను క్రుంగదీస్తోంది. ఇక్కడ హాలులో కూర్చుని అందరూ ధ్యానిస్తూ హాయిగా శాంతి నన్నుభవిస్తున్నారు. నాకాభాగ్యం కలగలేదు. ఇది చాల నిరుత్సాహకరంగా ఉంది.

మ: తనకా ఏకాగ్రత కలుగలేదే యన్న ఆలోచనలే, ఒక పెద్ద అడ్డు. ఆ ఆలోచన ఎందుకు రావాలి?

భ: ఇరవై నాల్గు గంటలూ ఆలోచనే లేకుండుట సాధ్యమా? ధ్యానం చెయ్యకుండా ఉండాలా?

మహర్షి: మళ్ళీ ఆ గంటల ప్రసక్తియేమి? కాలమనేదీ కల్పనే. నీ ప్రతీప్రశ్న ఒక ఆలోచనవలనే కల్గుతోంది.

శాంతి, ఆనందం నీ స్వభావం. ఆత్మసిద్ధికి ఆలోచనలు ఆటంకాలు. ధ్యానంగాని, చిత్తైకాగ్రత కాని ఆటంకాలను తొలగించడానికి గాని ఆత్మసిద్ధి నిచ్చేవిగావు. ఆత్మకు వేరుగా నున్నదెవరు? ఎవ్వరూ ఉండరు. ఆత్మ స్వభావం శాంతి, అట్టి శాంతి కనబడుటలేదు అంటే, ఆ కనబడకపోవడం అనేది ఒక ఆలోచన మాత్రమే. అది ఆత్మకు భిన్నమైంది. ధ్యానా భ్యాసముబట్టి విరుద్ధ భ్రాంతులను నివారించుటకే. ఆలోచన వచ్చీరాక మునుపే దాన్ని త్రుంచివేయాలి. ఆలోచనలతో కొట్టుకొని పోకూడదు. ఆత్మను మరచినప్పుడే నీకు దేహబుద్ధి కలిగేది. కాని ఆత్మను మరవటం సాధ్యమౌనా? నీవే ఆత్మవే, దాన్ని మరచే దెలాగ? ఒక ఆత్మ మరొక ఆత్మను మరవడం, అంటే ఆత్మలు రెండు వుండాలి. అది అర్థం లేనిది. ఆత్మకు డిప్రెషన్ లేదు. అది అపూర్ణం కాదు. అది నిత్యానందం. తద్విరుద్ధమైన భావన నిస్సారం. నిలకడలేనిది. ఆలోచనలను త్రోసిపుచ్చు. ధ్యానం మాత్రం దేనికని? తానే ఆత్మ. ఆత్మస్థితిలో ఉంటే సరి. చేయవలసింది ఆలోచనలనుండి విముక్తుడవు కావటమే.

అనారోగ్యం ధ్యానాన్ని అడ్డుతున్నదని నీ ఆలోచన. ఈ నిరుత్సాహ కారణమేదో చూడు. దానికి మూల కారణం ఆత్మను దేహంతో తాదాత్మ్యం చేయడం వలన అనారోగ్యం ఆత్మకా? దేహానికే కదా? ఈ అనారోగ్యం తన్ను పట్టి పీడిస్తున్నదని దేహమేమన్నా చెప్తోందా. ఆ పని చేస్తున్నది నీవు. ఎందుకు? నిన్ను నీ దేహంతో తప్పుగా తాదాత్మ్యం చెందించేవు కనుక.

అసలు దేహమే ఒక ఆలోచన. నీవు సహజంగా వుండిపో. నిరుత్సాహానికి కారణమే లేదు.

ఇంతలో ఆమెకు పిలుపువచ్చి ఆమె వెళ్ళిపోయింది. కాని ఆ సంవాదం ఇంకా సాగింది.

భ: శ్రీ భగవాన్ వివరణలు మమ్మెదురు ప్రశ్నలు వేయనీయవు; మాకు సమాధానమైగాదు, వాదించే శక్తిలేక. మా అతృప్తి తీరిపోలేదు. శారీరకమైన అనారోగ్యం తొలగవలెనంటే, మానసిక అనారోగ్యం పోవాలి. ఆ రెండూ ఆలోచనలు లేకుంటే చక్కబడుతాయి. ఆలోచనలు మానవలెనంటే ప్రయత్నం చేయాలి. ప్రయత్నం మనోదార్ఢ్యం లేక సాగదు. మనోబలానికి భగవదనుగ్రహం అవసరం. అనుగ్రహం స్వార్పణలేక లభించదు. ఇలా ఈ ప్రశ్నలన్నీ తిరిగితిరిగి, తెలిసో తెలియకో భగవాన్ అనుగ్రహాన్ని అర్థించటంగా పరిణమిస్తాయి.

మ: చిరునవ్వు నవ్వుతూ, 'అవును'.

భ: శరణాగతిని భక్తియన్నారు. కాని శ్రీభగవాన్ ఆత్మవిచారం వైపు మొగ్గుతారని అందరికీ తెలుసు. శ్రోతలస్థితి సందిగ్ధంగా వుంది.

మ: శరణాగతి పూర్ణంగా తెలిసి చేస్తేనే పని చేస్తుంది. కాకుంటే అట్టి జ్ఞానం, విచారం వల్లనే జనిస్తుంది. దాని పర్యవసానం శరణాగతి.

భ: వ్యక్తిత్వాన్ని అధిగమించిన తర్వాత పరమాత్మ స్ఫురణ కల్గుతుంది అదే

జ్ఞానము. ఆ తర్వాత శరణాగతి ఎందుకు?

మ: నిజమే. జ్ఞానానికీ శరణాగతికీ భేదం లేదు. (చిరుమందహాసం)

భ: మరి అడిగేవాని మనస్సమాధానం కుదిరేదెలాగు? మిగిలిందల్లా సాధు సాంగత్యమూ లేద భగవద్భక్తి. (సత్సంగమూ లేదా ఈశ్వరభక్తి) నవ్వుతూ అవును అన్నారు భగవాన్.

## భాషణములు 463

మాటవరుసగా భగవాన్ తనకి సేవలందించిన పళనిస్వామి, అయ్యాస్వామి సేవలను మెచ్చుకున్నారు.

'వాళ్ళు తోటలో రెండు అరుగులు తయారుచేసారు. చూడటానికవి ఏమంత అందమైనవి గావు. వానిలో నొకదానిపై స్వామి, రెండవదానిపై పళనిస్వామి. అవి చాల సుఖంగా ఉండేవి. అవి వెదురు చాపలు, తుంగ చాపలతో చేయబడ్డవి, ఇప్పటి ఈ సోఫాలకన్న ఎంతో సుఖంగా వుండేవి. రోజూ పళనిస్వామి కీళనత్తూర్ వెళ్ళి భిక్ష తెచ్చేవాడు. దారిలో ముళ్ళ పొదలూ, డొంకలూ, వాని మధ్యగా దారిచేసుకుంటూ నడవవలసి వచ్చేది. వద్దని భగవానెంత వారించినా పళనిస్వామి వినేవాడు గాదు. వానికి ఏ ఆసక్తి, లోభమూ లేవు. అతడు కష్ట సమయాల్లో ఏర్పడిన వలస గ్రామాల్లో పనిచేసి గడించిన కొద్ది మొత్తాన్ని ఊళ్ళో ఎవరివద్దనో దాచియుంచి, అత్యవసరమైనప్పుడు కొంచెం కొంచెం తీసి ఉపయోగించేవాడు. వాని స్వంత ఊరిలోనే ఏదో జీవనోపాధి కల్పించారు కాని దాన్ని త్రోసిపైచి భగవాన్తోనే చివరివరకు ఉండిపోయాడు.

అయ్యాస్వామి దక్షిణాఫ్రికాలో ఒక యూరోపియన్వద్ద పనిచేసాడు. మంచి శుభ్రత, చురుకుదనము, సామర్థ్యము ఉన్నవాడు. ఏకకాలంలో పది ఆశ్రమాలను నిర్వహించగల దిట్ట. పళనిస్వామివలెనే అతనికీ లోభమోహాలు లేవు. పళనిస్వామికంటే ఎక్కువ సమర్థుడూ అయ్యాస్వామి. పలనిస్వామికి ఎంతో విశ్వాసపాత్రుడు, ఆయనపట్ల ప్రేమ గలవాడూ.

భగవాన్ విరూపాక్షగుహలో ఉంటూండగా మొదట వచ్చాడు అణ్ణామలై. ఆ మీద అతడు కోవెలూరు వెళ్ళి తమిళశాస్త్ర గ్రంథాలు చదివాడు. అక్కడినుంచి అతడు తిరిగి వచ్చేప్పటికి భగవాన్ స్కందాశ్రమంలో వున్నారు. జనవరి 1922లో, తన 29వ ఏటనే అతడు చనిపోయాడు. చని పోకముందు భక్తిపూరితములూ, అర్థవంతమైన 36 పద్యాలను తమిళంలో రచించినాడు. వానిని చదివించి శ్రీ భగవాన్ వానిపై సంక్షిప్తంగా వ్యాఖ్యానించారు.

## భాషణములు 464

అరుణాచల మాహాత్మ్యం నుండి పంగున్ని యోగి కథ చదివారు. పంగున్ని కుంటివాడు. శ్రీ అరుణాచలుని అనుగ్రహంవల్ల వాని కాళ్ళు చక్కనైనాయి. భగవాన్ తాము గురుమూర్తంలో ఉండగా ఒకతన్ని చూచారు. ఆయన కథ ఇలా చెప్పారు. అతని పేరు కుప్పు అయ్యర్. వాని కాళ్ళు ఉపయోగపడేవే కావు. నడువలేడు. పిరుదులపై జరుగుతూ అతడొకసారి వేట్టవలం వెడుతున్నాడు. ఉన్నట్టుండి ఒక ముదుసలి దారిలో వానికగపడి 'ఏమిటా డేకడం! లేచి నడు' అని గర్జించాడు. కుప్పు అయ్యర్ తనకు తెలియకుండానే లేచి సులువుగా నడువసాగాడు. అతడాశ్చర్య సంభ్రమాలతో నిండిపోయాడు. నాల్గడుగులు వేసి వెనుదిరిగి చూస్తే ఆ ముసలివాడు ఎక్కడా లేడు. ఆయన నడుస్తూంటే చూచినవారి కందరికీ ఎంతో ఆశ్చర్యమయింది. వారి కాయన జరిగిన కథ వర్ణించాడు. ఇది మహర్షి తిరువణ్ణామలై రావడానికి రెండేండ్ల మునుపు జరిగింది. కుప్పు అయ్యర్ కాళ్ళు వచ్చిన వైనం ఊరిలో ఆయన్ను చూచిన ఏ వృద్ధు నడిగినా తెలుస్తుంది.

ఊళ్ళో బాలికల బడిలో ఒక పిల్లనెవరో మోసగించి ఆమె నగలను దొంగలించేరు. అకస్మాత్తుగా అక్కడికొక ముసలివాడు వచ్చి ఆ పిల్ల నాపద నుండి తప్పించి ఆ పిల్లను ఇంటికితెచ్చి విడిచి, తర్వాత మాయమైపోయాడు. ఇట్టి ఆశ్చర్యకరమైన విశేషాలు తిరువణ్ణామలైలో తరుచుగా జరుగుతాయి.

## భాషణములు 465

రిటైర్ అయిన ఒక హైకోర్టు జడ్జికి 'ఉపదేశసారం'లోని కొన్ని అంశాలను శ్రీ భగవాన్ వివరించారు.

1. ధ్యానము నదీ ప్రవాహమువలె అవిరళంగా జరుగాలి. అట్లు సాగినచో అది సమాధి, లేక కుండలినీ శక్తి.

2. మనస్సు నిద్రాణమై హృదయంలో లయం కావచ్చు. కాని విధిగా మరల లేవవల్సిందే. అది లేచిన పిదప, సాధకుని స్థితి యథాపూర్వంగానే ఉంటుంది.

ఈ స్థితిలో అణగియున్న వానివాసనలు తిరిగి సన్నద్ధములై అనుకూలమైన పరిస్థితులు దొరకగానే విజృంభిస్తాయి.

3. మానసిక ప్రవృత్తులను పూర్తిగా నష్టం చేయవచ్చు. ఆ పిదప మనస్సు పూర్వస్థితిలో ఉండదు. అది అనాసక్తమై తిరిగి ఎప్పటికీ కనబడదు. స్థితిలోనున్న తర్వాత ఆ ప్రపంచాన్ని అతడు చూచినా, దాని కతడు ఈయవలసిన విలువే ఇస్తాడు. అంటే ఏకసత్య విషయంగానే చూస్తాడు. వాస్తవ స్థితి సహజస్థితి సమాధిలోనే అనుభవమౌతుంది. అప్పుడున్నదే, ఇప్పుడూ ఉంది. అట్లుగాకపోతే, అది సత్యంగాని నిత్యంగాని కాజాలదు. సమాధిలో ఉన్నదే, ఇప్పుడు ఇక్కడ కూడా వుంది. దాన్ని చేజిక్కించుకో. అదే నీ సహజమైన “ఉండు” స్థితి. సమాధి నిన్నచటికి చేరుస్తుంది. చేర్చకపోయేట్టయితే నిర్వికల్ప సమాధి ప్రయోజనం ఏముంది? అదెంతో, ఒక కొయ్యమొద్దూ అంతే. ఎప్పుడో ఒకప్పుడు ఆ సమాధినుంచి లేవవలసిందే. ప్రపంచంలో మెలగవల్సిందే. కాని సహజ సమాధిలో అతడు జగత్తుతో బాధింపబడడు.

సినీతెరపై ఎన్ని దృశ్యాలు మారటం లేదు! అగ్ని సర్వాన్నీ దహిస్తుంది, నీరు ముంచుతుంది, కాని తెర చెక్కుచెదరదు. ఆ దృశ్యాలు కేవల కల్పనలు, తెరనే రీతిగానూ తాకబోవు. అలాగే ప్రపంచ దృశ్యాలు, జ్ఞాని ఎదుట సాగిపోతూ ఉంటాయి; అవి వాని నంటవు.

ప్రపంచ వ్యవహారలలో జనులకు సుఖదుఃఖాలున్నవి గదా అనవచ్చు అది అధ్యారోపమే. అది ఇలా జరగకూడదు. ఈ లక్ష్యం దృష్టిలో నుంచుకొని సాధన చేస్తే అది అలా జరగదు.

అభ్యాసం రెండువిధాల ఉండవచ్చు; భక్తి, జ్ఞానము. ఇవి గూడ గమ్యాలు కావు. సమాధిని సాధించుకోవాలి. అది సహజమైనంతదాకా అభ్యాసం కొనసాగాలి. ఆ పైన ఇక చేయవలసిందేమీ ఉండదు.

## భాషణములు 466

శ్రీ వైద్యలింగం నేషనల్ బ్యాంక్ ఉద్యోగి. అతని ప్రశ్న - ధ్యానంవల్ల విషయ ప్రపంచం పోయి ఆనందం కలుగుతుంది. కాని అది అట్టే నిలువదు. దాన్ని ఎల్లప్పుడూ నిలుపుకొనేదెలాగ?

మహర్షి: వాసనలను దహించడం ద్వారా.

భక్తుడు: ఆత్మ సాక్షి మాత్రమే కదా?

మహర్షి: 'సాక్షి'యనే పదం చూచేందుకొక విషయముంటేనే వర్తిస్తుంది. అప్పుడది ద్వైతము. నిజం ఆ రెంటి కవ్వలిది. 'సాక్షి చేతః కేవలో నిర్గుణశ్చ అన్న మంత్రంలో 'సాక్షి' పదాన్ని 'సన్నిధి'యని అర్థం చేసుకోవాలి; సన్నిధి లేకుంటే మరేవీ ఉండవు కనుక. ప్రతిరోజు జరిగే పనులన్నిటికీ సూర్యుడెట్లవసరమో చూడు. వానిలో అతడేమీ పాల్గొనడు. అయినా అతని సన్నిధిలో తప్ప అవి జరగవు. ఆ క్రియల 'సాక్షి' అతడు. ఆత్మ విషయమూ అట్లే.

## భాషణములు 467

యోగిరామయ్య: అన్ని పనులూ శక్తి వలన జరుగుతున్నాయి. శక్తి మేర ఎట్టిది? పురుషకారం లేకనే శక్తి దేనినైనా చేయగలదా?

మహర్షి: 'పురుష'డంటే అర్థం చేసుకున్న దానిని బట్టి సమాధానం ఉంటుంది. అతడు ఆత్మయా, అహంకారమా?

భక్తుడు: 'పురుష' అంటే స్వరూపం.

మ: అతడే ప్రయత్నమూ చేయలేడే.

భః ప్రయత్నించేది జీవుడు.

మ: అహంకారం ఉన్నదాకా, ప్రయత్న మవసరము. అది లేనప్పుడు ఆ కార్యాలు అప్రయత్నంగా జరిగిపోతాయి. అహంకారం ఆత్మసన్నిధిలో ప్రవర్తిస్తుంది. ఆత్మలేక అహంకారం ఉండదు. ఆత్మ ఈ విశ్వాన్ని ఇప్పుడు ఉన్నరీతిగా తన శక్తివల్ల కల్పిస్తుంది; అయినా తానై వర్తించదు. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు 'నేను కర్తను గాను; అయినా కార్యాలు అవిగా జరుగుతాయి' అన్నాడు. మహాభారతము శ్రీ కృష్ణుడొనర్చిన అత్యద్భుతాలను విస్పష్టంగా కొనియాడుతుంది. కాని ఆయన తాను కర్తను కాదనడం చూడు. ఇది సూర్యుడూ మరియు సూర్యుని వలన జరిగే పనులవలె ఉంటుంది.

భ: జీవునికి అభిమానమున్నది; ఆయనకు అభిమానము (సంగము) లేదు.

మ: అవును. సంగము కలవాడు గనుకనే జీవుడు కర్మ లొనరిస్తాడు. ఫలమనుభవిస్తాడు. ఫలం వాడు కోరినట్టిదే అయితే చాల సంతోషం; కాకుంటే దుఃఖం, సుఖదుఃఖాలకు సంగమ కారణం. అనాసక్తంగా (సంగ రహితంగా) పనులు జరిపితే, ఫలాభిలాష ఉండదు.

భ: వ్యక్తి ప్రయత్నం లేక పనులు వాటంతటవి జరుగుతాయా? తినడానికి అన్నం ముందు వండనక్కర లేదా?

మ: అహంకారం ద్వారా ఆత్మ పనులొనరిస్తుంది. యత్నాలు లేక కార్యాలు లేవు. నిద్రిస్తున్న బిడ్డకు తల్లి అన్నం పెడుతుంది. సగం నిద్రలోనే బిడ్డ ఆహారం తీసుకొంటాడు. లేవగానే తాను నిద్రపోయానని అన్నం తిననే లేదని అంటాడు. వాడు తిన్నదీ, లేనిదీ అమ్మకు తెలుసు. అలాగే జ్ఞాని, తాను గమనించకుండానే కర్మలు చేస్తాడు. ఆ చేయటం ఇతరులు చూస్తారు. కాని ఆయన కాధ్యాసే ఉండదు. "అతని భయం వల్ల గాలివీస్తుంది" .... ఇత్యాది. (భీషాస్మాద్ వాతః పవతే . తైత్తిరీయ ఉపనిషత్) ఇత్యాది. అదే విషయ వ్యవస్థ. సర్వం ఆయన విధిస్తాడు. ఆ క్రమంలోనే విశ్వంనడుచుకొంటుంది. కాని అది ఆయనెరుగడు. అందుచేతనే ఆయనను 'మహాకర్త' అన్నారు. దేహధారి ప్రతివాడూ నియమ బద్ధుడు. ఆ నియమం బ్రహ్మకూడ తప్పించుకోలేడు.

(తానెందుకు ప్రశ్నించేడో ఆ పృచ్ఛకుడు తర్వాత వివరించాడు. ఈ ప్రపంచం ఇలాగే సాగిపోతుంది. దైవేచ్ఛ కనుగుణంగానే వ్యక్తుల అవసరాలు తీరుతుంటాయి అన్నారు భగవాన్. కాని తెల్లవారి 4 గంటలకే శ్రీ భగవాన్ ఆశ్రమంలో వారిని కూరలవీ తరగడానికై లేపుతుండటం తాను చూచాడు. ఆ ప్రశ్న అడిగింది తన తృప్తికే గాని చర్చకై కాదన్నాడు.

## భాషణములు 468

శ్రీ భగవాన్ హాలులోంచి వెలుపలికి వెడుతుండగా, ప్రక్కనే ఉన్న కుటీరం నుండి వేదపారాయణం వినబడింది

"అంతరాదిత్య మనసా జ్వలంతమ్ - బ్రహ్మణా విందత్" అది వినమంటూ భగవానన్నారు -

తైత్తిరీయోపనిషత్తులో గూడ పరమాత్మ స్వర్ణరూపిగా చెప్పియున్నది. దీని అర్థమేమి. సూర్యచంద్రాది గ్రహతారకలు స్వయం ప్రకాశములనే వచించియున్నా, అవి తమంతట తామె వెలుగవు. వాని వెలుగు పరమాత్మ జ్యోతి భాసించినదే. (న తత్ర సూర్యో విభాతి) వానిని బ్రహ్మమునకు వేరుగా పరిగణించినంత కాలము వాని 'స్వయం ప్రకాశము' బ్రహ్మ ప్రకాశముగనే ఎన్నవలె. సూర్యాదులను ప్రస్తావించే శ్రుతి మంత్రములన్నీ బ్రహ్మమునే చెప్పుచున్నాయి.

## భాషణములు 469

యోగిరామయ్య: సాధకుడు జ్ఞానం కోరి గురువును చేరుతాడు. గురువు వానికి బ్రహ్మ నిర్గుణుడూ, నిరంజనుడూ, నిశ్చలుడూ ఇంకా మరేమేమో అని తెలియచెప్పుతాడు. అట్టి వేళల్లో గురువు వ్యక్తిగానే కదా మాట్లాడటం? గురువు వానితో పలుకకనేపోతే, వాని అజ్ఞానం తొలగేదెట్లు? వ్యక్తిగా గురువు చేసే బోధ సత్యముతో సమానమౌతుందా?

మ: గురువు ఎవరికి చెప్పాలి? ఎవరి కాయన ఉపదేశం? ఆయన ఎవరినైనను ఆత్మకు వేరుగా చూచునా?

భ: కాని శిష్యుడాయనను వివరణ అడుగుతున్నాడే?

మ: నిజమే. కాని గురువు వానిని తనకు భిన్నంగా చూస్తాడా, అని. అందరూ ఆత్మజ్ఞులని తెలియకపోవటమే వాని అజ్ఞానం. ఆత్మకు వేరుగా ఎవరైనా ఉండగలరా? గురువు చేసేది అజ్ఞానమేదో సూచించడం మాత్రమే. అంతేకాని వ్యక్తిగా శిష్యునికి భిన్నంగా ఉండడు.

ఆత్మ సాక్షాత్కారమంటే ఏమిటి? శంఖచక్రగదాఖడ్గాదులతో, చతుర్భుజాలతోడి దైవాన్ని చూడడమా? దైవమట్లేకనబడ్డా, శిష్యుని అజ్ఞానం పోయేదెలాగ? సత్యం నిత్యానుభూతిగా ఉండాలి. ప్రత్యక్షం అనవరతానుభవం కాదా? దైవమే సాక్షాత్కరించాడని వింటున్నాము. దాని అర్థం, పై చెప్పిన వేషభాషలతో భక్తుని కగుపించాడని కాదు. ఆత్మానుభవం సంతతం లేకపోతే దానికి ప్రయోజనం లేదు. నాల్గుచేతులతో కనుపించడం, నిరంతరానుభవ మౌతుందా? అది దృగ్గోచరము, భ్రాంతి. చూచేవాడుంటేనే ఇవన్నీ, నిత్యమైనా, సత్యమైనా అది ఆ చూచేవాడే? (ద్రష్ట)

దైవం కోటిసూర్య సంకాశుడుగనే కన్పించనీ. కాని ప్రత్యక్షమంటే అదేనా?

దాన్ని చూడటానికి కండ్లు మనస్సు ఇత్యాదులు అవసరం. అది పరోక్షజ్ఞానం. చూచేవాడు ప్రత్యక్షుడే. ప్రత్యక్షము ద్రష్ట ఒక్కడే. ఇతర దర్శనాలన్నీ గౌణాలే.

ఆత్మపైని ఈ దేహారోపం ఎంత లోతుగా పాతుకుపోయిందంటే కంటి ఎదుటి దృశ్యాన్నే ప్రత్యక్షంగా గణిస్తారు. కాని ద్రష్టను కాదు. ఆత్మానుభూతి లేనివాడే లేడు. మరి ఆత్మానుభవం కావలసిందెవరికి? ఎవ్వరికైన ఆ అనుభవం లేదనిగాని, ఎవ్వరైనా ఆత్మకు వేరుగాని అన వీలవుతుందా? అది సాధ్యం కాదు. అందరూ ఆత్మసిద్ధులే అన్నది సుస్పష్టం. అలౌకిక శక్తులు చూపలేకపోతినన్న దుఃఖం తప్ప మరేలోటూ లేదు. అందువల్ల వాడు దైవం తనకు ప్రత్యక్షమై ఆ సిద్ధులన్నీ ప్రసాదించి తెరమరుగున ఉండిపోవాలని వాంఛిస్తాడు. క్లుప్తంగా చెప్పవలెనంటే, తన శక్తులన్నీ దైవం మానవుని పరంచేసేయాలి.

భ: శ్రీ భగవాన్ లాంటి మహాత్ములు ఎంత నిక్కచ్చిగా మాట్లాడినా చెల్లుతుంది. వారియెడ సత్యేతరం ఉండదు కనుక, అది అందరికీ అత్యంత సులభమనుకొంటారు. మాలాంటి సామాన్యుల కది నిజంగానే చాలా కష్టం.

మ: అయితే వారెవరైనా తామాత్మ కాదంటారా?

భ: నా ఉద్దేశం మిది; మహర్షి చెప్పేటంత సూటిగా చెప్పగల ధైర్యం మరెవ్వరికీ చాలదని.

మ: ఉన్నదున్నట్లు చెప్పడానికి ధైర్యంతో పనేమి?

## భాషణములు 470

ఒక యూరోపియన్ రాజమహిళ ఈ రాత్రికి యూరోప్ తిరిగి వెళ్ళనున్నది. తన్నూ, తన కుటుంబాన్ని ఆశీర్వదించవలెనని మహర్షిని వేడింది.

మ: నీవనుకొన్నట్లు, సన్నిధిని వీడి, ఎక్కడికీ పోవటం లేదు. సాన్నిధ్యం ఎల్లెడలా ఉంది. ఒక చోటనుండి మరోచోటికి కదలివెళ్ళేది దేహం; అది గూడా సన్నిధికి బయటకు పోదు. అందుచేత ఎవ్వరూ పరమాత్మ దృష్టికి దూరం కాలేరు. ఒక దేహాన్ని భగవానని, మరొక శరీరం నీవని భావిస్తావు గనుక, ఇర్వురూ వ్యక్తులని భ్రమించి, ఆయననుండి దూరమౌతున్నానని శంకించావు. నీవెక్కడకి వెళ్ళినా 'నన్ను' వదలిపోలేవు.

సినీతెరపై చిత్రాలు కదలుతాయి. కాని తెర ఎప్పటిచోటునే ఉంటుంది, సన్నిధియే తెర, నీవూ నేను ఇతరులూ బొమ్మలు. వ్యక్తులు వెళ్ళిపోతారు. కాని తెర కదలదు. ఆత్మ సుస్థిరంగా ఉంటుంది.

## భాషణములు 471

భ: ఆత్మజ్ఞులకన్నా, అవతారము లెక్కువ మహిమోపేతము లంటారు. పుట్టుకతోనే ఆ మూర్తులు మాయాతీతులు. వారిలో దివ్య శక్తులావిర్భవించి ఉంటాయి. నూతన ధర్మాలు ప్రబోధింపబడతాయి. అట్లే మరెన్నో, జరుగుతాయి.

మః "జ్ఞాని త్వాత్మైవ మే మతం (జ్ఞానిని నేనే" 2. "సర్వం ఖల్విదం బ్రహ్మ" (అంతయూ బ్రహ్మమే)

అవతార మూర్తి జ్ఞానికన్న ఏ విధంగా భిన్నము? విశ్వానికి భిన్నంగా అవతారం ఎట్లుండగలదు?

భ: అన్ని రూపాలకూ ఆయతనం (ఆశ్రయము) చక్షువే. అట్లే శబ్దానికి చెవి. అన్నింటినీ వర్తింపచేసేది చైతన్యం. ఇంద్రియాల సాయంలేక ఏ అద్భుతాలూ సాధ్యం కావు. అసలు అద్భుతాలంటూ ఎలా ఉండగలవు? అవి బుద్ధికందేవి కావంటే, స్వప్న కల్పితాలూ అట్టివే. మరి అద్భుతాలెక్కడివి? అవతారాలను జ్ఞానులను వేర్వేరనటం అసంగతం. అలా అంటే 'బ్రహ్మజ్ఞుడు బ్రహ్మయే' అనుటను నిరాకరించడమే.

మ: అవునట్లే.

## భాషణములు 472

పంజాబీల పెద్ద బృంద మొకటి యాత్రాశకటంలో వచ్చి దిగింది. వారు ఆశ్రమానికి వచ్చేప్పటికి ప్రొద్దున 8.45 గంటలయింది. భగవాన్ వద్ద చాలా సేపు మౌనంగా కూర్చున్నారు. గం. సుమారు 9.20కి వారిలో నొకరు -

భ: పంజాబులో తమ కీర్తి వ్యాపించింది. తమ దర్శనానికై ఇంత దూరము వచ్చాము. మాకేదైనా ఉపదేశం దయచేయండి.

వాగ్రూపంగా భగవాన్ వారికేమీ చెప్పలేదు. చిరునవ్వుతో వారి వైపు దృష్టి సారించే ఉన్నారు అప్పుడొకరు -

భ: యోగ, భక్తి, జ్ఞానాల్లో ఏ మార్గం గొప్పది?

భగవాన్ బదులీయలేదు. భగవాన్ హాలునుండి కొన్ని నిమిషాలు బయటికి వెళ్ళారు. వచ్చినవారు వెళ్ళిపోసాగారు. కొద్దిమంది మాత్రం ఇంకా అక్కడే కూర్చుని ఉన్నారు. చిరకాలంగా భగవాన్ సేవించుకొంటున్నతడా పంజాబీతో అన్నాడు -

"మీ ప్రశ్నకు భగవాన్ మౌనంతో సమాధాన మిచ్చారు. ఆ మౌనం వాక్కుకన్న ఎంతో బలం గలది.'

ఇంతలో భగవాన్ గదిలోకి తిరిగి వచ్చారు. వారితో మళ్ళీ ఆ పంజాబీ,

భ: దైవాన్ని నమ్మేవారికి ఇదంతా బాగానే వుంటుంది. ఇతరులు అడుగుతారు. అసలు దేముడు ఉన్నాడా అని.

మ: నీవున్నావా?

భ: అవును. ప్రశ్న అదే. ఒక సిపాయిదండు నా ఎదుటే కదలిపోతుంటే చూసాను. అందుచేత నేనున్నాను.. ఈ ప్రపంచం దైవసృష్టి అయివుండాలి. ఆ సృష్టికర్తను నేనెలా చూడగలను?

మ: వీని నన్నిటినీ చూస్తున్న నిన్ను చూడు. నీ సమస్య తీరిపోతుంది.

భ: అంటే మౌనంగా కూర్చోనా? శాస్త్రాలూ చదువనా? కాక చిత్తైకాగ్రత అభ్యసించనా? భక్తి ఏకాగ్రతకు సహాయమే. జనులు భక్తుల పాదాలు తాకి నమస్కరిస్తారు. వారట్లు చేయకుంటే ఆ భక్తునికి తృప్తి కలుగదు, కాని వాని భక్తి క్రమంగా తగ్గిపోతుంది.

మ: ఆనందాభిలాష ఎప్పుడూ తరిగేది కాదు. భక్తియంటే అదే.

భ: దాన్ని సత్వరం అలవర్చుకొనే దెట్లు? రోజు 2 గంటల సేపు ఏకాగ్రత అభ్యసిస్తే, మరురోజు దానినింక కొంచెం పొడిగించితే, దానితో అలసిపోవడం వలన నిద్రవస్తుంది.

మ: నిద్రలో నీకు అలసట రాదు. నిద్రలో ఉన్న ఆ వ్యక్తియే ఇక్కడ కూడా వున్నది. అటువంటప్పుడు ఇప్పుడు నీ కలసట ఎందుకు? మనస్సు చంచలంగా
ఉండి, అశాంతమయింది కనుక. నీ మనస్సు అలసిపోతుంది నీవు కాదు. భ: నేను వర్తకుడిని. వ్యాపారం చూచుకొంటూ, మనశ్శాంతిని కూడ పొందేదెలా?

మ: అదీ ఒక ఆలోచనే. ఆ ఆలోచన కూడా మాని సహజస్థితిలో ఉండిపో.

భ: ఫలమాసింపక విధి నిర్వర్తించమన్నారు. అట్టి మనస్థితి కలిగే విధానం ఏమిటి?

మ: నీవే కొత్త స్థితిని కోరి సాధించవలసిన అవసరం లేదు. ఇప్పటి ఆలోచనలను పోగొట్టుకో చాలు.

భ: దానికి కావలసిన భక్తిని ఎలా తెచ్చుకోవాలి?

మ: ఆలోచనలు నీ ఆత్మకు విజాతీయాలు. వానిని తొలగించుకోవడమే భక్తి.

భ: మనశ్శక్తి, కనుకట్టూ మొదలైనవి అంటే ఏమి? పారిస్లో డాక్టర్ కూ అని ఒకరుండేవారు. అతడు చదువుకున్నవాడు కాడు. కాని ఎన్నో మొండిరోగాలను తన ఇచ్ఛా శక్తి (will-force)తో కుదిర్చాడు. అతడనేవాడు “నిన్ను నయం చేసుకొనే శక్తిని నీవే జనింపచేయి. ఆ శక్తి నీలోనే ఉంది" అని.

మ: అన్ని జబ్బులకూ నిలయమైన దేహానికి మూలం ఆ ఇచ్ఛాశక్తియే.

భ: అందుకే ఆలోచనలే అన్ని విషయాలనూ కల్పించాయి అంటారు కదా.

మ: ఆ ఆలోచన ముక్తికొరకై యుండాలి.

భ: ఇతర ఆలోచనలను నశింపచేయటానికి దైవసహాయం కావాలి.

మ: ఇదీ యొక ఆలోచనే. పుట్టిన దాన్నే ఈ ప్రశ్నలడగనీ. అది నీవు కాదు, నీ కెలాంటి ఆలోచనలూ లేవు.

రావల్పిండి నుండి వచ్చిన ఒక వ్యక్తి: ఆత్మకు రూపం లేదు. దానిపై ధ్యానం ఎలా చేసేది?

మ: అరూపమూ, అవ్యవహార్యము అన్నావే, ఆ ఆత్మను వదలిపేయి. నీకు నీ మనస్సు తెలుసుకదా. ఆ మనస్సును చిక్కించుకో, అది చాలు.

భ: మనస్సు సూక్ష్మమైనది. అది ఆత్మ సదృశము, మనో స్వభావము తెలుసుకునేదెలా? ఉపకరణాలన్నీ వ్యర్థాలన్నారు. మరి మాకాధరమేంటి?

మ: నీ మనస్సిపు డెక్కడ నిలిచియుంది?

భ: ఎక్కడుంది?

మ: మనస్సునే అడుగు.

భ: ఇప్పుడు మిమ్మల్ని అడుగుతున్నాను. అయితే మనస్సుపై ధ్యానముంచనా?

మ: ఊఁ

భ: మరి మనస్స్వభావయేమి? దానికి రూపులేదు. ఇది చాల క్లిష్టంగా వుంది.

మ: నీవెందుకు గాభరాపడుతున్నావు?

భ శాస్త్రాలు ఏకాగ్రతను విధిస్తాయి. అది నాకు చేత కావడం లేదు.

మ: మనమున్నామని ఏ శాస్త్రాలవల్ల గ్రహించాము?

భ అది అనుభవం. కాని నేను కోరేది ఏకాగ్రత.

మ: ఆలోచనలనుండి విడివడు. దేనిలోనూ ఆసక్తి ఉంచకు. అవి నిన్నంటవు.

నీవు, నీవుగా వుండు.

భ: దేని ఆధారంగా ధ్యానించటమో నాకింకా బోధపడలేదు. మనస్సుపై ధ్యానముంచనా?

మ: ఎవరి మనస్సు?

భ నా మనస్సే.

మ: నీవెవరు? అప్పుడు నీ ప్రశ్నకు సరియైన సమాధానం వస్తుంది.

(అందరూ భోజనాలకు లేచారు. మధ్యాహ్నం 2.30 గంటలకు అతడు మళ్ళీ అదే ప్రశ్నను కొనసాగించాడు.)

భ: ఆలోచనలను మానమని మహర్షి ఆదేశం. ఆలోచనలన్నీ పోగొట్టుకున్నాక నా ధ్యానం దేనిపైన చెయ్యాలి? అప్పటి నా స్థితియేమో, దేనిమీద ధ్యానం చెయ్యాలో నాకు తెలియదు.

మ: ఏకాగ్రత ఎవరికి?

భ: మనస్సుకు.

మ: అయితే మనస్సు నేకాగ్రం చేయి.

భ: దేనిపైన?

మ: దానికి సమాధానం నీవే చెప్పు. మనస్సంటే ఏమి? ధ్యానం ఎందుకు

చెయ్యాలి?

భ: మనస్సేమో నాకు తెలీదు. మహర్షి నడుగుతున్నాను.

మః మహర్షి మనస్సును తెలియగోరలేదు. పృచ్ఛకుడు మనస్సునే అదేమో అడగాలి.

భ: మనస్సునుండి ఆలోచనలన్నీ తుడిచివేయమని మహర్షి సలహా.

మ: అదీ ఒక ఆలోచనే.

భ: ఆలోచనలన్నీ తీసివేస్తే, మిగిలేదేమి?

మ: ఆలోచనలూ, మనస్సూ వేరా?

భ: కాదు. మనస్సంటే ఆలోచనల గుంపు. నేననేదిది, ఆలోచనలనన్నిటినీ త్రోసి వేస్తే, ఆ పైన మనస్సు నేకాగ్రం చేయటమెలాగ?

మ: ఇది గూడ ఆలోచనే గదా?

భ: నిజమే. కాని నన్ను ఏకాగ్రతను సాధించమన్నారు గదా?

మ: ఏకాగ్రత ఎందుకు? ఆలోచనలను విచ్చలవిడిగా పోనిస్తే ఏం?

భ: అలాచేస్తే ఆలోచనలు మమ్ము పెడదారి పట్టించి వికారములైన, అసద్వస్తువుల అండచేరుస్తాయి అని శాస్త్రములు చెప్తాయి.

మ: అంటే ఎప్పుడూ మారుతూండే అయథార్థాల దరిచేరరాదని నీ కోరిక, ఆలోచనల స్వభావం అశశ్వాతము, మిథ్య. నీకు వలసింది సద్వస్తువు. నేను చెప్పేది అదే. ఆలోచనలు మిథ్యలు. వానిని వదల్చుకో.

భ: ఇప్పుడర్థమైంది. కాని సందేహాలుండనే ఉన్నవి. 'కర్మ చేయక క్షణము లేదు. (నతిష్ఠతి అకర్మకృత్). మరి ఆలోచనలను పోగొట్టేదెలా?

మ: ఆ భగవద్గీతయే, కర్మలన్నీ జరుగుతున్నా, కర్తను నేనుకానన్నది. అది లోక వ్యవహారములందు సూర్యునివంటివి. ఆలోచనలు పొంగుతూ క్రుంగుతూ ఉంటాయి. కాని ఆత్మ సదా అకర్మిగనే ఉంటుంది. ఆత్మ అవికార్యము, పూర్ణము. మనస్సు మార్పు నొందేది, పరిమితము. నీవు పరిధులను వదలి వేయాలి. అప్పుడే నీ పూర్ణత స్పష్టమౌతుంది.

భ: దాని కనుగ్రహం మవసరం.

మ: అనుగ్రహం ఎప్పుడూ ఉన్నదే. దానికి నీవు ఆత్మసమర్పణం చేసుకోవటమే మిగిలి ఉంది.

భ: శరణాగతినై అర్థిస్తాను. నే నొకవేళ తప్పుమార్గంలో పోయినా నన్నక్కడనుండి బలవంతంగానైన వెనుకకు లాగేయండి అని.

మ: శరణాగతి ఇదేనా? శరణాగతి పూర్ణంగా కావలెనంటే ప్రశ్నలు లేకుండా ఉండాలి.

భ: సరి, శరణాగతి చెందాను. ఆత్మాంబుధిలో మునుగమన్నారు. ముత్యాలకై సముద్రంలో మునిగేవానిలా,

మ: చైతన్య సముద్రానికి నీవు వెలుపలనే ఉన్నావని ఇప్పుడనుకొంటున్నావు గనుక.

భ: నేను ప్రాణాయామం చేస్తాను. శరీరం ఉష్ణోగ్రత పెరుగుతోంది ఏం చేసేది?

మ: మనస్సు శాంతమైతే, ఉష్ణోగ్రత అదే తగ్గుతుంది.

భ: అది నిజమే. కాని చాలా కష్టం.

మ: ఇదీ ఒక ఆలోచనే. అదే ఒక ఆటంకం.

భ: అరుణగిరి చుట్టూ మూడు యోజనాల మేరలో నివసించేవారికి వారడిగినా అడక్కపోయినా ముక్తి లభిస్తుందన్నారు. జ్ఞానం వల్లనే కైవల్యమనేది అందరూ ఆమోదించేదే. వేదాంత విజ్ఞానం చాల దుస్సాధ్యమంటుంది పురాణం. కాబట్టి ముక్తి దుర్లభము. అయినా గిరిచుట్టూ ఉన్న మాత్రాన్నే అంత సులభంగా ముక్తి ఎట్లు సాధ్యం?

మ: 'అది నా ఆజ్ఞ' అన్నాడు శివుడు. ఇక్కడ నివసించేవారికి దీక్షాదులవసరం లేకనే ముక్తి దొరుకుతుంది. శివాజ్ఞ అట్లున్నది.

భ: ఇచట పుట్టినవారు శివానుచరులైన భూతప్రేత పిశాచాదులని గూడ పురాణంలో వుంది.

మ: అదే మాట తిరువారూరు, చిదంబరమాది క్షేత్రాల విషయంలో గూడ చెప్పి ఉంది.

భ: ఇచటి పుట్టుక చావులే ముక్తిప్రదా లెట్లౌతాయి? ఇది అర్థం అవడం కష్టంగా వుంది.

మ: దర్శనా దభ్రసదసి, జననాత్కమలాలయే

కాశ్యాంతు మరణాన్ముక్తిః స్మరణాదరుణాచలం.

చిదంబర దర్శనం, తిరువారూరు జన్మము, కాశిలో మరణం, అరుణాచల స్మరణం -- నిశ్చయంగా ముక్తిదాయకాలు.

'జననాత్ కమలాలయే' - కమలాలయంలో పుట్టుక. కమలాలయం - హృదయం, అలాగే అభ్రసదసి - చైతన్యస్థానము. కాశి - ఆత్మప్రకాశం, 'అరుణాచల స్మరణం'తో శ్లోకం పూర్తి అవుతుంది. దానినట్లే అర్థం చేసుకోవాలి కూడా.

భ: అంటే భక్తి అవసరం.

మ: అంతా దృష్టిమీద ఆధారపడి ఉంది. 'చిదంబరం చూచి, తిరువారూరులో పుట్టి, కాశిలో మరణించి, అరుణాచలాన్ని స్మరించి, ముక్తిపొందగలరని ఒకరి దృష్టి'.

భ: నే నరుణాచలాన్ని ఎన్ని మారులో స్మరించాను; కాని ముక్తుణ్ణి కాలేదే. మ: దృష్టి మారాలి. అంతే, ఆ దృష్టి మార్పు అర్జుననకెంత చేసిందో చూడు.

అతడు విశ్వాత్మనే దర్శింపగల్గినాడు. శ్రీకృష్ణుడన్నాడు - 'దేవతలూ యతులూ నా చిద్రూపాన్ని చూడ తపిస్తారు. వారి కోరికను నేను తీర్చలేదు. కాని నాయా ఆకృతిని చూడజాలిన దివ్యదృష్టిని నీకిస్తున్నాను, చూడు' అన్నాడు. గాని నిజంగా స్వస్వరూపం చూపాడా? లేదు. అర్జుననకు ఏమేమి కావాలో వానినెల్ల అందు చూడమన్నాడు. అదే అతని యథార్థ పూర్ణస్వరూపమైతే దానికి మార్పుండరాదు. అదెంత అమోఘమో తెలిసియుండాలి. దాన్ని చూపక, అర్జునుని కోరిక మేరకే చూడ నాదేశించాడు. కాబట్టి ఆ విశ్వరూపమున్న దెక్కడ? అర్జునుడి లోపలే ఉండాలి.

అంతేగాదు. ఆ విశ్వాకృతిలో అర్జునుడు చూచిన దేవతలూ, యతులూ పరమాత్మను స్తుతిస్తున్నారు. శ్రీకృష్ణుడన్నట్లు దేవతలకూ యతులకూ కూడా చూపని ఆ రూపంలో అర్జును డాలోకించిన ఆ దేవతలూ యతులూ ఎవరు?

భ: వారిని అర్జునుడు ఊహించి వుంటాడు.

మ: అర్జునుని దృష్టియే వారి ఉనికి కాధారం.

భ: అయితే, ఆ విశిష్ఠ దృష్టికి దైవానుగ్రహం కావాలి.

మ: అవును. అది భక్తులకు లభిస్తుంది.

భ: ఒకనికి కలలో పులి కన్పిస్తుంది; భయపడి మేల్కొంటాడు. కలలోని పులి కలలోని అహంకారానికి భయం గొల్పుతుంది. కల గాంచినవాడు మేల్కొన్నప్పుడు కలలోని అహంకారం కానరాదు; మేల్కొన్న అహంకారం కనిపిస్తుంది. అదెలా?

ఆ మ: దాని అర్థం అహంకారం సమమని, స్వప్న జాగ్రత్ సుషుప్తులు అదే అహంకారానికి కలిగే మార్పులు, తాత్కాలిక దశలు.

భ: మనస్సు స్థానమిది యని నిశ్చయించలేము. ఈ కష్టం అందరికీ అనుభవమే.

మ: మనస్సుతో మనస్సును ఎప్పుడూ కనుగోలేవు. దాన్ని అధిగమించు. అప్పుడు తెలిసికొంటావు, మనస్సే లేదని.

భ: కాబట్టి సూటిగా అహంకారాన్ని వెదకాలి. అంతేనా?

మ: అంతే.

మనస్సు, అహంకారం, బుద్ధి - ఆలోచనలు అహంకారానికే. ఇవన్నీ ఒకే అంతఃకరణకు వేర్వేరు పేర్లు. మనస్సు ఆలోచనల సమాహారము. ఆలోచనలు అహంకారానికే. ఇట్లు అన్ని ఆలోచనల్లోనూ "నేను" ఆలోచన వ్యాప్తమై వుంటుంది. ఆ "నేను" మూలము వెతుకు, ఆలోచనలు మాయమౌతాయి.

భ ఆపైన మిగిలేది “నేను” కాజాలదు. అది శుద్ధ చైతన్యం

మ: అవును. సుఖాన్ని వెదకుతావు. చివరకు ఆలోచనలే దుఃఖానికి కారణంగా కనుగొంటావు. అవే మనస్సు. మనస్సును వశంచేసుకొనే యత్నంలో నీవు “నేను”ను వెదకి, చివరకు సత్ - చిత్ - ఆనందంలో సుస్థితుడౌతావు.

మరొక భక్తుడు: అయితే మనస్సేమి?

మ: మనస్సు చుట్టూరా పరిధులు కట్టుకొన్న చైతన్యము. అసలు నీవు నిరవధివి, పూర్ణుడవు, తర్వాత నిన్ను నీవు పరిమితం చేసుకొని మనస్సువైనావు.

భ ఆవరణమంటే అదేనా? అదెట్లు జరిగింది?

మ: ఎవరికా ఆవరణ? అదే అవిద్యన్నా, అహంకారమన్నా, మనస్సన్నా,

భ: ఆవరణ మంటే కప్పు. అది కప్పేదెవరిని? అదెట్లు కలిగింది?

మ: పరిమితియే ఆవరణ. పరిధులను దాటితే ప్రశ్నలే ఉండవు.

# భాషణములు 474

"హృదయం" దీని గురించి చర్చ వచ్చింది. శ్రీభగవాన్ అన్నారు యోగశాస్త్రాలు నాడులు 72,000 అని, 101 అనీ అన్నవి. ఈ రెంటినీ సమన్వయిస్తూ ముఖ్యనాడులు 101, అవి 72,000గా విభజించబడ్డాయి అన్నారు. కొందరి మతంలో వీని కన్నిటికీ మూలము మెదడు. మరికొందరి కది హృదయం. ఇంకా కొందరు మూలాధార మన్నారు. మూలాధారం నుండి పరానాడి వెడలి సుషుమ్న ద్వారా సహస్రారానికి పోయి, అక్కడనుండి హృదయానికి దిగుతుందని ఒక మతం. అట్లుగాదు, సుషుమ్న పరానాడిలో లయిస్తుందని మరొక వాదం. ఆత్మస్థానాన్ని సహస్రారంలో వెదకమన్నారు. కొందరికది భ్రూమధ్యంలో, మరికొందరి కది హృదయం, ఇతరులకది మణిపూరం. పరానాడీ ప్రవేశమే ఆత్మజ్ఞానమయితే దాన్ని హృదయం నుండీ ప్రవేశించవచ్చు. కాని యోగి, నాడీ శుద్ధి చెయ్యడంలో తత్పరుడు. అప్పుడు కూడలిని ఉద్బుద్ధమై మూలాధారం నుండి సహస్రారం వరకు పోతుంది. ఆ తరువాత అక్కడినుండి క్రిందికి దిగి హృదయానికి చేరడం యోగంలో చిట్టచివరి ఘట్టం అన్నారు.

వేదాలు హృదయాన్ని అధోముఖ పద్మకోశ ప్రతీకాశం (క్రిందకు తిరిగి ఉన్న తామర మొగ్గ వంటిది), కదళీ మొగం (అరటిమొగ్గ) అని వర్ణించాయి. అధోముఖాగ్రంలో నీవార శూకమువలె (వరిగింజ కొన) సన్ననిది, అణురూపముగ ఒక బిందువు భాసిస్తున్నది.

ఆ బిందువు వహ్ని శిఖాసమము. ఆ శిఖా మధ్యంలో పరమాత్మ వ్యవస్థితుడు. ఆ హృదయమేది? శరీర శాస్త్రజ్ఞులు తెల్పేదేనా? అలా అయితే వారికి అన్నీ తెలిసినట్లే.

కాని ఉపనిషత్తులు పేర్కొనే గుండె వేరు. అది హృదయం. అంటే ఇదే అన్నింటికీ కేంద్రం. అంటే అందులోనే మనస్సు జనించడం, అణగిపోవడం. అదే ఆత్మస్థానం. ఆత్మ అనగానే జనులు దాన్ని దేహంలో భాగంగా గణిస్తారు. దానిలో ఆ ఆత్మ ఎక్కడికేగిందంటే, అది దేహంలోనే ఉంటుందనీ చీకటి గదిలో బంధితునికివలె, దానికీ దేహమూ పరిసరాలూ తెలియవని అనుకొంటారు. అట్టివారికి ఆత్మస్థానం దేహంలోనే ఎక్కడో ఉందని చెప్పాలి. ఆ కేంద్రాన్ని హృదయమన్నారు. దాన్నే వీరందరూ శరీరావయవాల్లో నొకటిగా భావించారు. కలగన్నవాడు తన్ను (అహంకారంగా, ద్రష్టగా) తన పరిసరాలను సృష్టిస్తున్నాడు. తర్వాత అవన్నీ వానిలోనే అణగిపోతాయి. ద్రష్టతో సహా ఏకమనేకమైంది. అలాగే జాగ్రత్తులో గూడ ఒకడనేకుడౌతాడు. విషయ ప్రపంచము నిజానికి ద్రష్ట ప్రపంచం. ఖగోళ శాస్త్రజ్ఞుడు తానొక కొత్త నక్షత్రాన్ని కనుగొన్నాననీ, అది గుణింపరానంత దూరంలో ఉందనీ, దాని కాంతి భూమినిచేరడానికి కొన్ని వేలకాంతి సంవత్సరాలు పడుతాయనీ ప్రకటిస్తాడు. నిజంగా ఆ నక్షత్ర మున్నదెక్కడ? ఆ చూచిన శాస్త్రజ్ఞుని యందు కాదా? ఆ మాటంటే జనులకాశ్చర్యం, సూర్యునికన్న పెద్దదైన గోళం, అంత దూరంలోనిది ఒక్క మానవమాత్రుని మెదడులోని కణములలో ఇముడుతుందా యని. అంతరాళం, ఆకాశ పరిమాణాలు. మేధా పరిమితి - ఈ జటిలాలన్నీ మనస్సు లోనివి. అవి అక్కడెట్లున్నాయి? అవి నీకు తెలిసిన మేరకు వానిని ప్రకాశింపచేసే కాంతి నొకదాన్ని ఒప్పుకోవాలి. ఈ తలపులన్నీ నిద్రలో వుండవు. కానీ నీ మెలకువతో అవి మేలుకొంటాయి. కాబట్టి ఈ కాంతి క్షణభంగురము, ఆది అంతములు గలది. ఆత్మచైతన్యం శాశ్వతము, నిరతము. ఇదిపై పేర్కొన్న కాంతిగాడు, అది వేరు. కాని దానికి స్వతహాగా ఉనికిలేదు. కాబట్టి అది ఆభాసమే. (ప్రతిఫలించిన కాంతి) అట్లే ఖగోళజ్ఞాని మేధలోని నక్షతకాంతి జ్ఞానం, ఆభాస సంవిత్ ప్రతిఫలించిన జ్ఞానము) లేక ఆభాస సత్ ప్రతిఫలించిన ఉనికి) యథార్థ జ్ఞానం (సంవిత్) లేక ఉనికి (సత్) మధ్యం అంటే హృదయంలోనిది. నిద్రనుంచి మేల్కొన్నప్పుడది తలలో ప్రతిఫలిస్తుంది; తల బల్లపరపుగా ఉండక నిలువుగా లేస్తుంది. అక్కడినుండి చైతన్యం శరీరమంతా ప్రసరిస్తుంది. అధ్యారోప 'అహము' 'జాగ్రత్ సత్'గా వ్యవహరిస్తుంది.

మెదడులోని శుద్ధకాంతియే శుద్ధమనస్సు. తర్వాత కలుషితమైనప్పుడు అది సాధారణంగా మనమెరిగిన మలిన మనస్సు.

ఇవన్నీ ఆత్మలోనివే. దేహము, దాని ప్రత్యంగమూ ఆత్మలోనే "" ఉన్నాయి. అందరూ సామాన్యంగా అనుకున్నట్లు ఆత్మ దేహానికి పరిమితం కాదు.

## భాషణములు 475

వార్తాపత్రికలో ఒక వార్తను శ్రీభగవాన్ చదివి వినిపించారు - అటవీశాఖలో ఒక రక్షకుడు తన తుపాకితో అడవిలో పోతూండగా పొదలమాటున నేవో రెండు మెరుస్తూ కనిపించాయి. దగ్గరకు పోయి చూడగా అవి భయంకరమైన పులికండ్లు. తనకు దానికీ కొలది గజాలే ఎడం. హడలుకొని తుపాకి ఆవల పారవేసి పులి ఎదుట ప్రార్థిస్తున్నట్లుగా ఉండిపోయాడు. పులి లేచి నిల్చొని వాని నేమి చేయకుండా మెల్లగ కదలిపోయింది.

## భాషణములు 476

ఒక క్రైస్తవ మిషనరీ డాక్టర్ స్టాన్లీజోన్స్, మహర్షిని చూడవచ్చాడు. అతడు అనేక గ్రంథాలు వ్రాసినవాడు; ఉపన్యాసాలిస్తుంటాడు. ఉత్తర భారతదేశంలో అతని అధీనంలో రెండు ఆశ్రమాలున్నాయి. ఆయనతో మరొక పెద్దాయన, ఇర్వురు స్త్రీలూ ఉన్నారు. జోన్స్ అప్పుడు 'భారతీయ పథములో (ఆన్ ద ఇండియన్ రోడ్) అనే పుస్తకం వ్రాయటానికై విషయం సేకరిస్తున్నాడు. అతనికి భారతీయుల మార్గాలేవో, వారి దివ్యానుభూతులెట్టివో తెలిసికొనవలెనని కోరిక. ఆయనకూ మహర్షికి నైన సంవాదానికిది సారాంశము.

భ: మీ అన్వేషణ ఏమి? గమ్యమేమి? మీ సాధన ఎంతవరకు ముందుకు వెళ్ళింది?

మ: గమ్యమందరికీ ఒకటే. కాని గమ్యానికై వెదకనవసరమేమో చెప్పగలరా? ఇప్పుడున్న స్థితి మీకెందుకు తృప్తినీయడం లేదు.

భ: అంటే గమ్యమే లేదంటారా?

మ: అనను. కాని ఎందుకు గమ్యాన్ని వెదుకుతున్నావు? ఇది మీ కెదురు ప్రశ్న. సమాధాన మివ్వవలసింది మీరు.

భ: ఇట్టి విషయాలపై నా అభిప్రాయాలు నాకున్న వనుకోండి. మహర్షి ఏమనుకుంటున్నారో తెలిసికోవాలని కోరిక.

మ: మహర్షి తీర్చుకోవలసిన సంశయాలేవి లేవు.

భ: మనస్సు అధమగతినుంచి ఉత్తమస్థితికి చేరి, భూమిపై స్వర్గరాజ్యం సుప్రతిష్ఠితం కావడం నా గమ్యం. అధమగతి మనస్సు అసంపూర్ణం. అది ఉత్తమ మనస్సంగతివల్ల పూర్ణమై శుద్ధం కావాలి.

మ: అంటే అధమగతి మనస్సుందనీ, అది అపూర్ణమనీ, అది శుద్ధమూ, పూర్ణమూ కావడానికి ఉత్తమానుభూతి నన్వేషిస్తుందని అంగీకరిస్తున్నారు. ఆ అధమ మనస్సు ఉత్తమానికి వేరా? ఒకదాన్ని కాదని రెండవది స్వతంత్రంగా ఉండగలదా?

భ: జీసస్ క్రీస్తు ఆ స్వర్గరాజ్యాన్ని క్రింది భూతలంలో అవతరింప చేసాడు. అతడు మూర్తిగొన్న స్వర్గమని నేను నమ్ముతాను. అందరూ అట్లే అనుభవం పొందాలని నా అభిలాష, 'పరుల ఆకలి నా ఆకలి' ఇత్యాదివి ఆయన సెలవిచ్చాడు. స్వారాజ్యమంటే సుఖదుఃఖాల్లో పరస్పర భాగస్వామ్యం, ఆ స్వారాజ్యం విశ్వజనీనమైతే ప్రతివాడు ఇతరులతో సమతనెంచుతాడు.

మ: మనస్సులో ఉచ్చనీచాలు, సుఖదుఃఖాలూ ప్రస్తావించావు. ఈ భేదాలన్నీ నిద్రలో ఏమైనాయి?

భ: కాని నేను బాగా మేల్కొనే ఉండగోరుతున్నాను.

మ: ఇప్పుడు 'బాగా మేల్కొన్న' స్థితిలోనే ఉన్నావా? లేవు. నీ స్థితి చిరంతన నిద్రలోని స్వప్నమాత్రం. ప్రపంచాన్ని, విషయాలనూ వ్యవహారాలనూ కలలగంటూ అందరూ నిద్రలోనే ఉన్నారు.

భ: ఇదంతా వేదాంతం. నాకక్కర లేదు. ఈ భేదాలు ఊహా కల్పితాలు కావు. అవి యథార్థాలు. అయితే మహర్షి పలికే ఆ యథార్థ జాగ్రత్ ఏమిటో ఆ విషయంగా మహర్షి అనుభూతియేమో తెల్పుతారా?

మ: జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల మూటికినీ అవ్వలిది యథార్థ జాగ్రత్..

భ: నేను పూర్తిగా నిజంగా మేల్కొనే ఉన్నాను. నిద్రించటం లేదని నాకు చక్కగా తెలుసు.

మ: యథార్థ జాగ్రత్ భేదముల కతీతమైనది.

భ అయితే ప్రపంచ స్థితియేమి?

మ: ప్రపంచం వచ్చి తానున్నానని మీతో చెప్పిందా?

భ: లేదు. కాని అందలి జనులు ఆధ్యాత్మికంగా, సాంఘికంగా నైతికంగా పునరుజ్జీవనం ఎంతైనా ఆవశ్యకమని నాతో అంటున్నారు.

మ: ప్రపంచాన్ని, అందలి జనులనూ చూచేది నీవు. వారు నీ ఆలోచనలు. ప్రపంచము నీకు భిన్నంగా ఉండగలదా?

భ: అందు నేను ప్రేమభావంతో ప్రవేశిస్తాను.

మ: ఆ ప్రవేశానికి పూర్వం నీవు దానికి వేరుగా వున్నావా?

భ: దానితో ఒకటే అయినా నేను వేరుగా వుంటాను. నేను మహర్షి నడగటానికి వారి భాషణలు వినడానికి వచ్చాను, వారు నన్ను ప్రశ్నించేదెందుకు?

మ: మహర్షి సమాధానం ఇవ్వనే ఇచ్చారు. ఆ సమాధానం ముక్తసరిగా ఇంతే - 'యథార్థ జాగ్రత్లో భేదాలకు తావులేదు'.

భ: అట్టి అభేదం విశ్వజనీనం కాగలదా?

మ: అక్కడ భేదము లెక్కడివి? దానిలో వ్యక్తులే లేరు.

భ: మీరు గమ్యం అందుకున్నారా?

మ: గమ్యం ఆత్మకన్న భిన్నం. దానిని క్రొత్తగా పొందవలసిందీ లేదు. అట్లు పొందేదయితే అది స్థిరమూ, శాశ్వతమూ కాజాలదు. క్రొత్తగా కనబడేది కనబడకా పోతుంది. గమ్యం లోనిది, నిత్యమూ అయి ఉండాలి. దానిని నీలోనే కనుక్కో

భ: మహర్షి అనుభవమేమో తెలియగోరుతాను.

మః మహర్షికి ఎట్టి జ్ఞాన ప్రకాశనమూ అక్కరలేదు. ఆ ప్రశ్న పృచ్ఛకుని కేవిధంగాను ఉపయోగపడదు. నా కాత్మసిద్ధి అయిందో లేదో, పృచ్ఛకుని ప్రమేయం కాదు.

భ: అట్లు కాదు. ప్రతివాని అనుభవంలోనూ మానవాళి కుపయోగించే అంశాలుంటాయి. అందువల్ల తమ తమ అనుభవాలను పరస్పరం పంచుకోవచ్చు. మ: ప్రశ్నించేవాడు తన సంశయాలను తానై పరిష్కరించుకోవాలి. అందువల్ల

తనను తానే ప్రశ్నించుకోవటం ఉత్తమం.

భ: నా ప్రశ్నకు సమాధానం నాకు తెలిసే ఉంది.

మ: ఏదీ చెప్పండి.

భ: ఇరవై ఏండ్ల క్రితం స్వర్గరాజ్యాన్ని నాకు చూపించారు. భగవద నుగ్రహం వల్లనే అది జరిగింది. నా యత్నమేమీ లేకనే అది జరిగింది. నేనెంతో సంతోషించాను. దాన్ని విశ్వజనీనంచేసి, సాంఘిక ప్రయోజనాలకై మలచి, నైతికోద్ధరణకు అనువుగా తీర్చాలని నా కోరిక. ఆ సందర్భంలోనే మహర్షి దివ్యానుభూతి ఎట్టిదో తెలిసికో గోరుతున్నాను.

శ్రీమతి జినరాజదాసా జోక్యం చేసుకొని మృదువుగా అన్నారు. ఆ స్వారాజ్యమును భూతలంలోనే మహర్షి అందచేసారని మేమందరం అంగీకరిస్తున్నాము. వారి ఆత్మానుభూతిపై నీ ప్రశ్న లేమి, సమాధానాలకై నీ

యనురోధమేమి? ఆ అనుభూతిని నీవుగా యత్నించి సాధించుకో. ఆమె మాటల నాయన శ్రద్ధగా విని, కొద్దిగా వాదించి, మళ్ళీ మహర్షిని ప్రశ్నింప నారంభించాడు. ఒకటి రెంటిని అడగనిచ్చి మేజర్ చాడ్విక్ దృఢస్వరంతో

హెచ్చరించాడు - "స్వర్గ రాజ్యం నీలోనున్నది" అంటుంది బైబిల్.

భ: దాన్నెలా సాధించటం?

చాడ్విక్: నీకై మహర్షి దానిని సాధించి పెట్టాలా?

భ: నేనట్లడగలేదు.

చా: స్వరాజ్యము నీలోనిది, నీవలవరచుకోవలసింది.

భ: అది లోననున్నది వినేవారికి మాత్రమే. చా: బైబిల్ 'నీలో' నున్నదేగాని దానికే నియతులూ విధించలేదు.

జోన్స్ తానప్పటికే చాలాకాలం పుచ్చుకొన్నాని, మహర్షికి ఇతరులకూ ధన్యవాదాలు చెప్పి వెళ్ళిపోయాడు.

## భాషణములు 477

శ్రీమతి జినరాజదాసా: స్వప్నంలో సత్యానుభూతిని జ్ఞప్తియుంచుకొనేదెట్లు?

మ: ఇప్పటి నీ మెలకువ, నీ కల, వాని జ్ఞప్తికైన కోరిక - అన్నీ ఆలోచనలే. మనస్సు మేల్కొన్న తరువాతే అవన్నీ. మనస్సు లేనప్పుడు నీవు లేవా?

భ: వున్నాను.

మ: నీ వునికియే నీ ఆత్మానుభూతి కూడా.

భ: అది నాకు బుద్ధి గోచరమౌతున్నది. సత్యం పలుమార్లు మెరపులాగా

క్షణం కనుపించి క్షణంలో మరుగౌతున్నది. అది నిలుకడగా లేదు.

మ: అట్టి ఆలోచనలు నీ నిత్యాత్మస్థితికి ప్రబలావరోధాలు.

భ: శ్రమా ఒడిదొడుకుల తోడి పట్నవాసం ఆత్మసాధనకు అనువుగా లేదు.

వలసిన నిశ్శబ్దము, ఏకాంతము అరణ్య కుటీరాల్లోనే దొరకగలదు.

మ: పట్టణాల్లో నిర్నిబంధంగా అడవుల్లో బంధితుడుగా అనిపించవచ్చు. అంతా మనస్సులో వుంది.

భ: మనస్సును మాయ అంటారనుకొంటాను.

మ: మాయయంటే ఏమి? మనస్సు సత్యదూరమన్న ఎరుక, మాయ. మనస్సు సత్యంలోనిదే; వేరుగా లేదు. ఇది తెలిస్తే మాయను దాటినట్లే. (తొలిగినట్లే). సంవాదం మరికొంత సాగింది. మెదడు అన్నా మనస్సన్నా ఒకటేనా అని - ప్రశ్నకు భగవానన్నారు -

మనస్సు మెదడును ప్రభావితంచేసే ఒక శక్తి. నీ విచట ఇప్పుడు మేల్కొని ఉన్నావు. ప్రపంచమూ, పరిసరాలయొక్క ఆలోచనలు అన్నీ నీ దేహంలోని మెదడులో వున్నాయి. కలలు కనేటప్పుడు నీవు వేరొక ఆత్మను కల్పిస్తావు. అది స్వప్న కల్పితమైన ప్రపంచాన్ని, పరిసరాలను చూస్తుంది. అంతా నీవిప్పుడు చేసే విధంగానే, కలలోని దృశ్యాలు, కలలోని శరీరం స్వప్న సంబంధమైన మెదడులో వున్నాయి. అవి కల శరీరంలో జరుగుతాయి. ఈ కల శరీరం, ఇప్పటి శరీరంనుండి వేరు. ఆ కల ఇప్పుడు నీకు జ్ఞాపకం వస్తుంది. వాని మెదడులు వేర్వేరు అయినా దృశ్యాలు మనస్సులోనే గోచరిస్తాయి. కాబట్టి మనస్సూ మెదడు ఒకటికావు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మనస్సుకే.

భ: ఇదంతా కేవలం బుద్ధిగోచరమే.

మ: బుద్ధి! ఎవరి బుద్ధి? ఉన్న సమస్య అంతా దానిచుట్టూ అల్లుకొన్నదే. నిద్రలోవలె బుద్ధిప్రమేయం లేనప్పుడు గూడ నీవున్నావన్నది విదితమే. నీ వునికి నీ అనుభవం లోనిది కాకుంటే, నీవున్నావని ఎట్లు తెలిసింది? అందుకే అన్నాను, నీ ఉనికియే అనుభూతియని. నీవు లేని క్షణాన్ని నీవు ఊహించలేవు. కాబట్టి ఆత్మ అనుభూతిలేని క్షణమే లేదు.

## భాషణములు 478

మధురైనుండి ఒకరు - దైవశక్తి నెరిగేదెట్లు?

మ: నీవు "నేను ఉన్నాను" అంటావు అంతే. తానున్నానని అనగలిగేది వేరేది?

తన ఉనికియే దైవశక్తి. నేనిది, నేనది, ఫలానా ఫలానా అన్నప్పుడే వస్తుంది ఇబ్బంది. అట్లేమీ చేయక 'నీవుగా ఉండు'. చాలు.

భ: ఆనందానుభవము ఎలా పొందేది?

మ: ఆనందానుభవం లేదనుకోటం మాని వేయడం ద్వారా.

భ: మనోవృత్తులనుండి వీడిపోవడం అన్న మాట.

మ: అనేక మనోవృత్తులు లేకుండా, ఒకే మనోవృత్తిలో ఉండడం.

భ: కాని ఆనందం అనుభవం కావాలి కదా?

మ: నిన్ను నీవు మరవకుండటం వల్ల వచ్చేదే ఆనందము. నీ నిజస్వరూపాన్నిis కాదని ఎలా ఉండగలవు? అది ప్రేమకు మూలస్థానం. ప్రేమయే ఆనందం. ఆనందస్థితికి ప్రేమస్థితికి తేడాలేదు.

భ: నేను సర్వవ్యాపిగా ఎట్లుండగలను?

మ: సర్వవ్యాపివి కావన్న యోచన వదలివేయి. భ: వేర్వేరు విషయాలంతటిలో వ్యాపించేదెలా?

మ: అవి "నేను"కు వేరుగా ఉన్నవా? తామున్నామని అవి నీతో అంటున్నాయా? మొదట నీవు ఉన్నావు. తర్వాత అవి ఉన్నట్లు చూస్తావు. తాను లేక అవి లేవనే జ్ఞానమే అంతటా వ్యాపించి ఉండడం అంటే. 'నే నీ దేహాన్ని, నాలో ఏదో ఉంది' అనే భావనవల్ల భిన్నభిన్న వస్తువులు నీకు వెలిగా ఉన్నట్లు, చూస్తావు. అవి నీలోనే ఉన్నవని గుర్తించు. నూలు లేక వస్త్రముండునా? "నేను" లేక విషయములుండగలవా?

## భాషణములు 479

భ: అన్ని మతాలలోనూ ఉత్తమమేది? భగవాన్ పద్ధతి ఏమిటి?

మ: అన్ని మతాలూ, అన్ని పద్ధతులూ సమానమే.

భ: ముక్తికి వేర్వేరు మార్గాల బోధిస్తారే.

మ: ముక్తి నీకెందుకు? ఇప్పుడున్నట్లే ఉండరాదా?

భ: దుఃఖనివారణ నేను కోరేది. దుఃఖాభావము మోక్షమన్నారు.

మ: అన్ని మతాలూ చెప్పేదీ అదే.

భ: కాని సరియైన మార్గమేది?

మ: వచ్చినదారినే వెనుక్కుపోవడమే.

భ: ఎక్కడినుండి వచ్చాను?

మ: నీవు తెలిసికొనవలసిందే అది. నీవు నిద్రిస్తున్నప్పుడీ ప్రశ్నలు వచ్చాయా? నిద్రలో నీవు లేవా? అప్పటి నీవే కదా ఇప్పుడు మాట్లాడుతున్నది?

భ: అవును. నేను గాఢ నిద్రలో వున్నాను; నాలాగే మనస్సు గూడా. కాని నా ఇంద్రియాలడగియున్నాయి, మాట్లాడలేకపోయాను.

మ: నీవు జీవుడవా, మనస్సువా? నిద్రలో మనస్సు తనకు తాను నీకు తెలియజేసుకొందా?

భ: కాని పెద్దలు జీవేశ్వరులకు భేదం చెబుతున్నారు.

మ: ఈశ్వరునిమాట యెందుకులే. నీ సంగతి చెప్పు.

భ: నా సంగతి ఏమి? నేనెవరు?

మ: తెలియవలసిందే అది. అది తెలిస్తే అన్నీ తెలిసినట్లే. తెలియకుంటే అప్పుడడుగు.

భ: మేల్కొన్నంతనే జగత్తును చూస్తాను. నిద్రకూ, ఇప్పటికీ, నాలో ఏ మార్పూ లేదు.

మ: కాని అట్లని నీకు నిద్రలో తెలియదు. ఇప్పుడూ అప్పుడూ నీ వొకడవే. మరి ఇప్పుడు మారిందెవరు? నీ స్వభావం మారుతుండాలా లేదా మారకుండానే ఉండాలా?

భః ప్రమాణమేమి?

మ: తానున్నాని ఒకనికి ప్రమాణం కావాలా? నీవున్నావని తెలుసుకో. చాలు, మిగతవన్నీ తెలుస్తాయి.

భ: అట్లయితే ద్వైతులకూ అద్వైతులకూ ఎందుకీపోరు?

మ: ఎవరి పని వారు చూసుకుంటే, ఏ పోరూ ఉండదు.

## భాషణములు 480

ఒక యూరోపియన్ వనిత, శ్రీమతి గాస్క్, భగవానొకొక పత్ర మందించింది. దానిలో నిట్లుంది -

"మాకు మీ సన్నిధి లభింపజేసినందుకు ఆ ప్రకృతికీ, సర్వజ్ఞతకూ ఎంతో కృతజ్ఞులము. జగద్వ్యాపారాదులకునూ, దాని కతీతమైన నిత్యతకూ ఆధారమగు శుద్ధ సత్యమే ప్రాతిపాదికగా తమ ప్రవచన జీవనములు సాగుట మాకెంతో హర్షము చేకూర్చుతున్నది. "నిశ్చలంగా ఉండు, అది తెలుసుకో" అన్న మీ హెచ్చరిక ఎంత సుఖదమోకదా!"

ఆ తర్వాత శ్రీమతి గాస్క్ ప్రశ్నించింది

ఈ ప్రపంచ భవిష్యత్తు ఎలా ఉంటుందంటారు?

మ: సమాధానం నీవిచ్చిన పత్రంలోనే ఉందే. 'నిశ్చలంగా ఉండు. నేను దైవాన్నని తెలుసుకో'. నిశ్చలత అంటే ఆలోచనలు లేకుండటం.

భ: నా ప్రశ్న కది సమాధానం కాదు. ఈ భూమికి ఒక భవిష్యత్తు ఉంది కదా. అది ఏ విధంగా ఉంటుంది?

మ: దేశకాలాలు ఆలోచనా ఫలితాలు. ఆలోచనలు లేకపోతే భూమీ లేదు భవిష్యత్తూ లేదు.

భ: వానిని గూర్చి ఆలోచించకపోయినా దేశకాలాలు ఉంటాయి..

మ: అలా అవివచ్చి నీకు చెప్పాయా? అలాగే నిద్రలో భావిస్తున్నావా?

భ: నిద్రలో నా కెరుక లేదు.

మ: అయినా నీవుండనే వున్నావు.

భ: అప్పుడు నేను దేహంలో లేను. ఎక్కడికో పోయియుండి, మేల్కొనే తరుణానికి లోనికి గెంతివచ్చాను.

మ: నీవు వెలుపలికి వెళ్ళటం, లోనికి గెంతటం రెండూ భావనలే (ideas) నిద్రలో నీవెక్కడున్నావు? ఇప్పుడెట్లో అప్పుడూ అట్లే వున్నావు. కాకుంటే నిద్రలో ఏ ఆలోచనలూ లేవు; అంతే.

భ: ప్రపంచంలో యుద్ధాలు జరుగుతున్నాయి. మనం వానిగూర్చి ఆలోచించకపోతే అవి ఆగిపోతాయా?

మః నీవు వాని నాపగలవా? ప్రపంచాన్ని సృష్టించినవాడే వాని విషయం చూసుకొంటాడు.

భ: దైవం జగత్తును సృజించాడు. నేటి ప్రపంచ స్థితికి బాధ్యుడు ఆయనగాదు, ప్రస్తుత స్థితికి బాధ్యత మనదే.

మ: నీవు యుద్ధమాపగలవా, ప్రపంచాన్ని సరిదిద్ద గలవా?

భ : లేదు.

మ: నీకు సాధ్యం కాని దానికై నీకీ చింత ఎందుకు? నీ విషయం నీవు చూచుకో; ప్రపంచం, దాని విషయం అది చూచుకుంటుంది.

భ: మేము శాంతి వాదులము. శాంతి నెలకొల్పవలెనని మా అభిలాష.

మ: శాంతి ఎప్పుడూ ఉంది. దానికి అడ్డులన్నీ తొలగించు. ఇది ఆత్మశాంతి. ఆలోచనలే ఆటంకాలు. అవి వదలిన నాడు నీవు అపార జ్ఞానము. అంటే ఆత్మవు. అచట పూర్ణత, శాంతి వెలసియుంటాయి.

భ: ప్రపంచానికొక ఉజ్జ్వల భవిష్యత్తుండాలి.

మ: అది ప్రస్తుత మెట్లున్నదో తెలుసా? ప్రపంచము మిగిలినదంతా కలిపి సర్వమూ ప్రస్తుతము, భావిలో గూడ ఒక్కరీతిగానే ఉంటాయి.

భః భూతాకాశంతో (ఈథర్), అణువులతో, బుద్ధి నిమిత్తకారణంగా ఈ ప్రపంచం చేయబడింది.

మ: వానినన్నిటిని సంగ్రహించి శక్తియని, ఈశ్వరుడని అన్నారు. ఇప్పుడు వానికి వేరుగ నీవు లేవు. వారికి నీకూ గూడ కారణమైన బుద్ధి ఒక్కటే.

కొన్ని నిమిషాల తర్వాత ఒకామె అడిగింది - మీరెప్పుడైనా అమెరికా పోవాలనుకున్నారా?

మ: ఇండియా ఎక్కడ ఉందో అమెరికా అక్కడే ఉంది. (ఆలోచనా తలంలో).

ఒక స్పానిష్ వనిత - హిమాలయంలో ఒక గుడి యుందట. దానిలో అడుగిడగానే ఏవో వింత స్పందనాలు కలిగి అన్ని జబ్బులూ నయమౌతాయట.

అది సాధ్యమేనా?

మ: నేపాలులోనో, మరియు హిమాలయాల్లోనో కొన్ని ప్రదేశాల్లో ఏదో గుడి వుందట అందులో ప్రవేశించగానే స్పృహ తప్పిపోతుందనీ అంటారు.

## భాషణములు 481

మురుగనార్: ప్రజ్ఞానమంటే ఏమి?

మహర్షి: ప్రజ్ఞానము, కేవలజ్ఞానం. దానిలోనుండి వెడలేది విజ్ఞానం, అంటే సాపేక్ష జ్ఞానం.

భ: విజ్ఞాన దశలో సంవిత్ (విశ్వచైతన్యం) విదితమౌతుంది. ఆ శుద్ధ సంవిత్ అంతఃకరణాలసాయంలేక తానై ఎరుకగా ఉండగలదా?

మ: అవును. అది తార్కికంగా చూసినా సరే.

భ: జాగ్రత్తులో విజ్ఞానంవల్ల సంవిత్ తెలుసుకొనే వేళల్లో, ప్రజ్ఞానం స్వయంగా భాసించదు. అలా అయితే అది నిద్రలో గోచరించవలెగదా?

మ: ఇప్పుడు ఎరుక అంతఃకరణాలవల్ల కల్గుతోంది. ప్రజ్ఞానం సర్వదా, నిద్రలో సైతం వెలుగుతూనే ఉంటుంది. మెలుకువలో ఎరుక ఎప్పుడూ ఉంటే నిద్రలో గూడ అట్లే వుంటుంది.

ఉదా: రాజు దర్బారులోకి వచ్చి కూర్చుండి తిరిగి వెళ్ళిపోయాడు. అతడు వంటయింటిలోకి వెళ్ళలేదు. ఆ కారణంగా రాజిక్కడికి రాలేదనవచ్చునా? చైతన్యం మెలుకువలో ఉంటే, నిద్రలోనూ ఉండవల్సిందే.

## భాషణములు 482

ఇండోర్ నుండి డాక్టర్ పాండె వచ్చారు. తన సందేహాలు తీర్చుకొన ప్రశ్నించ అనుమతివేడి, ఆత్మసిద్ధికి ఆచరణ యోగ్యమైన పద్ధతిని తెలియగోరాడు.

మ: కళ్ళకు గంతకట్టి ఒకతన్ని అరణ్యమధ్యంలో వదిలారు. ఎదురు తగిలిన ప్రతివారినీ గాంధార నగరానికి దారినడుగుతూ చివరకక్కడికి చేరుకున్నాడు. ఆ విధంగా అన్నిదారులూ ఆత్మస్థితికి చేర్చేవే. అందరికీ గమ్యమదే, అన్ని దారులూ అట చేరటానికి సాయపడేవే.

భక్తుడు: ప్రతీక ఏదన్నా ఉంటే ధ్యానం సులువు. కాని విచార మార్గానికి ప్రతీక ఏదీ లేదే.

మ: ఆత్మ ఉందని ఒప్పుకుంటావు. ప్రతీకను చూసి ఆత్మయిది అంటావా? ప్రాయశః దేహాన్ని నీవు ఆత్మయనుకుంటావేమో. కాని నీ గాఢ నిద్రను గుర్తుంచుకో. అప్పుడూ నీవున్నావు. అక్కడ నీ ప్రతీక యెట్టిది? కాబట్టి ప్రతీకలేకనే ఆత్మానుభవం కలగవచ్చు.

భ: నిజమే. ఆ మాటల్లోని బలం బోధపడుతూనే ఉంది. అయినా మంత్రాదులు సాయపడవా?

మ: సహాయం చేస్తాయి. మంత్రమంటే యేమి? నీవా అక్షరాల శబ్దాన్నిమాత్ర మెన్నుతున్నావు. దానిని జపిస్తుంటే మిగిలిన ఆలోచనలు అన్నీ మాయమౌతాయి. మంత్రజపం ఒక్కటే మిగులుతుంది. చివరకి అది కూడా ఆగి అచ్చట మంత్రస్వరూపమైన అనంతాత్మ మిగులుతుంది.

మంత్ర, భక్తి, ధ్యానాదులన్నీ సహాయకాలే. తుదకవి ఆత్మ, అంటే స్వస్వరూపం దరికిజేరుస్తాయి.

కొంతసేపాగి, మహర్షి చెప్పసాగారు. ప్రతి ఒక్కరూ ఆత్మయే, అనంతమగు ఆత్మయే. అయితే కూడా ఆత్మను దేహంతో అన్వయించుకుంటున్నారు. దేన్ని తెలిసికోవలెనన్నా కాంతి కావాలి. అంటే భాసక శక్తి జ్యోతిరూపంలో ఉండాలి. కాని అది భౌతికములైన వెలుగుచీకట్లనే ప్రకాశింపచేస్తున్నది. ఆ ఆద్యజ్యోతి స్థూలంగా చీకటివెలుగులను చూపే కాంతికి అవ్వలిదిగా ఉండాలి. అది తాను వెలుగూకాదు, చీకటీ గాదు. కాని ఆ రెంటినీ తెలియచేస్తుంది గనుక, దానిని జ్యోతియనే అంటారు. అది అనంతమై శుద్ధచైతన్యముగా మిగిలియుంటుంది. చైతన్యమంటే అందరికీ తెలిసియున్న ఆత్మ. ఆత్మకెవ్వరూ దూరంకారు. కాబట్టి ప్రతియొక్కడూ ఆత్మానుభూతి కలవాడే. ఇంతటి ప్రముఖ విషయాన్ని తెలియక ప్రతివాడూ ఆత్మానుభవాన్ని క్రొత్తగా వాంఛించటం అనూహ్యమైన వింత. ఈ అజ్ఞానానికి దేహాత్మబుద్ధి కారణం. తన కనుభవం లేదన్న తప్పు భావనను త్రోసి పుచ్చటమే ఆత్మానుభవము. అది క్రొత్తగ వచ్చేది గాదు. అది శాశ్వతం గనుక అనాదిగనే యుండాలి. అట్లుకానిదైతే దాన్ని సాధించి ఫలమేమి? 'నేను దేహమ'ను 'నాకనుభూతిలే'దనే తప్పు భావనలను తొలగించిన తర్వాత శుద్ధ చైతన్యము, లేక, ఆత్మ మిగిలియుంటుంది. మన ఇప్పటి పరిమితజ్ఞానం, దాన్ని ఆత్మసిద్ధి అంటుంది. నిజంగా అది శాశ్వతము సర్వదాస్థితము. సారాంశం ఆత్మసిద్ధియంటే అజ్ఞాన నిర్మూలనము. దానికి కొంచెం కూడా ఎక్కువ తక్కువలు లేవు.

భ: నా వృత్తి వలన నేను నా ఊర్లోనే ఉండాల్సివస్తుంది. నేను సాధువులు ఉండే ప్రదేశాల్లో ఉండలేను. సత్సంగం లేకుండా నేను ఆత్మసిద్ధి పొందగలనా?

మ: సత్ అంటే అహం ప్రత్యయ సారం (అంటే ఆత్మలకు ఆత్మ అని అర్థం) సాధువు ఆ ఆత్మలకే ఆత్మ. అతడు సర్వాంతర్యామి. ఎవరైనా ఆత్మలేకుండా ఉండగలరా? లేదు. అంటే ఎవరూ సత్సంగం నుండి దూరంగా లేరు.

## భాషణములు 483

సీతారామయ్యయని ఒకరు - పతంజలియోగ సూత్రంలోని 'సంయమనం' అంటే ఏమి? అని అడిగారు.

మ: చిత్తైకాగ్రత.

భ: చిత్తాన్ని హృదయంలో ఏకాగ్రంచేస్తే 'చిత్తసంవిత్' ఫలిస్తుందన్నారు దాని

అర్థమేమి?

మహర్షి: 'చిత్తసంవిత్' అంటే ఆత్మజ్ఞానం.

## భాషణములు 484

భ: ఆత్మవిచారం సఫలం కావడానికి బ్రహ్మచర్యమూ, దీక్షాస్వీకరణమూ గృహస్థుకు గూడ అవసరమనుకుంటాను. కాక, ఆయా సందర్భాల్లో మాత్రమే

బ్రహ్మచర్య మాచరిస్తూ, గురువువొద్ద దీక్షా స్వీకారము చేయవచ్చునా? మ: మొదట ఆ భర్త యెవరో భార్య ఎవరో నిర్ణయించు. అప్పుడీ ప్రశ్నలు
రావు.

భ: ఇతర వ్యవహారాల్లో మునిగియుండి గూడ, మనోవృత్తులను నిరోధించి ఆత్మవిచారం చేయ వీలుందా? కాక, అవి పరస్పరం ప్రతికూలాలా?

ిమ: ఇవి మనోదౌర్బల్యంవల్ల కలిగే ప్రశ్నలు. మనోవృత్తులు అణిగే కొద్దీ వాని బలం అధికమవుతుంది.

భ: కర్మసిద్ధాంతాని కర్థం, ఈ ప్రపంచము క్రియ, ప్రతిక్రియల ఫలము అయితే దేనియొక్క క్రియ, దేని యొక్క ప్రతిక్రియ?

మ: ఆత్మసిద్ధి అయ్యేదాకా కర్మ వుంటుంది. అంటే క్రియ, ప్రతిక్రియ ఆ తర్వాత కర్మ యుండదు, ప్రపంచమూ ఉండదు.

## భాషణములు 485

భ: ఆత్మవిచారంలో ఉండగా నడుమ నిద్రవస్తుంది. దానికి మందేమి?

మ: నామ సంకీర్తనము చేయి. (దేముని పేరును పాడడం)

భ: నిద్రలో అది సాధ్యం కాదే.

మ: నిజమే. జాగ్రత్తులో ఆ అభ్యాసం చెయ్యాలి. నిద్రనుంచి లేచీ లేవగానే దాన్ని చెయ్యి. నిద్రితునికి ఆత్మవిచార మక్కరలేదు, అభ్యసింపవలసిందేమీ లేదు. మెలకువలో ఉన్నవాడే దాన్ని కోరేది, అభ్యసించవలసిందీ.

మాటల సందర్భంలో భగవాన్ చెప్పారు- “మనస్సు దుర్జేయము. దానికి సత్త్వరజస్తమోగుణాలున్నాయి. రజస్తమాలకు విక్షేపాలున్నాయి. సత్వాంశంలో మనస్సు శుద్ధమూ, నిష్కల్మషమూ అందుచేత అక్కడ ఆలోచనలు లేవు. అది ఆత్మసమము. మనస్సు ఆకాశం వంటిది. ఆకాశంలో వస్తువులవలెనే, మనస్సులో ఆలోచనలూ. ఆకాశానికి మనస్సు, విషయాలకు ఆలోచనలు పోలిక. ఎవ్వరూ విశ్వాన్ని కొలవలేరు; విషయాలను లెక్కించనూ లేరు. అది అసంభవం. ఎందుకంటే విషయాలు మనోకల్పితాలు. వానిని కొలచే యత్నం ఎలాంటిదంటే తన నీడలోని తలను తాను త్రొక్కే ప్రయత్నం చేసినట్లే. తాను కదిలే నీడకూడ ముందుకు పోతూనే ఉంటుంది. నీడలోని తలపై కాలు పెట్టేదెలా? (ఇచట భగవాన్ నీడలను గూర్చి కథలెన్నో తెల్పారు. అందు అద్దంలో తమ నీడలు చూచిన కోతుల వెకిలిచేష్టలూ ఉన్నాయి.) ఒక బిడ్డ తన నీడను చూచి నీడతలను పట్టుకోబోతుంది. వంగి తనచేయి చాచేసరికి నీడా ముందుకు కదులుతుంది. బిడ్డ అదే పనిగా యత్నిస్తుంది. చూస్తున్న తల్లి ప్రేమతో బిడ్డ చేయిపట్టి దాని తలమీదే ఉంచి నీడను చూడమంటుంది. విశ్వాన్ని అర్థం చేసుకో యత్నించే అజ్ఞాని సాధకుని గతి, ఆ బిడ్డ స్థితివంటిది. విశ్వం మనఃకల్పిత విషయం దాని ఉనికి మనస్సులోనే. అది యేదో బాహ్యవిషయంగా కొలతకు లొంగదు. విశ్వాన్ని అందుకోవాలంటే ఆత్మనందుకోవాలి.

మనస్సును నిగ్రహించుట ఎలా అని అడుగుతారు. నేనూ వాళ్ళ నడుగుతాను, ఆ మనస్సేదో నాకు చూపండని. ఏం చేయవలెనో అప్పుడు తెలుస్తుంది. నిజంగా చూస్తే మనస్సు కేవలం ఆలోచనల మూట. ఆ విధంగా ఆలోచించిగాని, కోరిగాని దాన్నెలా నాశం చేయడం? నీ ఆలోచనలూ కోర్కెలూ ఆ మనస్సున కంతర్భాగాలే. క్రొత్తక్రొత్త ఆలోచనలతో మనస్సు ఇంకా బాగా బలుస్తుంది. కాబట్టి మనస్సును మనస్సుతో నాశం చేయబూనడం తెలివితక్కువపని. ఆ మనస్సు మూలం వెదకిపట్టుకో. అంతట అది తానై మాయమౌతుంది. చిత్తవృత్తి నిరోధాన్ని యోగం బోధిస్తుంది; నేను ఆత్మవిచారాన్ని చెప్తాను. అది ఆచరణీయం. నిద్రలో, మూర్ఛలో, ఉపవాసాలలో చిత్తవృత్తి నిరోధం సంభవమే. కాని ఆ కారణం తొలగగానే మళ్ళీ ఆలోచనలకు వరదపారటం తప్పదు. అలాంటప్పుడు వానివల్ల ప్రయోజనమేమి? మైకం

వచ్చినప్పుడు శాంతి ఉంటుంది. దుఃఖం ఉండదు. ఆ మైకం పోగానే దుఃఖం మళ్ళీ వస్తుంది. కాబట్టి నిరోధం నిరుపయోగం. దానివల్ల ప్రయోజనం నిలిచేది కాదు.

ఆ నిరోధం వలన ఫలాల్ని స్థిరపరచుకొనే దెట్లా? దుఃఖ కారణాన్ని అన్వేషించటం వల్ల. విషయములవల్ల దుఃఖం. అవి లేకపోతే వాని వలన ఆలోచనలు వుండవు. దుఃఖం తుడుచుకొనిపోతుంది. విషయము లేకపోవుటెట్లని, తరువాతి ప్రశ్న, శ్రుతులూ, యతులూ విషయాలను మనోకల్పితాలంటారు. విషయాలకు తత్త్వతః ఉనికి లేదు. వారి వచనం ఎంతవరకూ నిజమో విచారించు. విషయ ప్రపంచము(objective world) ఆత్మగత చైతన్యం (subjective consciousness) లోనిదని స్పష్టమౌతుంది. జగత్తంతా నిండి, దాన్ని కప్పియున్న ఏకైక సత్యం ఆత్మయే. ద్వితీయం లేదుగనుక, నీ శాంతిని కలత పెట్టు ఆలోచనలు కలుగవు. ఇదే ఆత్మానుభవము. ఆత్మ నిత్యము; దాని యనుభవమూ నిత్యమే.

పై ప్రవచన భాగంగా, భగవాన్ కొన్ని పదాలను విశదం చేశారు -

"ఆలోచనలు కలత కలిగించినప్పుడు తనలోనికి తన్ను ఉపసంహరించుకోవటం, అభ్యాసం. అది చిత్తాన్ని ఏకాగ్రం చేయటంగాని, మనోనాశంగాని కాదు; కేవలం ఆత్మలోనికి ఉపసంహరించుకోవడం మాత్రమే.

ధ్యానభక్తి జపాదులు అనేక ఆలోచనలను అరికట్టే ఉపకరణాలు మాత్రమే. ఒక ఆలోచన మిగిలి, చివరకదీ ఆత్మలో అణగిపోతుంది."

"యోచనలు (ideas) శోషించిన మనస్థితి, ఆత్మస్థితి సదృశం; అని ఉల్లేఖిస్తూ ఆ స్థితిలో అనుభవమే రీతిగా ఉంటుందని ఒకరు అడిగారు. పాలంటన్ ఆ స్థితిని వర్ణింపలేమని వ్రాసాడు అని చదివాడు. సమాధానం. అదేయని అతడే అంగీకరిస్తూ అన్నాడు - "ఇప్పటి అనుభవం అద్దంలో చూచేలాంటిదైతే, అప్పటిస్థితి పాదరసంపూయని అద్దంలో ఏం కన్పిస్తుందో అది."

అట్లు కాదన్నారు భగవాన్. "ఒక నిర్మలమైన అద్దం మరొక శుద్ధమైన అద్దం ఎదుట నుండునటువంటిది, అంటే ప్రతిబింబరహితము."

## భాషణములు 486

శ్రీగణపత్ రామ్ - "నేనెవరు?" కనుగొనేదలా?

మ: 'నేను' రెండా, ఒకటి రెండవ దాన్ని తెలిసికొనేందుకు?

భ: ఆత్మ ఒక్కటే. కాని దానిలో రెండంశాలుండాలి. తానూ సంకల్పమూ (ఆలోచించేవాడు, ఆలోచన)

కొంతసేపాగి అతడే ఆ 'నేను'నెట్లు తెలియునో చెప్పండి. 'నేనెవరు' అని జపించనా?

మ: దాని అర్థం జపం చెయ్యమని కాదు.

భ: 'నేనెవ'రని ఆలోచించాలా?

మ: "నేను" ఆలోచన యొకటి వెలువడుతుందని నీకు తెలుసు. ఆ

"నేను" ఆలోచనను పట్టుకొని దాని మూలాన్ని కనుక్కో

భ: మార్గమేదో తెలిసికోవచ్చా?

మ: నీకిప్పుడు చెప్పినట్లే చేసిచూడు.

భ: నేనేమి చేయవలెనో బోధపడలేదు.

మ: అది ఏమైనా విషయగతమైతే (objective) దారి స్థూలంగా చూపవచ్చును.

కాని ఇది ఆత్మగతము. (subjective)

భ: కాని నా కర్థం కాలేదు.

మ: ఏమి? నీ వున్నావనే విషయం నీకు అర్థం అవడం లేదా?

భ: కృపతో దారి చూపండి.

మా: నీ ఇంటిలోనే నీకు దారి చూపాలా? ఇది నీలోనిది.

భ: నన్నేమి చేయమంటారో సలహాఇవ్వండి.

మ: ఏది మాత్రం ఎందుకు చేయాలి? గమ్మని మాత్రం ఉండు (only keep quiet) ఎందుకలా చెయ్యకూడదు? ఏ వక్త్యైనా తను ఉన్న స్థితిని బట్టి ఏదైనా

చెయ్యాలి.

భ: నాకేది సరియైనదో సెలవీయండి. మీనుండి వినగోరుతున్నాను.

భగవాన్ బదులు పలుకలేదు.

## భాషణములు 487

ఒక ఆంగ్ల యువతి ముస్లిమ్లు చీరలో ముస్తాబై వచ్చింది. ఆమె డాక్టర్ జి.హెచ్. మీస్సు ఉత్తర హిందూస్థానంలో కలుసుకొని ఉండింది.

విజన్ సాంవత్సరిక సంచికలో నుంచి 'నల్లనిరవి' (ద బ్లాక్ సన్) అనే పద్యాన్ని శ్రీ భగవాన్ చదివారు. రచయిత స్వామి భారతానంద. కొంత తర్వాత కుమారి జె. అడిగింది.

భ: చైతన్యంలో లీనమయ్యేదాక ధ్యానం సాగిస్తూనే ఉండవలెనని ఆ పద్యం ధ్వనిస్తుంది. అది సరియేనా?

మ: అవును.

భ: అయితే మరొకటి అడుగుతాను. ఎటనుండి మరలి రాకలేదో, అట్టి స్థితిని తానై కోరి చేరడం సరియేనంటారా? బదులులేదు. ఇంతలో భోజనం గంట మ్రోగింది.

ఆ మధ్యాహ్నం ఆమె -

భ: ఆత్మసిద్ధి లేదా ఆత్మజ్ఞానం యొక్క ఉద్దేశం ఏమిటి? మ: అది పరమగమ్యము. దాని ప్రయోజనమూ అదే.

భ: నా ఉద్దేశం, ఆత్మస్థితి వల్ల లాభమేమి?

మ: ఆత్మసిద్ధి నీ కెందుకు? నీ ప్రస్తుత స్థితితో తృప్తిపడరాదూ. ప్రస్తుత స్థితిలో నీకు తృప్తి లేదని స్పష్టమే. నీ అతృప్తి ఆత్మసిద్ధివల్ల అంతమౌతుంది.

భ అతృప్తిని తొలగించే ఆత్మసిద్ధి స్వభావమేమి? నేనీ జగత్తులో ఉన్నాను. ఇచట ఎన్నో యుద్ధాలు జరుగుతున్నాయి. ఆత్మసిద్ధి వానిని ముగించ గలదా?

మ: జగత్తులో నీవున్నావా? అది నీలో వుందా?

భ: నా కర్థం కాలేదు. నా చుట్టూ ప్రపంచం ఉన్నది నిస్సందేహమే.

మ: ప్రపంచాలూ, అందలి ఘటనలనూ గూర్చి నీవు ప్రస్తావించావు. అది
కేవలం నీలోని ఆలోచనలు, ఆలోచనల స్థానం మనస్సు. మనస్సు నీలో ఉంది.

కాబట్టి ప్రపంచం నీలో ఉంది.

భ: ఈ వాదం నాకు అర్థం కావడం లేదు.

నేననుకొన్నా అనుకోక పోయినా ప్రపంచం ఉండనే ఉంది.

మ: అంటే ప్రపంచం నీ మనస్సుకు వేరుగా ఉందనీ, నీ మనస్సు లేనిపక్షంలో గూడ అది ఉండగలదంటావా?

భ: అవును.

మ: నీ గాఢ నిద్రలో ప్రపంచం ఉందా?

భ: ఉంది.

మ: నిద్రలో దాన్ని చూస్తావా?

భ: నేను చూడను. మెలకువతో నున్న ఇతరులు చూస్తారు గదా?

మ: అట్లని నీకు నిద్రలో తెలుసా, కాక ఇప్పుడు వారికది తెలుసని కనుగొంటున్నావా?

భః నా జాగ్రదావస్థలోనే.

మ: అంటే నీవు చెప్పేవి మేల్కొన్నాక తెలిసిన విషయాలేకాని, నిద్రలోని అనుభవం గాదు. జాగ్రత్ స్వప్నాలు మనస్సు కల్పించినవి. కనుక వానిలో జగం ఉందంటే కాదన నక్కరలేదు. నిద్రలో మనస్సు ఉపసంహృతమై ప్రపంచం

బీజప్రాయంగా ఉంటుంది. మేల్కొన్నప్పుడది మరల విస్తరిస్తుంది. అహంకార ముప్పొంగి శరీరంతో తాదాత్మ్యం చెంది, ప్రపంచాన్ని చూస్తుంది. కాబట్టి ప్రపంచం మనఃకల్పితము.

భ: అదెట్లు సాధ్యం?

మ: కలలో నీవొక ప్రపంచం సృష్టించడం లేదా? జాగ్రత్తు గూడ ఒక స్వప్నమే. అతి దీర్ఘమైనది. జాగ్రత్ స్వప్నానుభవాలకు ఒక ద్రష్ట ఉండాలి. ఆ చూచేవాడెవడు? దేహమా?

భ: దేహం కాజాలదు.

మ: మనస్సా.

భ: అదే ఉండాలి.

మ: కాని మనస్సు లేకున్నా నీవుంటావే?

భ : అదెట్లు ?

మ: గాఢనిద్రలో.

భ: అప్పుడు నేనున్నానని నాకు తెలియదు.

మ: నీవు లేకపోతే నిన్నటి అనుభవాలు నేడెట్లు జ్ఞప్తికి దెచ్చుకుంటావు?

నిద్రలో అహంస్ఫురణకేమైన ఆడ్డు వుంటుందా? “నేను” ప్రవాహంలో ఏదైనా

అడ్డంకివుందా?

భః కావచ్చు.

మ: అట్లైతే జాన్సన్గా నిద్రించి బెన్సన్గా మేల్కొవచ్చు. వాడే వీడని ఎలా

నిర్ణయిస్తారు.

భ: నాకు తెలియదు.

మ: ఈ వాదం బోధపడకపోతే, వేరే విధంగా చూస్తాము. నేను హాయిగా నిద్రించాననీ, గాఢనిద్ర తర్వాత ఎంతో తేలికగా ఉత్సాహంగా ఉందనీ అంటావు. కాబట్టి నిద్ర నీ అనుభవమే. ఆ నిద్రానుభూతి గలవాడే, ఈ మాట్లాడేవానిలోని 'నేను'గా తన్ను పోల్చుకొంటాడు. కాబట్టి ఇప్పటి 'నేను' నిద్రలో గూడ ఉండి ఉండాలి.

భ: అవును.

మ: కాబట్టి 'నేను' నిద్రలో వున్నది. అప్పుడు ప్రపంచం ఉంటే, అది తన ఉనికిని చాటిందా?

భ: లేదు. కాని జగత్తు తనను తాను ప్రకటించుకొంటోంది కదా. అది లేదని నేను త్రోసిపేసినా, నేనే రాతినో గుద్దుకొని దెబ్బ తగిలించుకుంటే ఆ గాయం, రాతి ఉనికినీ, అట్లే జగత్ స్థితినీ తెలియచేస్తుంది.

మ: నిజమే. రాయి కాలికి నొప్పి కలిగిస్తుంది. అది రాయియని కాలంటున్నదా?

భ: కాలుకాదు, నేను.

మ: ఆ 'నేనెవరు'? అది దేహంగాడు, మనస్సుగాదు. ఆ 'నేను' జాగ్రత్ స్వప్న సుషుప్తుల అనుభవం. ఆ మూడవస్థలు వ్యక్తిని బాధించే మార్పులుగావు. ఆ అనుభవాలు సినీతెరమీది బొమ్మలు. బొమ్మల రాకపోకలు తెరకేవిధంగానూ ఇబ్బంది పెట్టలేవు. అలాగే ఆ మూడవస్థలూ ఒకటినొకటి అనుగమిస్తుంటవేగాని ఆత్మను బాధించవు. జాగ్రత్స్వప్నాలు మనఃకల్పితాలు. కాబట్టి ఆత్మ అన్నింటినీ వ్యాపిస్తుంది. ఆత్మస్థితిని పూర్ణానందస్థితిగా తెలియడమే ఆత్మానుభవము. ఆత్మసిద్ధి ప్రయోజనము, పూర్ణతను అనుభవించుట ఆనందమును అనుభవించుటే.

భ: జగదానందానికి ఉపయోగపడని ఆ ఆత్మనందానికి పూర్ణతమేమి? చైనాలో, స్పెయిన్లో యుద్ధాలు రేగుతూంటే ఎవ్వరికేని సంతోషమెక్కడిది? ప్రపంచానికి సాయపడకుండా ఆత్మానందంలో మునిగి యుండటం, స్వార్థం కాదా?

మ: ఆత్మ జగత్సర్వాన్నీ ఆవరించి అధిగమిస్తుందని తెల్పడమయింది. ఆత్మకు వేరుగా జగత్తుండదు. అట్టి ఆత్మస్థితి స్వార్థమయితే, ఆ స్వార్థం ప్రపంచాన్నంతటినీ కప్పేదిగదా? దాన్ని హీనంగా చూడపనిలేదు.

భ: ఆత్మజ్ఞుడు, అనాత్మజ్ఞునివలెనే జీవితం వెళ్ళదీయడా?

మ: నిజమే. కొద్ది భేదంతో. ఆత్మజ్ఞుడు ప్రపంచం తనకు భిన్నమనుకోడు. పూర్ణతయిచ్చే శుద్ధ జ్ఞానం, అంతస్సుఖమూ అతనికి తెలిసియుంటాయి. అనాత్మజ్ఞునికి ప్రపంచం వేరు, తానువేరు. అతడేదో వెలితిని అనుభవిస్తూ సుఖం కోల్పోతాడు. అది తప్ప, శారీరక కర్మలు వారిర్వురికి సమానాలే.

భ: అనాత్మజ్ఞునికివలెనే ఆత్మజ్ఞునికి గూడ ప్రపంచంలో జరుగుతున్న యుద్ధాలు తెలుస్తాయి కదా?

మ: అవును.

భ: మరి అతని కానందమెట్లు?

మ: సినిమాలో అగ్నివిజృంభణము, సముద్రపు పొంగులవల్ల, తెరయేమన్నా చెడుతుందా? అలాగే ఆత్మవిషయం గూడ.

మనోదేహాలే తానన్న భావం, ఎవ్వరూ దాన్ని తప్పుకోలేనంతగా పాతుకొని ఉంది. వివేచన దాన్ని కాదన్నా, ఎవ్వరూ వినిపించుకోరు. ఒకడు కలగని, లేచి ఆ కల కల్లయని తెలిసికొంటాడు. మెలకువులోని ఈ ఎరుక ఇతర అవస్థల్లో కల్ల. ఇట్లు ఒక్కొక్క అవస్థ మిగత రెంటినీ బాధిస్తుంది. కాబట్టి అవి చూచేవానిలోని వికారాలు; ఆత్మపై తోచే ఘటనలు. ఆత్మమాత్రం అవిరళంగా, అబాధితంగా నిలిచియుంటుంది. ఎలా అయితే జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మారుతూ ఉంటాయో అదే విధంగా పుట్టుక, పెరుగుదల, చావు, ఆత్మలో మారుతున్నట్లు కనబడతాయి. ఆత్మ మాత్రం మార్పులేనిది. అబాధితం. పుట్టుచావులు కేవలం భావనలే. అవి మనోదేహాలకు చెందినవి. ఇవి పుట్టుకమునుపు, గిట్టిన వెనుక గూడ,ఆత్మసుస్థితమే. ఇదే పునర్జన్మ పరంపరలకూ వర్తిస్తుంది. ఆత్మ అమరము; విషయములు మార్పుచెందేవీ, మరణించేవీ. మృత్యుభీతి దేహానికి; ఆత్మకది చెల్లదు. ఆ భయం అజ్ఞానజనితం. ఆత్మసిద్ధి అంటే పూర్ణజ్ఞానమూ, అమృతత్త్వమూ. మృతిగూడ ఒక భావనే, దుఃఖాన్నిచ్చేది. ఆత్మయొక్క అమరత్వాన్ని ఎరిగి ఆ భయాన్ని వదల్చుకో.

ఆ ఆంగ్లవనితయే మళ్ళీ ఆరంభించింది:

భ: జగత్తు స్వప్నమే అయితే నిత్యసత్యంతో దాన్ని సమన్వయించే దెలాగ?

మ: అది ఆత్మకభిన్నమని తెలియడమే సమన్వయం.

భ: కాని కల తాత్కాలికము. మిథ్య. జాగ్రత్స్థితి దాన్ని వ్యతిరేకిస్తుంది.

మ: జాగ్రదనుభూతులూ అట్టివే.

భ: ఏభైఏండ్లు బ్రదికి ఒకరు తన జాగ్రదనుభూతిని ఎడతెగనిదని, అవిచ్ఛిన్నమని భావిస్తారు. కలవిషయమలా కాదు.

మ: నిద్రపోయి కలగంటావు. ఆ కలయే అయిదు నిమిషాలో ఉంటుంది.

కాని అంతలోనే ఏభైఏండ్లు అనుభవాన్ని కుదించివేస్తావు. ఆ స్వప్నానుభవం గూడ తెగత్రెంపులేనిదే. వీనిలో ఏది నిజం? మెలకువలోనిదా, కలలోనిదా? రెండవస్థల్లో కాలప్రమాణం వేరు. అంతే. అనుభవాల్లో భేదమేమీ లేదు.

భ: నశ్వరమైన విషయాలూ, జన్మాంతరాల్లో మారుతూన్న తను పరంపరలూ, ఆత్మనంటవు. కాని ప్రతిదేహమూ, సచేతనంగా వర్తిల్లడానికి దానికి జీవం ఎక్కడినుంచి వస్తుంది.

మః ప్రాణం, పదార్థం వేర్వేరు. ప్రాణం చేతనాపూర్ణం దేహానికి చైతన్యాన్ని ఇచ్చేదదే.

భ అయితే ఆత్మజ్ఞానే ఆ ప్రాణము (spirit) వానికి జగత్తే తెలియదు.

మ: ఆత్మజ్ఞుడు ప్రపంచాన్ని చూస్తాడు. కాని ఆత్మకు వేరుగా చూడడు.

భ: ఈ ప్రపంచం దుఃఖమయమైతే, అతడీ ప్రపంచ భావనను (world Idea) ఎందుకు కొనసాగించాలి?

మ: ఈ ప్రపంచంలోదుఃఖం తప్ప మరేమీ లేదని ఆత్మజ్ఞుడు నీకేమైనా చెప్పాడా? ఆత్మజ్ఞుడు కానివానికి ఆ బాధలు. ఈ ప్రపంచం దుఃఖమయమనడం, వాడు. వ్యక్తి అంతర్ముఖుడై ఆత్మలోనికి వెను తిరిగితే బాధవదలి పోతుందని అనుభవం గల విజ్ఞుడు వానికి చెపుతాడు. ఏ బాధ అయినా తనకు విషయం వేరైనంతదాకే, కాని ఆత్మ అవిభక్తమని తెలిసిన తర్వాత దుఃఖం ఉండదు; దుఃఖించేవాడు ఉండడు. ప్రజ్ఞాస్థితమైన మనస్సు పూతాత్మ (Holy spirit), ఇతరము పావనిలయము (Home of the devil) స్థితప్రజ్ఞునికది స్వర్గరాజ్యము. “స్వారాజ్యము నీలో ఉన్నది (Kingdom of heaven is within you)" ఆ స్వారాజ్యము ఇప్పుడే ఇక్కడే ఉన్నది.

## భాషణములు 488

యువకుల బృందంలో నొకరు - ఆరోగ్యవంతమైన దేహంలోనే అనామయమైన మనస్సుండునన్నారు. అందువల్ల దేహాన్ని ఆరోగ్యంగా, బలంగా ఉంచనక్కరలేదా?

మ: అలా చూస్తే, శరీర ఆరోగ్యంపై శ్రద్ధకు అంతంటూ ఉండదు.

భ: ఇప్పటి అనుభవం పూర్వకర్మానుసారం. పూర్వం చేసిన తప్పేమో తెలిస్తే దాన్ని దిద్దుకోవచ్చు గదా!

మ: ఒక తప్పే అయితే సరిదిద్దుకోవచ్చు. లెక్కకు మిక్కిలిగా జన్మలు కలిగించే ఆ సంచితమంతా ఏం కాను? కాబట్టి అవలంబింపతగ్గ పద్ధతి అది కాదు. మొక్క చివళ్ళు కత్తిరించే కొద్దీ అది మోపుగా బలుస్తుంది. కర్మను త్రోయ యత్నించే కొద్దీ అది పేరుకుంటుంది. కర్మ కూకటివేరును వెదకి దానిని కోసివేయి.

## భాషణములు 489

దర్శనార్థులు కొందరు ఆత్మను సాధించే మార్గాన్నడిగారు. భగవానన్నారు మనస్సును నిలిపి అదేమో విచారించమని ప్రారంభదశలోని సాధకునికి సలహా. ఇంతకూ మనస్సంటే ఏమి? అదీ ఆత్మ ప్రసరింపచేసిందే. అది ఎవరికి గోచరిస్తుందో, అది ఎక్కడ పుడుతుందో చూస్తే, దాని మూలకారణం, "నేను" భావనయని తెలుస్తుంది. ఇంకా లోతుకుపో. "నేను" భావన అదృశ్యమై, అనంతంగా విస్తృతమైన ఆత్మచైతన్యం మిగులుతుంది. దానినే 'హిరణ్యగర్భ'మంటారు. దానికి పరిధులు కల్పిస్తే, వ్యక్తిగా గోచరిస్తుంది.

## భాషణములు 490

ఒక ఆంగ్లేయ స్త్రీ భగవాన్తో ప్రత్యేకంగా మాట్లాడగోరింది. ఆమె యన్నది 'నే నింగ్లండు వెళ్ళిపోతున్నాను. ఈ సాయంత్రం ఇక్కడి నుండి ప్రయాణం. నా ఇంటిలోనే ఉంటూ ఆత్మానందాన్నభవింపగోరుతాను. పాశ్చాత్యదేశాల్లో అది అంత సులభం కాదనుకోండి. అయినా దానికై యత్నిస్తాను. అందుకుగాను ఏమి చేయాలి?

మ: ఆత్మస్థితి తనకు వెలుపలిదైతే, వ్యక్తి శక్తి భద్రతలనుబట్టి, దారి యిదియని చూపవచ్చు. ఆపైన అది సాధింపనగునా, ఎంతకాలానికి ఇత్యాది ప్రశ్నలు వస్తాయి. కాని ఇచట సాధింపవలసింది ఆత్మను. అది లేక నీవు లేవు. ఆత్మయెప్పుడూ సిద్ధమే. కాని నీవది గుర్తించడం లేదు. అంతే. జగద్బుద్ధి దాన్ని కప్పి నీకు కనబడనీయటం లేదు. ఇప్పుడు ప్రపంచం నీకు వెలిగానున్నట్లు చూస్తున్నావు. ఆ ప్రపంచ భావన నీ స్వభావాన్ని కప్పేస్తున్నది. ఈ అజ్ఞానాన్ని త్రోసిపుచ్చటమే నీవు చేయవలసింది; అప్పుడు ఆత్మ తనంతతానే తెలుస్తుంది. ఆత్మసిద్ధికై ఏ ప్రత్యేక యత్నమూ అక్కరలేదు. అన్ని యత్నాలూ దానికి గల ఆటంకాలను తొలగించడానికే.

ఒకామె మెడలో హారము వేసుకున్నది. అట్లని మరచి, అది పోయిందనుకొని ఆ వేగంతో యిటూ అటూ అంతటా వెదకింది; కనబడక పోవడంతో చెలులను వారికేమైన కనిపించిందేమో అడిగింది. చివరికి ఒక చెలి మెడతడవి చూచుకో అది అక్కడే ఉంది అంది. అట్లే చేసి ఆమె హారం దొరికిందని సంతోషించింది. తర్వాత ఇతరులడిగితే అవును దొరికిందంటుంది; ఒకప్పుడా హారం పోయినట్లు, మరల దొరకినట్లు; రెండూ జరగనే లేదు. అయినా, ఆమె దుఃఖపడింది. ఇప్పుడు సుఖం పొందింది. ఆత్మసిద్ధివిషయం అట్లే. ఆత్మ సిద్ధించే ఉంది. ఆత్మజ్ఞానము ఇప్పుడు ఆవృతమై ఉంది.; ఆవరణ తొలగించిన ఆ వ్యక్తి ఎప్పుడూ సిద్ధవస్తువుగా ఉన్న దానిని తిరిగి పొందినందుకు ఎంతో సంతోషిస్తాడు. ఎప్పుడూ ఉన్న ఆత్మసిద్ధి సరికొత్త ఆత్మప్రాప్తిగా వానికి అనిపిస్తుంది.

ఇప్పటి అజ్ఞానం వదలటానికేం చేయాలి? యథార్థజ్ఞానానికై ఉత్సుకతజూపు; ఆరాటపడు. ఆ ఆరాటం హెచ్చేకొద్దీ, అజ్ఞానం శక్తి తగ్గి చివరకంతరిస్తుంది.

భ: నిద్రలో ఎరుక ఉండదని నిన్ననే అన్నారు. కాని కొన్ని అరుదైన తరుణాలలో నిద్రలోగూడ నేను నిద్రిస్తూన్నానని తెలుస్తూ ఉండింది.

మ: ఎరుక, నిద్ర, నిద్రాజ్ఞానము ఈ మూటినీ తీసుకో, మొదటిది అవికారము. నిద్రనొక అవస్థగా గుర్తించిన ఆ ఎరుకే, మెలుకువలో ప్రపంచాన్ని చూస్తున్నది. నిద్రావస్థకు ప్రపంచం లేదు. ప్రపంచం కనుపించినా, కనుపించకున్నా, అంటే మెలుకువలోనూ నిద్రలోనూ, ఆ ఎరుక అబాధితమే. అది అవిరళమూ, పూర్ణమూ, దాని మీదుగా జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థలు కదలిపోతాయి. ఆ ఎరుకపై నీవిప్పుడుండు. అదే ఆత్మ, అదే ఆత్మానుభవం - అచటే శాంతి, అక్కడే ఆనందమూ. ఆమె భగవానకు కృతజ్ఞత తెలుపుకొని వెళ్ళిపోయింది.

## భాషణములు 491

గాంధీ సేవా సంఘం అధ్యక్షుడు, శ్రీ కిశోరీలాల్ మష్రూవాలా అడిగారు.

భ: బ్రహ్మచర్యము నభ్యసించుటెట్లు? జీవితంలో దాన్ని విజయవంతంగా నిర్వహించేదెట్లు?

మ: అది యిచ్ఛాబలంబట్టి ఉంటుంది. సాత్త్వికాహారం, ప్రార్థనాదులు కొంతవరకు సాయపడుతాయి.

భ: కుర్రవాళ్లు దురభ్యాసాలకు లోనైనారు, అవి మానివేయగోరి మా సలహా కోరుతున్నారు.

మ: మనో సంస్కారము కావలసియుంది.

భ: వారికేదైన ప్రత్యేక దేహపరిశ్రమ, ఆహారాదులను విధించమంటారా?

మ: వానికి కొన్ని మందులున్నవి, యోగాసనములున్నవి. సాత్త్వికాహారమూ ఉపయోగిస్తుంది.

భ: కొందరు యువకులు బ్రహ్మచర్యదీక్ష తీసుకొన్నారు. పదిపన్నెండేండ్లైన తర్వాత ఇప్పుడు ఆ వ్రతం ఎందుకు తీసుకున్నామా అని చింతిస్తున్నారు. ఇట్టి స్థితిలో ఆ దీక్షలోనే ఉండండి అని యువకులను ప్రోత్సహించటం మంచిదా?

మ: నిజమైన బ్రహ్మచర్యం విషయంలో ఈ ప్రశ్నలు రావు.

భ: ఆ వ్రతం పుచ్చుకోకముందు, కొందరందలి సాధకబాధకాలు ఆలోచించరు.

ఆచరణ కష్టమయ్యేసరికి వారు మా సలహా అడుగుతారు. మ: వాళ్ళు ఏ దీక్షా, ఏ వ్రతమూ తీసుకొనకే బ్రహ్మచర్య మభ్యసించరాదా?

భ: ఆత్మజ్ఞానానికి సాధనగా నైష్ఠిక బ్రహ్మచర్యం విధియా?

మ: ఆత్మానుభవమే నైష్ఠిక బ్రహ్మచర్యము. ప్రతిజ్ఞామాత్రం బ్రహ్మచర్యం కాదు.

బ్రహ్మములో జీవితం గడపడమే బ్రహ్మచర్యము. బలవంతంగా చేసే ప్రయత్నం కాదు.

భ: సద్గురుని సన్నిధిలో కామక్రోధాదులు నశిస్తాయంటారు. నిజమా?

మ: నిజమే. ఆత్మసిద్ధికి పూర్వమే కామక్రోధాలు పోవాలి.

భ: కాని సాధకులందరి పరిణతి ఒకటిగనే ఉండదు. వారిలో కొందరు వ్రతాన్ని అవలంబించరు. ఆ దిగజారడానికి (చ్యుతికి) ఎవరు బాధ్యులు?

మ: ఆత్మసిద్ధికి వ్యక్తిసంస్కారాలకూ ఏ సంబంధమూ లేదు. గురువు నిర్దేశించిన లక్ష్యంలో జీవించడం ఎల్లరికీ, ఎల్లప్పుడూ సాధ్యం కాదు.

భ: కామాదులు ఆత్మసిద్ధి నడ్డవా?

మ: తన్ను తాను శుద్ధిచేసుకోవటానికి ప్రయత్నం స్వతహాగా జరుగుతుంది.

భ: ఆత్మసిద్ధికి మునుపు సర్వకల్మష క్షాళనం అవసరం కాదా?

మ: జ్ఞానం వాళ్ళను శుద్ధులను చేస్తుంది.

భ: తన కత్యంతం సన్నిహితులైన శిష్యులు కొందరు దారి తప్పిపోతుంటే చూచి గాంధీజీ చాల కలవరపడుతున్నారు. ఇది ఎలా జరుగుతోందని ఆశ్చర్యం ఆ దోషాలన్నీ తన లోపాలవల్లనే అని వారి ఆలోచన. అది సరియేనా?

భగవాన్ చిరునవ్వు నవ్వి కొంతసేపాగి పలికారు -

మ: ఎన్నేండ్లో కష్టపడి గాంధీజీ పరిపక్వమైన స్థితికి వచ్చారు. ఇతరులు కూడా కాలక్రమేణా అట్లే సరిఅవుతారు.
భ: హిందువుల పునర్జన్మ సిద్ధాంతము సరియైనదేనా?

మ: ఈ ప్రశ్నకు సమాధానం నిశ్చితరూపేణ సాధ్యంకాదు. దానికి అనుకూల, ప్రతికూలవాదాలున్నాయి. ఇప్పటి జన్మ కూడా లేదనిలేదా? "నత్వేవాహం, జాతునాసం" అన్నది గీత. మన మసలు పుట్టనేలేదట.

భ: వ్యక్తిత్వము (Individuality) అనాది కాదా?

మ: వ్యక్తిత్వ మసలుందో లేదో విచారించు. ఈ సమస్యను పరిష్కరించిన తర్వాత ఆ ప్రశ్న నడుగు. నమ్మాళ్వారు అంటారు - "అజ్ఞానం వల్ల అహంకారాన్నే నేననుకున్నాను. కాని సద్బోధతో చూస్తే అహంకారం చిహ్నాలే లేవు. నీవాత్మగా మిగిలావు." ప్రాప్యం ఆత్మసిద్ధియని ద్వైతులూ అద్వైతులు గూడ అంగీకరిస్తారు. అది మొదట సాధించి ఆ తర్వాత యీ అప్రధానవాదాల పరిశీలించవచ్చు. ద్వైతమూ, అద్వైతమూ వాదాలవల్ల నిర్ణయింపబడవు. ఆత్మసిద్ధిస్తే, ఆ ప్రశ్నేరాదు. తన బ్రహ్మచర్యంలో శుకునంతవానికి దృఢవిశ్వాసం కలుగలేదు. కాని శ్రీకృష్ణుడు తన బ్రహ్మచర్యం దృఢంగా నమ్మాడు. ఆత్మస్థితి కెన్నో పేర్లు - సత్యం, బ్రహ్మచర్యము, ఇత్యాదులు. ఆత్మస్థితిలో సహజమైనది మరోస్థితిలో సాధించవలసినదౌతుంది, అంటే సాధనా క్రమంలో భాగమౌతుంది. ఆత్మసిద్ధి సమయంలోనే దేహాత్మబుద్ధి నశిస్తుంది. దానినాశంతో వాసనలు నశించి, ధర్మము, (అన్ని మంచిగుణాలు) మిగిలి వెలుగుతుంది.

భ: జ్ఞానిలో గూడ సంస్కారములు మిగిలి ఉంటాయంటారు.

మ: నిజమే. కాని అవి భోగ హేతువులు, బంధహేతువులు కావు.

భ: ఈ సత్యాన్ని ఎందరో కపట సాధువులు తమ దుర్నీతిని కప్పుకొనేందు కుపయోగించుకుంటున్నారు. అడిగితే, అది ప్రారబ్ధమంటారు. ఇట్టి కపటులను నిజమైన సన్న్యాసులనుండి వేరుగా గుర్తించుటెట్లు?

మ: కర్తృభావన తొలగినాతనికి 'ఇది నా ప్రారబ్ధ'మనే మాటే రాదు. 'జ్ఞానుల జీవితం విశిష్టమని ఇతరుల అనుకూలానికైన చెప్పబడిన మాటేగాని, తమ జీవితాన్ని, నడతను సమర్థించుకొనేందుకై జ్ఞానులు అనవలసిందిగాదు. కొంతసేపు తర్వాత కిశోరీలాల్ను అంత దుర్బలంగా నున్నారేమని భగవానడిగారు.

కిశోరీలాల్ - 'నాకు ఉబ్బసం. బలంగా నే నెప్పుడూ లేను. బిడ్డగానున్నప్పుడు గూడ తల్లిపాలు త్రాగి ఎరుగను.'

మ: ఇక్కడ మనస్సు బలంగానూ, దేహం బలహీనంగానూ ఉంది.

భ: రాజయోగ మభ్యసిస్తామనుకున్నాను. దేహబలహీనత నన్ను అది చేయనీయలేదు. దేహ పరిస్థితితో మనస్సూ కూడా చలించేది.

మ: మనస్సు నిశ్చలంగా ఉంచగల్గితే, దేహం ఎలా మారితే అలా మారనీ.

భ: సాధన క్రొత్తగా ఆరంభించేవానికి దేహదౌర్బల్యం ప్రతిబంధకం గాదా?

మ: అన్ని ప్రతిబంధాల నెదుర్కొంటూనే సాధన ప్రయత్నాలు చెయ్యాలి.

భ: నిజమే, అవి తాత్కాలికాలే.

మ: తాత్కాలికాలన్నది గూడ ఎన్నో ఆలోచనలలో ఒకటి. ఆలోచన లున్నంతకాలం ఈ భావన గూడ మరల మరల కలుగుతూనే ఉంటుంది. ఏకాగ్రత మన స్వభావం (స్థితి-త్వము) (Being). ప్రయత్నము ఇప్పుడే, ఆత్మసిద్ధి తర్వాత ఏ ప్రయత్నమూ ఉండదు.

భ: ఏకాగ్రతను మనస్సు చలనాలలో మధ్య ఉండేది అంటారు కదా.

మ: అది గూడ మనోవృత్తియే.

చాల మౌలికమైన క్రొత్తను తాను కనుగొన్నానను కొన్నప్పుడెల్లా పిదప త్వరలోనే దాన్ని తత్పూర్వమే మరెవరో కనిపెట్టారని తెలిసేదన్నారు కిశోరిలాల్. సర్వమూ బీజప్రాయంగా ముందే ఉందనీ, సరిక్రొత్తయేదీ లేదనీ శ్రీ భగవాన్ చెప్పారు.

## భాషణములు 492

అరుణాచలేశ్వర దేవాలయము, కొండ తమదంటూ గవర్నమెంటు పై వేసిన కేసులో భగవాన్ను సాక్షిగా పేర్కొన్నారు. కోర్టుకమిషన్వారు వారి సాక్ష్యాన్ని సేకరించారు. తన వాఙ్మలంలో శ్రీ భగవాన్ తెలిపారు శివుడు సర్వదా మూడు రూపాలుగా వెలసి ఉంటాడు.

1. పరబ్రహ్మముగా, 2. ఇచట గిరివలె లింగముగా, 3. సిద్ధునిగా. ఈ కొండపై కొన్ని తీర్థాలున్నవి. ములైపాల్, పాద తీర్థాలు. శ్రీ విరూపాక్ష దేవర, శ్రీగుహనమశ్శివాయలు స్వయంగానో వారికై ఇతరులో త్రవ్వినవి. మరొకటి ఋషభ తీర్థం కూడ ఉంది. అవన్నీ మంచి స్థితిలోనే ఉన్నాయి.

ఆదిలో జ్యోతి స్తంభంగా శివుడు గోచరించాడు. అందరూ ప్రార్థించగా ఆ జ్యోతి కొండలో లీనమైంది, లింగాకృతినీ తాల్చింది. ఆ రెండు గూడా శివుడే.

మహర్షి: నలువైపులా భవనాలు, ఆశ్రమాలూ పెరుగుతున్నాయి. అవి నేను కోరి కాదు. నేను వానికై అడగను, వాని నిర్మాణాన్ని ప్రతిఘటించను. నేను వలదన్నవి కూడ కొన్ని జరుగుతూండటం నాకు తెలుసు. అవి అట్లు జరగడం విధియనుకున్నాను. అందువల్ల వానిని కాదనను.

భక్తుడు: ఇప్పటి సర్వాధికారి మీకు వారసులా?

మ: అవును. నిర్వహణ మాత్రమే. (వారసత్వం అంటే కేవలం పర్యవేక్షణ మాత్రమే.)

భ: ఇప్పుడన్నీ వ్యవహారాలు వారే చూస్తున్నారా?

మ: అతడు పనులను పర్యవేక్షిస్తున్నాడు. ఆశ్రమం పనులు ఇతరులూ చేస్తుంటారు.

## భాషణములు 493

ఆంధ్రులొకరు - తమ పవిత్ర చరణాలపైనే ధ్యానం నిల్పవలెనంటే నాకేది సాయకారి అవుతుంది?

మహర్షి: "నేనాపాదాల కెప్పుడైనా దూరంగానున్నానా" అన్న ఆలోచన.

భక్తుడు: ఆ ఆలోచన స్థిరమయ్యేదెట్లు?

మహర్షి: దానికి విరుద్ధాలైన ఆలోచనలనెల్ల తరిమివెయ్యడం ద్వారా.

## భాషణములు 494

"ప్రాచ్యంవైపు మరలు (టర్న్ ఈస్ట్ వర్ట్స్") అనే పుస్తకం. మేడమెసెలె పాస్కలైన్ మాలర్ట్ రచించింది. దాన్ని పూర్తిగా చదివి దానిపై సుమారొక గంటసేపు శ్రీ భగవాన్ ప్రసంగించారు. రచయిత్రి చాల శ్రద్ధగా నమ్మి, వ్రాసిన పుస్తకం; శైలి సరళం; ఆత్మస్మరణతో అంతమౌతుంది. కొన్ని పొరపాట్లున్నాయి. కాని వానిని వచ్చే ముద్రణలో సవరించుకోవచ్చు. నందనారు చరిత రెండుమారులు చెప్పబడింది. కాని యాఘటన వేర్వేరు తరుణాల్లో జరిగిందని పొరపడింది. పృథివ్యాది లింగాల స్థలాలు తప్పుగా చెప్పబడ్డాయి."

'ప్రాచ్యంవైపు మరలు' అన్న మకుటాన్ని శ్రీభగవాన్ 'తేజోమూలంవైపు దృష్టిమరల్చు' మని భావించినట్లున్నది. పాల్గంటన్ గ్రంథానికిది మంచి యనురచన (supplement) అన్నారు భగవాన్.

## భాషణములు 495

ఒక కొచ్చిన్ బ్రాహ్మణుడు. ఏర్నాకులం కాలేజిలో ప్రొఫెసర్ ఆయనకూ శ్రీభగవాన్ కూ జరిగిన సంవాదం చాల ఆసక్తికరంగా ఉంది. భగవాన్ దైవానికి శరణాగతి చేయమంటారు. అతడు తన పాత ఐ.సి.ఎస్. ఉద్యోగలక్షణం చూపాడు. అతడు విద్యార్థిగా ఉన్నప్పుడు నాస్తికుడు, నిరీశ్వరవాది. అతడిప్పుడు దైవవిశ్వాసం, సంప్రదాయం యెడల ఆదరం చూపునంతగా మారడం, అతన్నెరిగిన వారికెంతో ఆశ్చర్యంగా ఉండేది. ఆ సంవాదంలోని కొన్ని అంశాలు భక్తుడు: కోరికలన్నీ అనుభవించి తనివితీరిన వెనుకే దానిని వదలాలి.

మహర్షి: (నవ్వి) నిజమే. అగ్నిని ఆపడానికి మొదట దానిపై ఇంధనం వేయాలి. (అందరూ నవ్వారు) కోరికలను తృప్తిపరిచేకొద్దీ ఆ సంస్కారం గాఢతరమౌతుంది. అవి నిలవద్రొక్కుకోకుండా బలహీనం చేయాలి. వాని యా దౌర్బల్యం, వానిని నియంత్రిస్తేనే సాధ్యపడుతుంది; వానిలో మగ్నం అయితే కాదు.

భక్తుడు: వానిని బలహీనపరచే దెలాగ?

మ: జ్ఞానం వల్ల. మనస్సు నీవు కావని తెలుసుకో. కోరికలు మనస్సులోనివి. జ్ఞానం మనోనిగ్రహానికి సాయపడుతుంది.

భ: కాని వ్యవహారిక జీవితంలో అవి వశం కావటం లేదు.

మ: కోర్కెను తృప్తిచేయ యత్నించినప్పుడెల్లా, జ్ఞానం దాన్ని మానటం మంచిదని హెచ్చరిస్తుంది. ఇట్టి హెచ్చరికలు హెచ్చేకొద్దీ కాలక్రమంలో కోరికలు సన్నగిల్లుతాయి. నీ యథార్థస్వభావమేమి? దానిని ఎలా మరువ గలవు? జాగ్రత్ స్వప్న సుషుప్తులు కేవలం మానసిక దశలు. అవి ఆత్మకు చెందవు. ఆ అవస్థలకు నీవు సాక్షివి. నీ యథార్థ స్వభావము నీ నిద్రలోనిది.

భ: ధ్యానంలో ఉండగా నిద్ర పోకూడదన్నారే?

ము నిన్ను కాపాడుకోవలసింది నిద్రమత్తునుండి. జాగ్రన్నిద్రలు క్రమానుగతాలైతే, అట్టి నిద్ర నిజమైన నిద్ర గాదు. అట్టి జాగ్రత్తు నిజమైన జాగ్రత్తు గాదు. నీవిప్పుడు మేల్కొనియున్నావా? లేదు. నీ నిజస్థితి నెరుగుట (అందు మేల్కొనుట) అవసరము. నీవు ఈ మిథ్యా నిద్రలోగాని, ఈ మిథ్యా జాగ్రత్తులో గాని చిక్కుపడకు. అందుకే 'లయే సంబోధయేచ్చిత్తమ్, విక్షిప్తమ్ సమయేత్పునః' అంటే ఈ అవస్థలు పేనికీలోను చిక్కుకోకుండా ఉండగలదని అర్థం. వానిమధ్య నీ నిజస్వభావాన్ని కలుషితంగానీక మెలగుమని అర్థం.

భ: ఆ దశలూ మనోదశలేగదా?

మ: ఎవరి మనస్సు? దాన్ని పట్టుకో. అది చూడు.

భ: మనస్సు గ్రాహ్యం కాదు. వీనినన్నిటినీ అదే కల్పిస్తుంది. ఫలితాలనుబట్టి దాని పోల్చాలిగాని, దాని నిజస్వరూపంగా సాధ్యంకాదు.

మ: అలాగే. కిరణవిశ్లేషణంలో రంగులుచూడు. అవన్నీ కలిసి తయారయేది ఒకే ఒక్క తెలుపు. పట్టకం (prism) గుండా చూస్తే ఏడురంగులు కనిపిస్తాయి. అలాగే ఒక ఆత్మ. మనస్సు, దేహము జగమూ అంటూ బహుదశ లందిస్తుంది. ఆత్మను దేహంగా, మనస్సుగా, జగత్తుగ చూస్తావు. అంటే నీవేవిధంగా చూడదలచుకొంటే అది నీ కట్లే కనిపిస్తుంది.

భ: ఇవన్నీ ఆచరించటం కష్టం. నేను దైవాన్ని నమ్ముకొని శరణాగతి చేస్తాను.

మ: అదే ఉత్తమము.

భ: సంగరహితంగా విధులెలా నిర్వహించేది? భార్యయుంది, పిల్లలున్నారు.

వారి కోసం జరుపవలసిన బాధ్యతలున్నాయి. అందుకుప్రేమ అవసరం అవునా?

మ: నీవు కాలేజివిధులెట్లు చేస్తున్నావు?

భ: (నవ్వుతూ) వేతనానికై.

మ: సంగం యుండిగాదు కదా. బాధ్యతగానే కదా. అంతే.

భ: కాని విద్యార్థులు నా ప్రేమను ఆశిస్తారు.

మ: 'బాహ్యంగా సంగం, అంతరంలో నిస్సంగం' అంటుంది యోగవాశిష్టం.

## భాషణములు 496

రామకృష్ణమిషన్కు చెందిన స్వామి యొకరు శ్రీభగవాన్తో సంవాదం చేసారు. భగవాన్ ఆయనతో అన్నారు - 'ఇప్పుడు గూడ నీ నిజస్వరూపం తెలియనీయనిది అవిద్యయే.

భక్తుడు: అవిద్యను దాటేదెలా?

మహర్షి: యా నవిద్యతే సా అవిద్యా (ఏది లేదో అది అవిద్య) కాబట్టి అసలదే అబద్ధం. దానికి నిజంగా స్థితియుంటే అది నాశమెట్లాతుంది? అది ఉండటమే అబద్ధం. అందువల్ల అది నష్టమవుతుంది.

భ: నాకు బుద్ధితో తెలిసినా, ఆత్మ సాక్షాత్కారం పొందలేకున్నాను.

మ: ఈ ఆలోచన, నీ ఇప్పటి ఆత్మస్థితికి ఏల విక్షేపం కలిగించాలి.

భ: ఆత్మ ఏకం. కాని ఇప్పటి దురవస్థనుండి బయటపడలేకున్నాను.

మ: అలా అనేదెవరు? అలా అనేది ఆత్మ? అది ఏకమే. ఆ ప్రశ్న ఆ ప్రశ్ననే

వ్యతిరేకిస్తుంది.

భ: ఆత్మలబ్ధి కనుగ్రహం అవసరం.

మ: ప్రస్తుతం నీవు కేవలం మానవమాత్రుడవనీ, నిన్నేదో ఉచ్చతరశక్తి నడుపుతున్నదనీ గ్రహించావు గదా? అది ఆ అనుగ్రహం వల్లనే. అనుగ్రహం నీలోనేయుంది ('ఈశ్వరోగురురాత్మేతి'- ఈశ్వర, గురు, ఆత్మలు సదృశములు),

భః ఆ అనుగ్రహం కోసం ప్రార్థిస్తున్నాను.

మ: సరి, సరి.

## భాషణములు 497

శ్రీభగవాన్ వివరిస్తున్నారు.

సత్త్వం = తేజస్సు, రజస్సు = కర్త, (subject) తమస్సు = విషయము (object) సాత్త్విక తేజస్సు గూడ ప్రతిబింబిత కాంతే. అదే ఆద్యమూ, శుద్ధమూ అయితే నిలో హెచ్చు తగ్గులుండవు? మానసాకాశ ప్రతిబింబమే భూతాకాశము. ఈ విషయములు కర్తకు భిన్నములుగా గోచరిస్తాయి.

వ్యవహారదశలో గూడ సమాధి ఉంది. సమాధికి వెలిగా ఎట్టి వ్యవహారాలూ లేవు. చిత్రములు ప్రసరించినప్పుడూ, లేనప్పుడు గూడ సినీతెర ఉంది. అలాగే ఆత్మ, వ్యవహారంలోనూ శాంతిలోను గూడ సుస్థితమే.

## భాషణములు 498

ముక్తపురుషుడు సంచారంచేసి ప్రజలకు సందేశ మీవలెనని పలువురి ఆలోచన. చుట్టూ దుఃఖం తాండవిస్తుంటే, ఎవరుగాని ముక్తులెట్లౌతారని వారి వాదం. నిజమే కాని, ఎవరు ముక్తుడు? అతడు తన ప్రక్కన దుఃఖం చూస్తాడా?

తాము ముక్తులు కారు; కాని ముక్తులస్థితిని తాము నిర్ణయింప బూనుకుంటారు. ముక్తుని దృష్టిలో వారివాదం - 'ఒకనికి కల వస్తుంది; అందులో అతడెందరినో చూస్తాడు. నిద్రలేవగానే, కలలో తాను చూచిన వారెల్లా మేల్కొన్నారా'అని అడిగినట్లుంది, ఇది హాస్యాస్పదం.

మరొక సజ్జనుడంటాడు "నాకు ముక్తిలేకున్నా ఫరవాలేదు. ఒకవేళ అవసరమైతే, ఈలోగా ఇతరులందరూ ముక్తులయ్యేందుకు సాయంచేసి, వారిలో చిట్టచివరివాడనుగా ఉండాలని నా కోరిక"

అంతా బాగానే ఉంది. ఒకరు కలగంటున్నాడనుకో - "నేను మేల్కొనక ముందు, నేనిప్పుడు చూస్తున్నవారందరూ మేల్కొంటే బాగుండునని. ఈ కలగనేవాడు పై జెప్పిన వేదాంతి కేమాత్రం తీసిపోడు.

## భాషణములు 499

ఆ రామకృష్ణమిషన్ స్వామి మరికొన్ని ప్రశ్నలడిగారు.

భక్తుడు: స్వామీజీ, తాము యువకులుగా ఈ కొండపై నున్నప్పుడు వసించిన ఆశ్రమాలు చూచాను. జీవిత చరిత్రమూ చదివాను. ఆ రోజుల్లో తాము దైవమొకడున్నాడనీ, ఇప్పటి తమ ఈ స్థితి నందటానికై ఆ దైవాన్ని ప్రార్థించవలెనని, లేక ఏదైనా సాధనచేయవలెననీ అనుకున్నారా?

మహర్షి జీవితాన్ని చదువు; అర్థమవుతుంది. జ్ఞానాజ్ఞానాలు రెండూ సత్యంలో ఒకేతరంలోనివి; అంటే రెండూ, తెలియనివారి యూహలన్న మాట. అవి జ్ఞానిదృష్టిలో సత్యం కావు.

భ: జ్ఞాని పాపకర్మచేయడం సంభవమా? అలా చేయగలడా?

మ: ఒక అజ్ఞాని మరొకరిని జ్ఞానియనుకొని వానిని వాని దేహంతో అన్వయిస్తాడు. ఎందుకంటే వానికి ఆత్మ తెలియదు. దాని వలన దేహమే ఆత్మయని వాని భ్రమ. తన స్థితినే జ్ఞానికి కూడా ఆపాదిస్తాడు. వానిదృష్టిలో జ్ఞాని, కేవలం భౌతిక రూపం మాత్రమే.

తాను కర్త కాకున్నా, కర్తననుకొని, అజ్ఞాని దేహమొనర్చేవన్నీ తన ఆచరణలే యనుకొని, జ్ఞానిచర్యలూ తన చర్యలవంటివేయని అనుకుంటాడు. కాని నిజం జ్ఞానికి తెలుసు. అతడట్లు భ్రాంతిపడడు. జ్ఞాని స్థితిని అజ్ఞాని తెలుసుకోలేడు. అట్టి ప్రశ్నలు అజ్ఞానిని వేధించేవేగాని, జ్ఞానినేవిధంగానూ కలతపెట్టవు. ఆయన కర్త అయితే, కార్యస్వరూపం నిర్ణయించ వలసిందీ ఆయనే. ఆత్మ కర్త కావడం వీలు లేదు. కర్త ఎవరో కనుక్కో ఆత్మ సాక్షాత్కరిస్తుంది.

భ: ఆచరణలో అద్వైతం లేదుగదా? అందువల్ల ఈ ప్రశ్నలు వచ్చేది.

మ: ఉండవలె నంటుంది శ్లోకం. ఈ విధి సాధకునికేగాని, సిద్ధునకు కాదు. భః అవును, బోధపడింది. గురువునెడ అద్వైతం పనికిరాదు. అట్టివాడు ఉపదేశం పొందే మాటే ఉండదు.

మ: అవును. కాని గురువుండేది అంతరంగంలో, బయటగాదు. "గురుదేవా, సదా నా అంతరంగంలో సుస్థితుడవై, మానుషరూపంలో తోచి, నన్ను నడపుతూ రక్షిస్తూ ఉన్నావు' అనియొక తమిళయతి పాడాడు. అంతరంగంలో ఆత్మగానున్నదే, క్రమశః మానుషరూపంలో గురువుగా ప్రకటిత మౌతుంది.

భ: తాత్పర్యం నాకిట్లుగా తోస్తున్నది - జ్ఞానిని చూడటం వారిని తెలుసుకోవడం గాదు. జ్ఞానిదేహాన్నే చూస్తాముగాని జ్ఞానాన్నిగాదు. జ్ఞానిని అర్థం చేసుకోవాలంటే జ్ఞాని కావాల్సిందే.

మ: జ్ఞాని ఎవరినిగాని అజ్ఞానియనుకోడు. ఆయన దృష్టి కందరూ జ్ఞానులే. అజ్ఞానిదశలో ఒకరు తన అజ్ఞానాన్ని జ్ఞానికారోపించి, వానిని కర్తగా భ్రాంతిపడతారు. జ్ఞానిస్థితిలో, జ్ఞానికేదీ ఆత్మకు భిన్నం కాదు. ఆత్మశుద్ధజ్ఞానము, తేజోమయము. కావున జ్ఞానిదృష్టిలో అజ్ఞానమే లేదు. ఈ రకపు భ్రాంతికి, లేక అధ్యారోపాని కొక ఉదాహరణ చెప్పారు. ఇద్దరు మిత్రులు ప్రక్కప్రక్కగా పరుండి నిద్రించారు. ఒకడు కలగని, తామిర్వురూ దూరయాత్రచేసి ఏవేవో వింతలైన అనుభూతులను పొందామని భావించాడు. మేల్కొన్న పిదప తమ స్వప్నయాత్రను మిత్రునికి వర్ణించి చెప్పి, చెప్పింది సరేకదా అని అడిగాడు. రెండవవాడు వానిని గేలిచేసి, నీది వట్టికల, నే నే యాత్రా చేయలేదు పొమ్మన్నాడు.

ఇతరులపై స్వభ్రాంతిమూలకమైన అధ్యారోపాలు చేసే అజ్ఞానిగతి ఇట్టిది.

చిన్నతనంలోని అజ్ఞానం, ఇప్పటి జ్ఞానం గురించి శ్రీ భగవాన్ ఇట్లన్నారు - సాధారణంగా అందరూ అనుకొనే జ్ఞానం, నిజమైంది కాదు. వారనుకొనే జ్ఞానాజ్ఞానాలు సాపేక్షకాలు, కల్లలు. అవి నిజంగావు గనుక నశించేవే. సత్యస్థితి, అద్వైతస్థితియే. అది నిత్యం. మనకు తెలిసినా, తెలియకున్నా, అది సుస్థిరంగా వుంటుంది. అది వేదాంతంలో చెప్పబడే "కంఠాభరణము" లేదా "పదవవాడు" వంటిది.

భ: ఈ నిజం తెల్పడానికి మరొకరు కావాలి కదా.

మ: ఆ ఒకరు బయట లేడు. దేహాన్ని గురువని భ్రమిస్తావు. కాని గురువు తన్నట్లనుకోడు. గురువు రూపంలేనివాడు. అది నీలోనిది. అతడు బయట గోచరించేది నీకు మార్గదర్శనం చేయడానికే.

## భాషణములు 500

భక్తుడు: ఆలోచనలన్నీ పోగొట్టిన పిదప మనస్సు నిశ్చలమౌతుంది, తన శూన్యస్థితి ప్రాప్తిస్తుంది. అటువంటప్పుడు ధ్యేయ సాక్షాత్కారానికి సాధకునియొక్క సాధన స్వరూపం ఎలా ఉండాలి? (ఉదాహరణకు మామిడిని మామిడిగా చూడడంవలె.)

మహర్షి: శూన్యాన్ని చూచేదెవరు? సాక్షాత్కారమేమి? మామిడిని మామిడిగా చూడటం, ప్రత్యక్షమంటావా? వీనికన్నిటికి కరణం, కార్యం, కర్తల త్రిపుటి అవసరం. కాబట్టి అది సాపేక్షకమేగాని నిరపేక్షంకాదు. ఒక విషయాన్ని నీవు చూచి తర్వాత అది కనుపించకపోతే, అది అటుపై లేనేలేదంటావు. రెండూ మనోవృత్తులే. ఉందన్నా, కాదన్నా, రెంటికీ ఆధారం ప్రత్యక్షమే. ప్రత్యక్షాలు పలురకాలు - ఇంద్రియ ప్రత్యక్షము. (ఇంద్రియాలు నేరుగా గుర్తించేవి); మానసిక ప్రత్యక్ష (నేరుగా మనస్సు గుర్తించేవి); సాక్షాత్ ప్రత్యక్ష ( తన స్వరూపంగా అనుభవ జ్ఞానం) ఈ చివరిది బ్రహ్మస్థితిలో నుండటం; అదే సత్యం. మొదటి రెండూ సాపేక్షికాలు (relative) మిథ్యలు.

భ: ప్రయత్నమే అక్కరలేకుంటే స్థిరమైన మనస్సుయొక్క శూన్యస్థితిని ఆత్మస్థితి యనవచ్చునా?

మ: మనస్సున్నంతకాలం యత్నముండవలసిందే. అన్ని వేదాంతాల్లోనూ, ఈ శూన్యస్థితిని గూర్చిన వివాదము ఉంది.

భ: ఆత్మానుభవదశలో, ప్రత్యక్షభావము ఏదైనా ఉందా? లేదా ఆత్మానుభవము కేవలం భావనా గోచరమా లేదా సత్యముగా గానీ ఆత్మస్థితిగా గానీ అనుభవగోచరంగా ఉంటుందా?

మ: ప్రత్యక్షము పరమస్థితి (వాస్తవమైన సత్తాయే) అది భావనామాత్రం గాదు. భ: సాధకుడు సాధ్యమూ తానేనని కనుగొన్నదాకా వానికి ప్రశ్నలుండనే ఉంటాయి.

మ: నిజమే. నీవు సాధకుడవేమో చూడు. సామాన్యంగా ఆత్మను జ్ఞాతయనుకొంటారు. అది తప్పు. నిద్రలో (అంటే అవిద్యలో) ఆత్మలేదా? కాబట్టి ఆత్మ, జ్ఞాతకు జ్ఞానానికి గూడ అవ్వలిది. ఈ శంకలన్నీ మనోతలానికి చెందినవి. ఈ

దృష్టితో చెప్పేటైతే, మనస్సును నిర్మలంగా ఉంచుకొమ్మని సలహా. రజస్తమాలను దిగవిడిచిన తర్వాత సాత్త్వికమనస్సే వుంటుంది. అప్పుడు 'నేను' సత్త్వంలో లీనమవుతుంది. (ఊనాదల్ కణ్)

జ్ఞాన చక్షువు, ఇతర ఇంద్రియాలవలె, చూచేందుకై అవయవం కాదు. 'జ్ఞానమేవ చక్షుః' టెలివిజన్ లాంటివి జ్ఞానచక్షుప్రవృత్తులు కావు. కర్తయున్నంతకాలం విషయం వుంటుంది. ఆ జ్ఞానం సాపేక్షం (relative) దాని కవ్వలిది యథార్థజ్ఞానం; అది నిరపేక్షము (absolute) స్వతంత్రము.

కర్తవిషయముల రెంటికీ మూలము ఆత్మయే. అజ్ఞానప్రాబల్యం వల్ల కర్తనే విషయానికి మూలమనుకోవడ మవుతున్నది. కర్తయే జ్ఞాత, త్రిపుటిలో ఒక భాగము. ఆ మూడూ ఒకటివిడిచి మరియొకటి ఉండేవి కావు. కాబట్టి కర్తయను, జ్ఞాతయను - అతడు పరమసత్యం కాజాలడు. కర్తృవిషయాల కతీతమైనది సత్యం. ఆత్మజ్ఞానం సిద్ధించాక ఏ శంకలకూ తా వుండదు.

'భిద్యతే హృదయగ్రంథిః. ఛిద్యన్తే సర్వసంశయాః'

హృదయగ్రంథి తెగిపోతుంది. సంశయాలు నశించును. ప్రత్యక్షమంటే అది, నీవనుకొనేది గాదు. అవిద్యానాశమే ఆత్మసిద్ధి. ఆత్మసిద్ధియనే మాట ఔపచారికమే. ఆత్మలబ్ధియనేది అజ్ఞాన నిర్మూలనానికి పెట్టిన శుభనామము.